పిల్లల్లో ప్రశ్నించే గుణాన్ని పెంపొందించే

కె. ఎల్. కాంతారావు రచన

"భారతదేశ చరిత్ర -ప్రాచీన మధ్యయుగాలు" ను

చదవండి ! చదివించండి!!

వీరి ఇతర రచనలు

1) నమ్మకాలు - వాస్తవాలు
2) మూఢ విశ్వాసాలు - సైన్సు సమాధానాలు
3) దేశమును ప్రేమించమన్నా
4) బాలలు - దేశభక్తి
5) విశ్వావతరణం నుండి నరావతరణ వరకు
6) అబద్ధాలే ఆయుధాలు
7) ప్రాచీన భారతదేశంలో భౌతికవాద సంప్రదాయాలు
8) జ్యోతిష్యం శాస్త్రమా?
9) ఆంధ్రప్రదేశ్‌లో అన్ని ఇళ్ళకూ వాస్తుదోషం ఉంది
10) బాబాలు, భక్తులు - స్వాములస్వాములు
11) 2012 కలియుగాంతం
12) కె.జి. బేసిన్ గాస్ - రిలయన్స్ కోసమా? సెల్ఫ్ రిలయన్స్ కోసమా?
13) స్వయం సేవకులారా! కళ్ళు తెరవండి! (విశ్వం అనే కలం పేరుతో)
14) విష కౌగిలి (నవల) (విశ్వం అనే కలం పేరుతో)
15) కాంతి రేఖలు (దేశభక్తి గేయాలు - అభ్యుదయ కవితలు)
16) వాల్మీకి చెప్పిన రామాయణ గాథ

# విషయ సూచిక

# ముందుమాట

"అనాదికాలం నుండి, చారిత్రక అంశాలపై ఆధిపత్యమూ, వాటి వివరణలను తమకు అనుకూలంగా మార్చుకోవడమూ అనేవి ప్రజల ఆలోచనలపై ఆధిపత్యానికి అత్యంత ఆవశ్యకము అన్న విషయాన్ని పాలకవర్గాలు గుర్తించాయి" అని "ప్రపంచ చరిత్ర" అన్న గ్రంథంలోని మొదటి పేజీలలోనే "హోవర్డ్ స్పోడెక్" అనే రచయిత పేర్కొంటాడు. దానికి రుజువుగా క్రీ.పూ. 201-168 మధ్య చైనాలో జీవించిన కవి, రాజనీతివేత్త అయిన జియా-ఇ అనే రచయిత పేర్కొన్న అంశాన్ని ఉటంకిస్తాడు. జియా-ఇ ఏం వ్రాశాడంటే "చైనా ప్రథమ చక్రవర్తి యైన క్విన్ షి హువాంగ్ గతంలో సాధించబడిన విజ్ఞానాన్నంతా నాశనం చేయడానికి ప్రయత్నించాడు. అతడు ప్రజలను గతానికి సంబంధించిన విజ్ఞానానికి దూరం చేసే ప్రయత్నంలో భాగంగా పూర్వకాలంలోని రాజర్షుల పద్ధతులన్నింటినీ రద్దు చేశాడు. 'వంద పాఠశాలలు' అనే ప్రాచీన విజ్ఞానానికి సంబంధించిన రాత ప్రతులన్నింటినీ అగ్నికి ఆహుతి చేశాడు. పెద్ద నగరాల గోడలను కూలగొట్టాడు. సమర్థులు, కీర్తిమంతులైన వారిని చంపించాడు. అలా గతాన్ని నిర్మూలించాననుకొన్నాడు." అని వ్రాశాడు.

ఈనాడు కూడ గతాన్ని పాతరవేసే ప్రయత్నాలు పాలకవర్గాలు చేస్తున్నాయి. అలా వీలుగానిచోట అసత్యాలతో, అర్ధసత్యాలతో చరిత్రను వక్రీకరించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు హరప్పా, మొహంజోదారో నాగరికతా కాలంనాటికి, ఆ నగరాలలో నివసించే వారికి 'గుర్రం' గురించి తెలియదు. గుర్రం వేద సంస్కృత భాషను మాట్లాడే ప్రజా సమూహాల 'విశిష్ట జంతువు'గా ఉండేది. కాని, గణితశాస్త్రంలో శిక్షణ పొంది, అమెరికాలోని 'నాసా' అంతరిక్ష కేంద్రంలో ఇంజనీరుగా పనిచేసిన ఎన్.ఎస్. రాజారామ్ అనే ఆయన తాను రచించిన "డీకోడ్ చేయబడిన సింధు లిపి (2000)" అనే పుస్తకంలో హరప్పాకు చెందిన ఒక సీల్ (ముద్ర) మీద గుర్రం

ఉన్నట్లు చిత్రించడం జరిగింది. "కాని అది మోస పూరితమని స్పష్టమయింది. ఆ వివరణ కంప్యూటర్‌లో పెద్దది చేసిన చిత్రమని రాజారామ్ తానే ఒప్పుకోవలసివచ్చింది" అని "చరిత్ర, విజ్ఞానశాస్త్రం మీద దాడి" అనే పెద్ద వ్యాసంలో 'అమర్ ఫరూఖి' వివరించడం జరిగింది.

ఇలా చరిత్రలోని అనేక విషయాలను మరుగుపరచి, లేదా వక్రీకరించి చేస్తున్న ప్రయత్నాలను సాగనివ్వకూడదు. రుజువులతో కూడిన వాస్తవాలను ప్రజలకందించాలి. ఆ ప్రయత్నంలోని భాగమే యీ చిన్న పుస్తకం. ప్రముఖ చరిత్రకారులైన ఆర్.సి. మజుందార్, ప్రొ॥ రొమిల్లాథాపర్, ప్రొ॥ డి.ఎన్.ఝూ, ప్రొ॥ ఇర్ఫాన్ హబీబ్, ప్రొ॥ సతీష్‌చంద్ర వంటి రచయితలు తమ జీవిత కాలాలన్నీ శ్రమించి వెలికితీసిన సత్యాలను నేను సంక్షిప్తపరచి, మహాకవి పోతన గారన్నట్లు "విబుధ జనుల వలన విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత" తేట పరచాను. పాఠకుల ముందుంచుతున్నాను. ఈ చిన్న పుస్తకాన్ని పిల్లలతో బాటు, పెద్దలు కూడ చదివి భారతదేశ చరిత్రలో మరుగునపడబోతున్న అనేక అంశాలను తెలుసుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ పుస్తక రచనలో నాకు తోడ్పడిన నా శ్రీమతికీ, ప్రచురణలో సహాయ, సహకారాలందిన మిత్రులు ఈడ్పుగంటి ప్రహాద్ గారికీ, ఇతర దాతలకూ పేరు పేరునా కృతజ్ఞతలు అందజేస్తున్నాను. అలాగే ఈ పుస్తకంపై తమ అభిప్రాయాన్ని తెలిపిన ప్రముఖ చరిత్రోపన్యాసకులు ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ గారికీ, మిత్రులు ఎం.ఎల్.సి. శ్రీ విఠపు బాలసుబ్రహ్మణ్యం గారికీ, మిత్రులు ఎన్.టి.ఐ. ప్రొఫెసర్ శ్రీ ఎ. రామచంద్రయ్య గారికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.



**ప్రొ॥ ఎ. రామచంద్రయ్య**

కెమిస్ట్రీ ప్రొఫెసర్

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, వరంగల్

## "మరింత ఎక్కువ అవగాహన పెరిగింది"

భారతదేశానికి గొప్ప చరిత్ర ఉందని అందరూ చెబుతారు. చాలా మంది గతంలో భారతదేశానికి వచ్చి, ఇక్కడ ఉన్నటువంటి భౌతిక వనరులు, సహజ వనరులు ఇవన్నీ కూడా చూడాలనీ తర్వాత ఇక్కడ ఉన్నటువంటి ఫ్లోరా, ఫోనాను గమనించి, వాళ్ళ వాళ్ళ దేశాలకి ఏమన్నా ఉపయోగపడుతుందేమోనని చాలామంది యాత్రీకులు భారతదేశానికి తరతరాలుగా వస్తూ ఉండేవారు. భారతదేశానికి ప్రాచీనమైనటువంటి చరిత్ర ఒకటి ఉంది. అటువంటి భారతదేశం మీద చాలామంది దాడి చేశారు. ఆక్రమించుకున్నారు. రకరకాల సామ్రాజ్యాలు భారతదేశంలోకి వచ్చాయి. చారిత్రకంగా చూసినా కూడా, ఎంతో ఘనమైనటువంటి చరిత్ర, భారతదేశానికి చాలా సనాతనంగా ఉంది. అలాగే వైజ్ఞానిక పరంగా కానివ్వండి, అలాగే మెటలర్జీ అంటే లోహ సంగ్రహణ, గణిత శాస్త్రము, రసాయన శాస్త్రము, కొంతమేరకు ఖగోళ శాస్త్రము, వైద్య శాస్త్రము, ఇటువంటి శాస్త్రాలలో భారతదేశానికి ఘనమైన చరిత్ర ఉంది. కాని ఇదే చరిత్రని మతానికి ఆపాదించి, అలాగే గతంలో శాస్త్రవేత్తలు చేసినటువంటి బ్రహ్మాండమైన పరిశోధనలు, వాళ్ళ తాత్విక చర్చలు, వాటిని మంత్రాలకు, తంత్రాలకు, మిరకిల్స్‌కు ఆపాదించి, వక్రీకరించారు. ఆ ఘనమైన వైజ్ఞానిక చరిత్రను అలాగే కొనసాగించి ఉంటే, భారతదేశం బహుశ ప్రపంచంలో ఈపాటికి ఏదాశానికి కూడా, జడవకుండా విస్తరించి ఉండేది. కాలక్రమేణా, భారతదేశంలో, భూస్వామ్య వ్యవస్థ రావడమూ తద్వారా వైజ్ఞానిక ప్రగతి కుంటుపడి, అదే స్థానంలో కులవ్యవస్థ, రాచరిక వ్యవస్థా రావడమూ, తర్వాత రకరకాల విదేశీ పాలనల్లో భారతదేశం ఉండిపోవడమూ, ఈరకమైనటువంటి మానవ వనరుల్నీ, ప్రకృతి వనరుల్నీ దోచుకొని యీ ముడి పదార్థాల్ని వాళ్ళ వాళ్ళ దేశాలకి తీసుకెళ్ళి, అక్కడ వస్తువులు తయారుచేసి, తిరిగి భారతదేశానికి

అమ్మడం వలన, చాల వరకు భారతదేశం యొక్క ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నమయింది. ఒక పేద దేశంగా మిగిలిపోయింది. ఇటువంటి పరిస్థితుల్లో సామాన్యమైనటువంటి పాఠకుడికి భారతదేశం యొక్క చరిత్ర గురించి ఏమేం జరిగింది అనేటటువంటి శాస్త్రీయ వివరణ చాల అవసరం. ఒక ఏనుగును కొంతమంది గుడ్డివాళ్ళు రకరకాలుగా దాన్ని వర్ణించినట్లే, భారతదేశ చరిత్రను కూడా చాలమంది వాళ్ళకు తోచిన విధంగా వర్ణించడం మొదలుపెట్టారు. మతపరమైనటువంటి దృక్కోణంలో కొందరు, పురాణాలను, వైజ్ఞానిక ప్రగతిని కలగాపులగం చేసి వివిధ దృక్కోణాల్లో భారతదేశ చరిత్రను వ్రాయడం జరిగింది. కాని ఒక సశాస్త్రీయ వివరణ, భారతదేశానికి ఇచ్చినటువంటి వాళ్ళలో బిపిన్‌చంద్ర, రొమిల్లాథాపర్, రాహుల్ సాంకృత్యాయన్, ఇటువంటి వాళ్ళు మనకు తెలుసు. అటువంటి చరిత్ర వేరే భాషల్లో ఎక్కువగా ఉంది. ముఖ్యంగా ఇంగ్లీషు భాషలో ఎక్కువగా ఉంది. మన తెలుగులో అటువంటి చరిత్రను మనం సశాస్త్రీయంగా ఎక్కువ పుస్తకాల్లో చూడం. కె.ఎల్. కాంతారావు గారు ఆర్.ఇ.సి.లో ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్‌లో బి.టెక్. చేసి అభ్యుదయ భావాలున్నటువంటి సంస్థలకీ, వ్యక్తులకీ ఒక తాత్వికుడుగా, నిబద్ధత గల్గినటువంటి రచయితగా, ఉపన్యాసకుడిలా, ఎంతోమందిని ఆయన అభ్యుదయ భావాలవైపు నడిపించారు. జన విజ్ఞాన వేదిక ఆవిర్భావంలో కీలకమైనటువంటి పాత్ర పోషించడమే కాకుండా ఒక రికార్డును కూడా ఆయన పొందాడు. అదేమిటంటే, జనవిజ్ఞాన వేదికలో ఒకసారి అధ్యక్ష స్థానంలోనూ, మరోసారి ప్రధాన కార్యదర్శి స్థానంలోనూ వేదిక యొక్క పురోగతికి దోహదపడినటువంటి వ్యక్తుల్లో ఆయన ఒకరు. వారు చాల చాల సశాస్త్రీయంగా వివరణాత్మకంగా చెబుతారు. భౌతికవాద దృక్పథం గూర్చి కానివ్వండి, అలాగే గతితార్కిక భౌతికవాదం గూర్చి కానివ్వండి, శాస్త్రీయ దృక్పథం గూర్చి కానివ్వండి లేదా మరేదైనా ఒక శాస్త్రీయ, ఆర్థికపరమైన, రాజకీయపరమైనటువంటి తాత్విక చర్చలో పాల్గొన్నట్లయితే వారు ఇచ్చేటటువంటి వివరణ చాలా చాలా ఆకట్టుకొనే విధంగా ఉంటుంది. అటువంటి రచయిత చేతుల మీదుగా భారతదేశ చరిత్ర తెలుగులో రావడం చాల చాల ముదావహం. ఎప్పటినుంచో మనం

ఎదురుచూస్తున్నాం. చరిత్రని, ఒక సరైనటువంటి మార్గాల్లో సరైనటువంటి దృక్కోణంలో పెట్టాలి. భారతదేశ చరిత్రను గురించిన అవగాహన ఎక్కువ మందికి రావాలి అనుకొంటే అది తప్పకుండా ఒక ఆబ్జెక్టివ్ గా, నిష్పాక్షికంగా రావల్సిన అవసరం ఉంది. ఇవాళ చరిత్రని వివిధ దృక్కోణాల్లో చెప్పడంవల్ల రాజకీయ వాతావరణం మారుతూ ఉంది. సరైనటువంటి పంథాలో భారతదేశ చరిత్రను పెట్టినట్లయితే నిష్పాక్షికమైన అవగాహన పాఠకులకు వచ్చేటటువంటి అవకాశం ఉంది. అలాంటి నిష్పాక్షికంగా భారతదేశ చరిత్రను మనముందు ఉంచినటువంటి గొప్ప పనిని శ్రీ కాంతారావు గారు చేశారు. కాకపోతే వారు రాసినటువంటి పుస్తకంలో కేవలం ప్రాచీన మధ్యయుగాలు కాలంనాటి నుంచి ఉన్నటువంటి చరిత్ర మాత్రమే ఉంది. ప్రాచీనయుగాల్లో కంటే, ప్రాచీనకాలం కంటె ముందర కూడా దాదాపు క్రీస్తు పూర్వం 15,20 వేల సంవత్సరాల నుంచి కూడా భారతదేశానికి చరిత్ర ఉంది. భాష, సంప్రదాయాలు అట్లాగే ఉత్పత్తి సంబంధాలు కేవలం క్రీ.పూ. 5, 10 వేల సంవత్సరాల నుంచే ఉన్నా కూడా, మానవ నాగరికత లేక మానవ చరిత్రను చదివినట్లయితే, అంతకంటే ముందర నుంచి కూడా మనకు ఆ భావాలు ఉన్నట్లే లెక్క. వారు రాసినటువంటి ఈ భారతదేశ చరిత్ర చారిత్రక పూర్వయుగం నుంచి ప్రారంభమైంది. ఆ తర్వాత సింధు నాగరికతా విశేషాలతో వివరణ జరిగింది. ఆ తర్వాత సింధు నాగరికత ఎలా నాశనమైంది అనే అంశాన్ని ఆయన చాలా స్పష్టంగా వివరించారు. ఆర్యులు మన దేశానికి రావడం మూలానే ఈ దేశంలో పురాణాలు, కులాలు అవన్నీ వచ్చాయనీ, అలాగే ద్రవిడ సంస్కృతి స్థానే ఆర్యసంస్కృతి వచ్చిందని చరిత్రలో కొంతమంది చెప్పారు కానీ ఆర్యులు విదేశాలనుండి రాలేదు, ఆర్యుల దండయాత్ర అనే మాటే తప్పు అనేది కొంతమంది వాదిస్తూ ఉంటారు. కానీ చారిత్రక రుజువులు చూసినట్లయితే ఆర్యులు పశ్చిమ ఆసియా నుంచి భారతదేశంలోకి వచ్చారు. వారు భారతదేశంలో తమ యొక్క ఉనికిని చాటుకునేందుకు రకరకాల విధానాలు అవలంభించారనే దానికి సాక్ష్యాలున్నాయి. కాంతారావు గారు వ్రాసినటువంటి పుస్తకంలో ఆర్యులు విదేశీయులు. వారు భారతదేశానికి సహజంగా చెందిన వారు కారు అని

చెప్పేసి ఎన్నో రుజువులతో వివరించారు. తర్వాత వారి యొక్క ప్రయత్నాల్లో ఆర్యుల నాగరికతలో అంతకుముందున్నటువంటి సామాజిక, సశాస్త్రీయ, సామూహిక గుణగణాల బదులు పనులను బట్టి వ్యక్తులను విభజించడం ఎలా జరిగిందో, అంటే ఈ కుల వ్యవస్థ, చాతుర్వర్ణ వ్యవస్థ ఎలా ఏర్పడిందో, వారు సోదాహరణంగా వివరించారు.

మనుధర్మ శాస్త్రానికీ ఎలా వాళ్ళు పొంతన చేకూర్చారో, (ఆర్యులు) దానిని గురించిన వివరణ చెప్పారు. బ్రహ్మతల నుంచి పుట్టిన వాళ్ళు బ్రాహ్మణులనీ, బ్రహ్మ వక్షస్థలం నుంచి పుట్టిన వాళ్ళు క్షత్రియులనీ, బ్రహ్మ ఉదరం నుంచి పుట్టినవాళ్ళు వైశ్యులనీ, బ్రహ్మ కాళ్ళ నుంచి పుట్టినవాళ్ళు శూద్రులనీ, తర్వాత యీ బ్రాహ్మకు ఏ సంబంధం లేకుండా అంటరానివాళ్ళుగా, చండాలురుగా పంచములనే పేరుతో పంచమవర్ణం ఒకటి అంటే మనం ఇప్పుడు చెప్పుకొనేటటువంటి దళితులు మాల, మాదిగ అనేటటువంటి కులాల్లో ఉన్నవాళ్ళని ఎలా ఈ వర్ణవ్యవస్థ బేదాల్లోకి, ఈ వివక్షలోకి ఎలా తీస్కొచ్చిందో వారు సోదాహరణంగా చెప్పడం జరిగింది. అప్పటి నుండి బలపడినటువంటి వర్ణవ్యవస్థ ఈరోజుకి కూడా కొనసాగుతూ ఉంది, భారతదేశం యొక్క ప్రగతికి అత్యంత ఆటంకంగా ఉన్నటువంటి విషయం, కులవ్యవస్థ, వర్ణవ్యవస్థ అనేది ఆయన చెప్పడం జరిగింది. ఆ తర్వాత, కాలక్రమేణా క్రీ.పూ. 6వ శతాబ్దంలో బౌద్ధ, జైన మతాలతో బాటుగా ఇతర రకరకాల మతాలు ఈదేశంలో ఎలా ఏర్పడ్డాయి? ఆ మతాల సారాంశం ఏమిటి? ఆ మతాలు సాధారణ ప్రజాజీవితంలో ఎలా ప్రభావితం చేశాయి అనేటటువంటి విషయాలు కూడా ఆయన చెప్పడం జరిగింది. కానీ మౌర్యులు ముఖ్యంగా అశోకుడు కొంత ఆబ్జెక్టివ్ థింకింగ్ ని తీసుకురావడమూ బౌద్ధమతాచారానికి ఆయన పెద్దపీట వేయడమూ, ఆకాలంలో ప్రజలయొక్క ఆలోచనా విధానంలో ఎటువంటి మార్పులు వచ్చాయి? ఈ విషయాలన్నిటిని కూడా వారు వివరించారు చాలా సోదాహరణంగా. తర్వాత ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో, ప్రాచ్య భారతదేశంలో, ముఖ్యంగా తూర్పు భారతదేశంలో కాకతీయులు, పల్నాటి యోధులు ఎలా వచ్చారు? ఈ సామాజిక పరిస్థితుల గురించి కూడా వారు

సోదాహరణంగా వివరించారు. విజయనగర సామ్రాజ్య స్థాపన ఎలా జరిగింది? హిందూ ధర్మరక్షణకే ఈ రాజ్యాలు పాటుబడ్డాయా? ఈ పుస్తకం చదివే వాళ్ళకి ఒక రకమైన సంక్షిప్తమైన అవగాహన, సశాస్త్రీయమైన అవగాహన వచ్చే అవకాశం ఉంది. ఎవరైతే చరిత్రను మర్చిపోతారో, వారు తిరిగి ఆ చరిత్రను పునఃస్థాపించడానికి అర్హులు కారు అని చెప్పబడింది. .......... అని తమస్ అనే టి.వి. సీరియల్ లో గోవింద నిహ్లాని అనుకుంటాను, ఆయన చెప్పడం జరిగింది. అలాగే చరిత్ర గురించినటువంటి అవగాహన వివిధ వర్గాల్లో వివిధ రకాలుగా ఉన్నట్లయితే ఒక సమైక్యమైనటువంటి, సమగ్రమైనటువంటి అవగాహనతో భారతదేశాన్ని మనం నడిపించలేం. కాబట్టి సశాస్త్రీయమైన వివరాలతో భారతదేశ చరిత్ర వచ్చినట్లయితే, భారతదేశ అభ్యుదయ భావ శక్తులకి, ఒక కీలకమైనటువంటి కాగడాలాగా అది ఉపయోగపడుతుంది. చరిత్ర అవగాహన లేకుండా నూతన చరిత్రను ఎవరూ నిర్మించలేరు. పాత పునాదుల యొక్క అవగాహన లేకుండా ఆ పునాదులపైన కొత్త సామ్రాజ్యాన్ని, కొత్త భవనాన్ని నిర్మించలేం. కాబట్టి ఎవరైతే నిజమైన దేశభక్తులుగా ఉన్నారో ఆ నిజమైన దేశభక్తులకి నిజమైన భారతదేశ చరిత్ర అవగాహన అత్యవసరం. ఈ విషయంలో శ్రీ కాంతారావు గారు చేసినటువంటి సేవ చాలా చాలా విలువైనది. ఈ పుస్తకం చదివినటువంటి పాఠకులకి సంక్షిప్తమైనటువంటి ఒక అవగాహన భారతదేశ చరిత్రను గూర్చి వస్తుంది అని చెప్పటంలో ఏమాత్రమూ సందేహం లేదు. ఆ అవగాహన ఏర్పరచుకొని తమయొక్క కార్యకలాపాల్లో పాల్గొనవలసిందిగా మేము పాఠకులకి విజ్ఞప్తి చేస్తున్నాం. నేను, కాంతారావు గారు కలిసి జనవిజ్ఞాన వేదిక లో దాదాపు 30 సం॥ పాటు పనిచేశాము. అప్పటి నుంచి ఇప్పుడు కూడా పనిచేస్తున్నాము. నేను అధ్యక్ష స్థానంలో ఉన్నప్పుడు వారు ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. మా ఇద్దరి కాంబినేషన్ ఉన్నటువంటి సమయంలోనే 2006లో, 2005 సంవత్సరానికి గాను అత్యున్నత జాతీయ సైన్సు అవార్డు తీసుకోవడం జరిగింది. నేను ఒక కెమిస్ట్రీ రసాయన శాస్త్రం విద్యార్థిని. కాని ఆయన పుస్తకం చదివిన తర్వాత నాకు కొంత భారతదేశ చరిత్రను గూర్చిన అవగాహన, ఇంతకు ముందున్న అవగాహన కంటే మరింత

గొప్ప ఎక్కువ అవగాహన కలిగిందని భావిస్తున్నాను. వారికి కృతజ్ఞుడిని. ఈ పుస్తకాన్ని ఎక్కువ మంది చదవాలని కూడా నేను విజ్ఞప్తి చేస్తున్నాను. చివరగా కాంతారావు గారు చేసినటువంటి కృషి బహుశ తెలుగు వాళ్ళందరూ కూడ దాన్ని గుర్తించాలి. వారు చేసిన సేవ మరువరానిదిగా నేను భావిస్తూ...

వరంగల్
8/7/2020

(సం॥)
ఎ. రామచంద్రయ్య



**ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ**

రిటైర్డ్ ప్రొఫెసర్ (చరిత్ర), హైదరాబాద్ యూనివర్సిటి, హైదరాబాద్

## రాశిలో చిన్నదైనా, ఎంతో ప్రామాణికమైనది

చరిత్ర సామాజిక శాస్త్రాలన్నింటికీ తల్లిలాంటిది. మానవ సమాజ పుట్టుపూర్వోత్తరాలను, గమనాన్ని వివరిస్తూ ఆయా దశల్లో చోటుచేసుకున్న మార్పులు ఎందుకు, ఎలా జరిగాయో, కార్యకారణంతో సంధించి, వివరిస్తుంది. కేవలం గతకాలపు ఘటనల సమాహారం కాదు చరిత్ర. ప్రఖ్యాత చరిత్రకారుడు శ్రీ ఇ.హెచ్. కార్ చెప్పినట్లు చరిత్రకారుడు గతాన్ని వివరిస్తూ, విశ్లేషించాలి. కీర్తించకూడదు; నిందించకూడదు.

నికార్సయిన పునాదులపై చరిత్ర రచన సాగుతుంది. చరిత్ర రచనకు ఆధారాలు ముఖ్యం. ఇవి అనేకం ఉన్నా, వాటిలో భౌతికమైనవి, గతకాలపు అవశేషాలకు సంబంధించినవి ప్రధానమైనవి. సాహిత్యాధారాలపై నిర్మించిన గతం పునాదిలేని భవనం లాంటిది. ఆ సాహిత్యానికి మూలాలు, ఆ సాహిత్యసృష్టి ఎవరు చేశారు? ఎందుకు? ఎలా సృష్టించారు? సృష్టించిన సమాజపు విలువలు, నేపథ్యం ముఖ్యం.

చరిత్ర గమనంలో ఒకానొక చారిత్రక దశలో, ఆ కాలపు ప్రజలు ఏం తిన్నారు? ఆ తిన్న ఆహారం ఎలా సృష్టించుకున్నారు? ఆ వచ్చిన సంపద ఉత్పత్తిలో భాగస్వాములకెంత దక్కింది? మిగులు సంపద ఏమయింది? ఎవరు తీసుకున్నారు? ఈ క్రమాన్ని వివరించేది చరిత్ర. ఇక్కడ పరిశీలించాల్సిన ముఖ్యాంశం మరొకటి. మానవులు తమ తక్షణ మనుగడ కోసమే శ్రమించలేదు. ఉత్పత్తి క్రమంలో మిగులు (సర్‌ప్లస్) సమకూరినప్పుడు, అది నాగరికత పెంపుదలకు, కట్టడాలకు, నూతన అన్వేషణలకు ప్రాణవాయువైంది.

మానవులు తమ తక్షణ మనుగడ కోసమే శ్రమించలేదు. ఉత్పత్తి క్రమంలో మిగులు (సర్‌ప్లస్) సమకూరినపుడు అది నాగరికత, సంస్కృతులకు ప్రాణవాయువైంది. దాంతో తన చుట్టూ ఆకర్షణీయ సమాజాన్ని

నిర్మించుకుంటూ వచ్చాడు.

ఏదేశ చరిత్రకైనా నేపథ్యం ఇదే !

ప్రస్తుత గ్రంథం భారతదేశ చరిత్రను చరిత్ర పూర్వయుగం నుండి మొగలుల పరిపాలనాంతం వరకు సంక్షిప్తంగా తెలియజేస్తూ, ప్రధానంగా వయసుమీరని పిల్లలకోసం రాసినా, చరిత్రపై ఆసక్తిగల పెద్ద వయస్కులు కూడ చదువదగ్గ గ్రంథం.

నేను వృత్తిరీత్యా చరిత్ర అధ్యాపకుడుగా పనిచేసినా, భారతదేశ చరిత్ర ప్రామాణిక గ్రంథాలు చదివినా, ఈ పుస్తకం చదవడం మొదలుపెట్టి, ఆపకుండా చదివింపజేసింది. కేవలం రచనాశైలి మాత్రమే కాదు. అందులోని చారిత్రకాంశాలు కూడ.

ఇటీవలి కాలంలో, భారతదేశ చరిత్రను, ఇందులోని ప్రధానాంశాలను, నాగరికతలు, మతోద్యమాలు, రాజవంశం పాలన గూర్చి రాసే క్రమంలో మతతత్వం చోటుచేసుకుంటున్నది. ఎన్.సి.ఇ.ఆర్.టి. లాంటి ప్రతిష్టాత్మక విద్యా పరిశోధనా సంస్థలు ప్రచురించిన ప్రముఖ చరిత్రకారుల ప్రామాణిక గ్రంథాలను నిషేధించడం లేక తొలగించడం లాంటి అధ్యయన వ్యతిరేక చర్యలు చరిత్ర రచనలో వక్రీకరణలు జరుగుతుండగా వాటిని సమర్థంగా ఎదుర్కొనే ప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి.

శ్రీయుతులు కాంతారావు గారు రాసిన యీ గ్రంథం రాశిలో చిన్నదైనా, ఎంతో ప్రామాణికమైనది. పైన చెప్పిన వక్రీకరణలకు సమాధానంగా సాగింది రచన. సులభశైలిలో, సూక్ష్మాతి సూక్ష్మంగా ఎక్కడా వక్రీకరణల ప్రసక్తి లేకుండానే వాటికి సమాధానంగా సాగింది ఈ రచన.

గ్రంథకర్త కాంతారావు గారు అభినందనీయులు.

(సం) వకుళాభరణ రామకృష్ణ

హైదరాబాద్
జూన్–2020

# సమగ్రం, సాధికారం!

మళ్ళీ చరిత్ర రాయడమా? అదీ ఏడుపదుల కాంతారావు రాయడమా? ఈ చొప్పదంటు ప్రశ్నలు మనకు తలెత్తవచ్చు. లోపలికెళితే గానీ దీనికి జవాబులు చిక్కవు.

భారతీయ చరిత్రను–అదీ ప్రాచీన చరిత్రను చాలా మంది చాలా కోణాల్నుంచి రాశారు. పాశ్చాత్యుల్లోని ఒక వర్గం ప్రాచీన హైందవ చరిత్రను కీర్తిస్తూ, ముస్లిం పాలనను నిందిస్తూ తామే ఉద్ధారకులమన్నట్టు భాష్యం చెప్పింది. మరోవర్గం మొత్తం మన చరిత్రను నిస్సారం కింద లెక్కించింది. ఏది ఏమైనా వీరు చరిత్రను పురాణాల నుంచి విడదీసి కొత్తదారి పట్టించారు. ఇదొక దశ.

ఇక జాతీయ పునరుజ్జీవన కర్తలుగా మన “ఘన చరితను” వెలికి తీసిన భారతీయ చరిత్రకారులు కొందరైతే, జీవితాల్ని అంకితం చేసి అహోరాత్రులు పరిశోధించి నిప్పులాంటి నిజాల్ని బయటికి తీసిన వాళ్ళు కొందరు. మరీస్థానిక చరిత్ర రచనలో వీరికృషి అపూర్వం. ఇది ఇంకొకదశ.

చారిత్రక భౌతిక వాద దృక్పథం చరిత్రరచనలోకి ప్రవేశించాక చరిత్రకూడా విజ్ఞాన శాస్త్రంగా మారింది. కొత్త ఆధారాలు, ఆధునిక శాస్త్ర పరికరాలూ అందుబాటులోకి రావడంతో ఇప్పటిదాకా ఎంతో దృఢంగా నమ్మిన వాటికి కాలం చెల్లి చరిత్ర పదునెక్కుతోంది. సామాజిక ఉద్యమాలూ, అట్టడుగు వర్గాల కొత్త గొంతుకలూ చరిత్ర నిపుడు తిరగ రాయిస్తున్నాయి. దీంతో చరిత్ర నిత్య నూతనమవుతోంది. సీరియస్ పాఠకులకిది పండగ కాలం. ఇది ప్రస్తుత దశ.

కానీ అందరి ప్రయోజనాలూ ఒకటి కానపుడు చరిత్రపట్ల అందరి దృక్పథం ఒకటిగా వుండదు. నిష్పాక్షికత, నిరపేక్షత అనేవి చరిత్ర రచనలో పొసగనివి. అందుకే సింధూ నాగరికతను ఎవరు నిర్మించారనే దాని దగ్గర్నుంచి శివాజీ విజయాలదాకా తర్క, వితర్కాలు జరుగుతూనే వున్నాయి. కులం కోణం నుంచి, మతం కోణం నుంచీ చరిత్రను విశ్లేషించడం, దేశభక్తి, జాతి పునరుత్థానం పేర చరిత్రను తిరగరాయడం కూడా సమాంతరంగా

సాగుతూనేవున్నాయి. ఈ ధోరణికి ప్రభుత్వ వత్తాసు కూడా లభిస్తుండటంతో. తాత తాతల నాటి కధల్ని ఇష్టానుసారం తవ్విపోయడానికి ఒక వ్యవస్థీకృత ప్రయత్నం జరుగుతోంది. దీన్ని వికృత దశ అనొచ్చు.

కాంతారావు గారి గ్రంథాన్ని ఈ సందర్భం నుంచి చూడాలి. ఆయన పట్టుబట్టి ప్రాచీన మధ్యయుగాల చరిత్రను ఎంచుకోవడంలోని ధర్మసూక్ష్మాన్ని కూడా ఈ కోణం నుంచే చూడాలి.

మానవేతిహాసాన్ని విహంగ వీక్షణం చేసిన వారికెవరికైనా భూగోళం మీదున్న ఏ జాతికూడా ఒకే కుదురు నుంచి పుట్టిన "స్వచ్ఛ", "పరిశుద్ధ" జాతిగాదని, ఎప్పుడెప్పుడో ఎక్కడెక్కడి నుంచో వలసలొచ్చిన సమూహాల మిశ్రమజాతి అని సులభంగా అర్ధమవుతుంది. అలాగే మనం నమ్ముతున్న సంస్కృతి, మనల్ని నడిపిస్తున్న అభివృద్ధి కూడా ఏ ఒక్కరమో స్వంతంగా సంపాదించుకొన్నవిగావనీ, సుదీర్ఘ కాలపు ఆదాన ప్రదానాల వల్లనే ఈ రూపం సంతరించుకొన్నాయని తెలిసొస్తుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే ఇది చరిత్రసారం. కాంతారావు గారు దీన్ని అడుగడుగునా గుర్తుచేసే ప్రయత్నం చేశారు.

రెండో అంశం– చరిత్ర అంటే ఎవరిచరిత్ర అనేది. రాజులూ, తత్వవేత్తలూ, యోధులూ చరిత్రలోని చాలాచిన్న భాగం. ప్రజల చరిత్రే చరిత్ర. ప్రజల చరిత్ర అంటే వారి బతుకు బండి ఎలానడిచిందని, కాలం వారిపట్ల ఎలా వ్యవహరించిదని. అయా యుగాల్ని ఒక్కో కుదుపు కుదిపేసినవీ, ముందుకు నెట్టినవీ రూపురేఖల్ని అంతస్సారాన్నీ మార్చి వేసినవీ ఉత్పత్తిలో వచ్చిన మార్పులు. వ్యవసాయం తెచ్చిన మార్పులు పారిశ్రామిక విప్లవం తెచ్చిన పరిణామాలు ఏ తత్వవేత్తో ప్రవచించినవిగావు. జరిగింది దీనికి భిన్నం చక్రవర్తులూ తత్వవేత్తలూ ఈ వ్యవసాయం నుంచే, ఈ పారిశ్రామిక విప్లవం నుంచే పుట్టుకొచ్చారు. తప్పనిసరై పుట్టుకొచ్చారు.

ఈ సర్వాంగీకృత చరిత్ర హృదయాన్ని కాంతారావు పట్టుబట్టి ప్రతిచోట ఆవిష్కరించే ప్రయత్నం చేశాడు.

దీని కోసం ఆయన చాలా కట్టుకథల్ని పట్టుబట్టి బట్టబయలు చేశాడు.

కొద్దిచోట్ల తర్కంతో చాలాచోట్ల రుజువులతో ఈ పనిచేశాడు. అది సింధూ అశ్వాల కథగావచ్చు, పద్మినీ ప్రేమపురాణం కావచ్చు. దీనికి చాలా అధ్యయనం కావల్సి వుంటుంది. కాంతరావు పట్టువదలని విక్రమార్కుడీ విషయంలో.

భారతీయులంగా మనం గర్వించాల్సిన వేమీ తక్కువలేవు. మనది అత్యంత ప్రాచీన నాగరికతల్లో ఒకటి. అద్భుతమైన మిశ్రమ సంస్కృతి మనది. ప్రపంచానికి మనం గొప్ప ఆవిష్కరణల్ని కూడా అందించాం. "ఆనో భద్రా: క్రతవో యన్తు విశ్వత:" అన్న వాళ్ళం మనం. మన బుద్ధుడు, అశోకుడు, హర్షుడు, అక్బరూ, కాళిదాసులతో పోలిన వాళ్ళు ప్రపంచ చరిత్రలోనే చాలా తక్కువమంది. దీనికి కాంతారావు గర్వపడతాడు.

కానీ ప్రపంచ చరిత్రలో మనదీ ఒక భాగం. ఆక్రమణలూ, ఆధిపత్యాలూ, వాటికోసం యుద్ధాలూ సంహారాలు మాత్రమే గాదు సామాజిక సాంస్కృతిక అణచివేతలూ లేని చరిత్రంటూ లేదు. కాకుంటే ఈ రెండో దౌష్ట్యంలో మనం ప్రపంచంలోనే ముందుంటాం. మన అస్పృశ్యతా, కులవ్యవస్థా ' ఓడిపోవడానికే ఎప్పుడూ సిద్ధంగా వుండే జాతిగా ' మనల్ని మార్చాయి. భగవంతుడే మనుషుల్ని ఇలా సృష్టించాడన్న పురుషసూక్తం పరమహేయమైంది. కాంతారావు దీన్ని చాలా లోతుగా విశ్లేషించే ప్రయత్నం చేశాడు.

చరిత్ర రచన కెప్పుడూ ఒక పరిమితి వుంటుంది. ఆనాటికి లభించిన ఆధారాలు, అప్పటికి చేయగల్గిన సూత్రీకరణాలూ ఆధారంగా మాత్రమే చరిత్రను రాయగలం. సమాజం ఉన్నత స్థితికి చేరుకొనే కొద్దీ కొన్నింటిపట్ల మన దృక్పథంలో మార్పు రావల్సివస్తుంది. పర్యావరణం ఈ మధ్య చరిత్రలో తనకు స్థానమేదని ప్రశ్నిస్తోంది. పశుపక్ష్యాదులూ తమపట్ల ఇంత హింస దేనికని గొంతెత్తుతున్నాయి. అందువల్ల కాంతారావు గారి గ్రంథానికీ కాలపరిమితు లుంటాయి.

అలాగే సింధూ నాగరికతా నిర్మాతల విషయంలో గత 3-4 ఏళ్ళుగా సాగుతున్న DNA పరీక్షలు వీరికి ఇరానియన్లతో సాన్నిహిత్యాన్ని ముందుకు తెచ్చాయి కర్నూలు జిల్లా జ్వాలాపురం బూడిద పొరల్లోని రాతి పరికరాలు అపురూపమైన చారిత్రకాధారాలు. వ్యవసాయ సమాజాలు తెగల్లోకి జొరబడే

కొద్దీ జరిగిన పరిణామాలు భారతీయ సంస్కృతికి గుండెలాంటివి. దండకారణ్య చెంచుల్లాంటి ఆదిమ తెగలూ, గచ్చిబౌలి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లూ ఒకేకాలంలో కళ్ళ ఎదుట కనబడ్డం కోశాంబి దృష్టిలో చరిత్రకారులకి ఒక్క భారతదేశంలో మాత్రమే దక్కిన మహదవకాశం. భారతీయ చక్రవర్తులూ, యోధులూ విదేశీ ఆక్రమణలకి గ్రీకుల్లానో పాశ్చాత్యుల్లానో ఎందుకు పాల్పడలేదో అర్థంకావడం లేదంటాడు యువల్ నోఆ హరారీ.

గ్రీకు పర్షియా తదితరాలతో జరిగిన మనదేశ ఆదాన ప్రదానాల్ని మరింత విస్తరించి చెప్పివుంటే బావుండేది. సూఫీ–భక్తి ఉద్యమాలకు తగినంత స్థానం చిక్కలేదనిపిస్తుంది. సుల్తానుల యుద్ధాలు చాలాస్థలం ఆక్రమించేశాయి. సామ్రాజ్యాల నిర్మాణం ఎంత నరమేధంతో జరిగిందో కొంచెం నొక్కి చెప్పాల్సింది. ఎవ్వరికీ, దేనికీ లొంగని భారతీయ తాత్విక వైచిత్రిని, సాంస్కృతిక వైశిష్ట్యాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించి వుండాల్సింది.

ఇది రెండు సుదీర్ఘ యుగాల సంగ్రహ చరిత్ర. దీని పరిమితి దీనికుంది. దీనిలో చూపిన ఆధారాలూ, స్వీకరించిన సూత్రీకరణాలు చాలా ఆధునికమైనవి. ప్రస్తుత ప్రముఖ చరిత్రకారులందరూ దాదాపు ఏకాభిప్రాయానికి వచ్చినవి. లోతైన అధ్యయనం విషయసేకరణలతోపాటు సమాజం పట్ల గాడమైన బాధ్యత కూడా వుంటే తప్ప ఇలాంటి పనికి పూనుకోలేం.

కాంతారావు గార్కి ఈ లక్షణాలన్నీ పుష్కలంగా వున్నాయిమరి. అందుకే ఈ గ్రంథం సంక్షిప్తమయినా ఇంత సమగ్రంగా సాధికారికంగా రూపు దిద్దుకొంది.

భవదీయ

నెల్లూరు
5-7-2020

(విఠపు బాలసుబ్రహ్మణ్యం)
శాసనమండలి సభ్యులు

# 1వ భాగం. చారిత్రక పూర్వయుగం

పిల్లలూ! మనమంతా దేశభక్తులం. మనదేశం అన్ని రంగాల్లో గొప్పదేశంగా ఉండాలని కోరుకుంటాం. అవునా? అడిగారు విశ్వం మాస్టారు.

"అవును మాస్టారూ!" పిల్లలందరూ గట్టిగా అరిచారు.

"అలా మనదేశం కావాలంటే మనం గతంలో సాధించిన విజయాలనూ, అపజయాలనూ, వాటి కారణాలనూ తెలుసుకొని, ఏ కారణాలతో విజయాలు సాధించామో వాటిని కొనసాగిస్తూ, ఏ కారణాలతో అపజయాలు సాధించామో వాటిని మరల చేయకుండా జాగ్రత్తపడుతూ వర్తమానంలో ముందుకు సాగాలి. అప్పుడే భవిష్యత్తులో మరిన్ని విజయాలు సాధించగలం. అవునా?

"అవును మాస్టారూ" మరల పిల్లలందరూ అరిచారు.

"అలా సాధించాలంటే మనం ఏం తెలుసుకోవాలి?" అడిగారు మాస్టారు.

"మనదేశం యొక్క గతాన్ని గూర్చి" బదులిచ్చాడు అభినంద్.

"ఇంకా స్పష్టంగా ఎవరైనా చెప్పగలరా?"

"మన భారతదేశ చరిత్రను మనమందరం తెలుసుకోవాలి" అన్నాడు తేజ.

"అవును. మనమందరం మనదేశ చరిత్రను తెలుసుకోవాలి" అన్నాడు మాస్టారు.

"చెప్పండి మాస్టారూ వింటాం" అన్నారు మరల పిల్లలందరూ.

"మన పూర్వీకులైన మానవులు వానరదశ నుండి ఇప్పటికి దాదాపు 40 లక్షల సంవత్సరాల క్రితం పరిణామం చెంది నరులుగా మారారని జీవశాస్త్రవేత్తలందరూ నిరూపించారు. అది మీకందరికీ తెలుసుగదా?"

"తెలుసు మాస్టారూ" అన్నారు పిల్లలు.

"వారు మొదట్లో ఎక్కడ నివసించేవారు?"

"కొండ గుహల్లో, చెట్టు తొర్రల్లో నివశించేవారు" మాస్టారి ప్రశ్నకు టక్కున సమాధానమిచ్చింది సుహానా.

"వారి ఆహారమేమిటి?"

"పచ్చిమాంసం, పళ్ళు, దుంపలు" కిరణ్ జవాబిచ్చాడు.

"ఆనాడు ఆహారసంపాదనకు మానవులు ఉపయోగించిన ఆయుధా లేమిటో తెలుసా?

క్లాసంతా మౌనం.

"ఆది మానవులు మొదట్లో చేతికందిన రాళ్ళు, చెట్ల కొమ్మలనే ఆయుధాలుగా వాడేవాళ్ళు. గుంపుగా వెళ్ళి రాళ్ళు, కొమ్మల ఆయుధాలతో జంతువులను వేటాడి చంపడం, చెట్లనుండి పళ్ళను రాల్చడం, దుంపలను తవ్వడం చేసి తినేవారు. తర్వాత కొంత కాలానికి అడవులలో దావానలం అనే పెద్ద పెద్ద మంటలు చెలరేగినప్పుడు, ఆ మంటలలో సగం కాలిన జంతువుల మాంసం మరింత కమ్మని వాసన, మరింత రుచి కల్గిఉండటాన్ని గమనించి, ఆ మానవులు అడవులలో రేగిన మంటల తాలూకు కొమ్మలను తీసుకువచ్చి తమ గుహలలో పేర్చిన కొమ్మలకు ఆ నిప్పును అంటించి, ఆ మంటలలో తాము వేటాడిన జంతువులను కాల్చుకొని తినడం ఆరంభించారు. ఈదశలో మానవులకు నిప్పును తయారుచేయడం రాదుగాని, నిప్పును ఉపయోగించడం నేర్చుకున్నారన్నమాట. అంతేకాదు, రాళ్ళనుండి పెచ్చులు ఊడదీసి రాతి పరికరాలు తయారుచేయటం మొదలెట్టారు. దీనికి రుజువు ఏమిటో తెలుసా? ప్రస్తుత పాకిస్తాన్ లోని సోన్ లోయలోని రైవత్ వద్ద లభ్యమైన రాతి పరికరాలు. ఇవి 20 లక్షల సంవత్సరాల నాటివని పురావస్తు శాస్త్రజ్ఞులు నిర్వచించారు. అలాగే హిమాచల్‌ప్రదేశ్ లోని శివాలిక్ కొండల్లోకూడా లభ్యమయ్యాయి.

ఆ కాలాన్ని పాతరాతియుగం అని శాస్త్రజ్ఞులు వర్గీకరించారు. దీనిని బట్టి మనకు ఏం అర్థమవుతోందో తెలుసా? ఇప్పటికి 20 లక్షల సంవత్సరాల క్రితం భారతదేశంలోని రైవత్, శివాలిక్ కొండల ప్రాంతాలలో మానవులు నివశించేవారనీ, వారు రాళ్ళ పెచ్చులు ఊడగొట్టి ఆయుధాలుగా, పరికరాలుగా వాడేవారనీ తెలుస్తోంది. ఈ కాలాన్నే చరిత్రకారులు పాతరాతియుగం గా పిలుస్తున్నారు" అని మాస్టారు కొనసాగించబోతుండగా శ్రీను లేచి "మాస్టారూ! నాదో డౌట్" అన్నాడు.

"అడుగు" అన్నారు మాస్టారు చిరునవ్వుతో.

"మీరు భారతదేశ చరిత్ర చెబుతున్నారు గదా? రైవత్ అనే ప్రదేశం పాకిస్తాన్‌లోనిది అన్నారు. పాకిస్తాన్ చరిత్ర చెబుతున్నారేమిటి?"

శ్రీను ప్రశ్నకు మరల చిరునవ్వు నవ్వాడు మాస్టారు.

"శీనూ! మంచి ప్రశ్న వేశావు. ఈనాడు పాకిస్తాన్ ఉన్న ప్రాంతం వేలాది సంవత్సరాలుగా భారతదేశంలో భాగమే. ఉదాహరణకు తర్వాత చెప్పబోయే సింధు నాగరికతా ప్రాంతాలైన హరప్పా, మొహంజొదారోలు, ప్రాచీనకాలంలో దేశ, విదేశీ విద్యార్థులను వేలాదిమందిని ఆకర్షించిన తక్షశిలా విశ్వ విద్యాలయం ఇవన్నీ ప్రస్తుతం పాకిస్తాన్‌లోనే ఉన్నాయి. వాటిని గూర్చిన ప్రస్తావన లేకుండా భారతదేశ చరిత్రను కొనసాగించలేము" వివరించాడు మాస్టారు.

"పాతరాతియుగం ఎప్పటిదాకా ఉంది మాస్టారూ?" ప్రశ్నించాడు జహంగీర్.

"ఇప్పటికి దాదాపు పన్నెండువేల సంవత్సరాల క్రితం వరకు. అంటే క్రీ.పూ. 10,000 సంవత్సరం వరకు."

"ఆకాలంలో భారతదేశంలో ప్రజలు ఎక్కడెక్కడ నివశించారు? వారి జీవన విధానం ఎలా ఉండేది. చెప్పండి మాస్టారూ!" అడిగింది సాయిలక్ష్మి.

"చెబుతానమ్మా. పాతరాతియుగంలో ప్రజలు భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో నివశించారు. ఆ ప్రాంతాలలో దొరికిన రాతి పనిముట్లను బట్టి ఆకాలంలో, ఆ ప్రాంతంలో  ప్రజలు నివసించినట్లుగా రుజువవుతోంది. ఉదాహరణకు జీలంనది ఒడ్డున ఉన్న పబ్బీ కొండలలో పది లక్షల సంవత్సరాల నాటి రాతి పరికరాలు దొరికాయి. పాకిస్తాన్‌లోని సోన్ లోయలో సుమారు 6 లక్షల సంవత్సరాల నాటి రాతి గొడ్డళ్ళు దొరికాయి. కర్నాటకలోని హన్స్గీలోయ, చెన్నై సమీపాన అట్టిరాంపక్కంతో సహా దక్షిణ భారతదేశంలోని అనేక ప్రాంతాల్లో చేతి గొడ్డళ్ళు, మచ్చుకత్తులు దొరికాయి. ఇవి ఇప్పటికి సుమారు 31 వేల సంవత్సరాలనాటివని యురేనియం-థోరియం పద్ధతిలో చేసిన పరిశోధనలు నిరూపించాయి. ఈ వివరాలు భారతదేశంలో, పాతరాతియుగంలో, మానవులు జీలం నది ఒడ్డునుండి చెన్నై వరకు విస్తరించి ఉన్నారని తెలుస్తోంది" అన్నారు మాస్టారు.

"వారి జీవన విధానాన్ని గూర్చి వివరిస్తారా మాస్టారూ!" అడిగాడు ఆదాం.

"ఆదాం! ఆ వివరాలు, కొత్తరాతియుగం విశేషాలు వచ్చే క్లాసులో వివరిస్తాను" అంటూ లేచాడు విశ్వం మాస్టారు".



# 2వ భాగం. పాతరాతియుగం, కొత్తరాతియుగం, కంచుయుగం.

"పిల్లలూ! పాతరాతియుగంలో ప్రజలు ప్రధానంగా జంతువులను వేటాడి, చంపి, తినేవారు. వారు మూపురం గల ఎద్దు, దున్నపోతు, గొర్రె, మేక, జింక, పంది, ఖడ్గమృగం, మెట్ట తాబేలు, సముద్రపు తాబేలు, పలురకాలైన పక్షులను వేటాడిన ఆధారాలు చరిత్రకారులకు లభించాయి. వ్యవసాయం చేసినట్లు ఆధారాలు లేవు. పీచు లేక నార బట్టలు ధరించిన ఆధారాలు కూడ లేవు. వారు జంతు చర్మాలను ధరించి ఉంటారని చరిత్రకారులు ఊహిస్తున్నారు. విశేషమేమంటే ఈకాలంలో కొన్ని అటవీప్రాంతాలలో వేటాడిన జంతువుల అవశేషాలు, వాటికి దగ్గరలోని పర్వత ప్రాంతాలలో విస్తారంగా రాతి పనిముట్లు లభ్యమయ్యాయి. అంటే ఆ కాలం నాటికే ప్రజలలో పని విభజన, వస్తుమార్పిడీ ఉండేవనీ, పర్వత ప్రాంతాలవారు రాతిపనిముట్లు చేసి అటవీ ప్రాంతాలవారికివ్వడం, అటవీ ప్రాంతాలవారు వేటాడిన జంతుమాంసాన్ని పర్వత ప్రాంతాలవారికివ్వడం జరిగేదని అర్థమవుతోంది. మరో ముఖ్య విషయం ఏమిటంటే పురుషుల అస్థిపంజరాలపై ఎముకల కంఠహారాలు, లాకెట్లు లభించాయి. అంటే ఆకాలంలో పురుషులు మాత్రమే ఆభరణాలు ధరించేవారన్నమాట. అంతేకాదు, పాతరాతియుగంలోనే ప్రజలు గుడిసెలు నిర్మించుకొని అందులో నివసించడం నేర్చుకున్నారు. ప్రజలలో కొన్ని మత విశ్వాసాలు ఉండేవి. ఆనాడు చనిపోయినవారి సమాధుల్లో చంపబడిన జంతువుల ఎముకలు దొరికాయి. అంటే వారు చనిపోయిన వారికి కూడ ఆహారం అవసరమౌతుందని నమ్మేవారనీ, అందుకని వారికోసం ఏదైన జంతువును చంపి వారి సమాధుల్లో పూడ్చిపెట్టేవారనీ మనం ఊహించవచ్చు" అని ముగించారు విశ్వం మాస్టారు.

"బాగుంది మాస్టారూ! ఇక కొత్తరాతియుగం సంస్కృతిని గూర్చి చెప్పరా?" అడిగింది నవ్య.

"చెబుతానమ్మా! కొత్తరాతియుగం అంటే మరేమీకాదు. మరింత పదునైన, ఉపయోగకరమైన రీతిలో రాతి పనిముట్లను, రాతి ఆయుధాలను తయారుచేసుకొని, వాడిన కాలాన్నే కొత్తరాతియుగం అంటాం" అన్నారు మాస్టారు.

"అది ఎప్పటినుండి ఎప్పటిదాకా ఉంది మాస్టారు?" అడిగాడు సూర్యాంష్.

"సుమారు క్రీ. పూ. 10,000 నుండి క్రీ.పూ. 6000 వరకు ఉన్న కాలాన్ని కొత్తరాతియుగం అంటారు సూర్యా. ఆ కాలం విశేషాలు వివరిస్తాను. ఈ కాలంలో అనేక కొత్త ఆయుధాలు, పనిముట్లు తయారయ్యాయి. ఉత్తరప్రదేశ్‌లోని సహాయ్‌నరాయ్, మహాదహాలలో ఎముక, లేక మొనదేలిన చెకుముకి రాయిలతో గట్టిగా కట్టబడిన బాణాలు, ఆ బాణాలతో గట్టిగా గుచ్చబడిన అస్థిపంజరాలు లభించాయి. అంటే ఆ కాలంలో విల్లు, బాణాలు మానవులు కనుగొన్నారన్నమాట. అలాగే నర్మదా లోయలో కుక్కలు, పశువులు, గొర్రెలు లాంటి మచ్చిక చేయబడిన జంతువుల ఎముకలు లభించాయి. అంటే మానవులు జంతువులను మచ్చిక చేసుకోవడం ఈకాలంలో మొదలయిందన్నమాట. పై ప్రాంతాలలోనే తృణధాన్యాలను పిండిచేసే తిరగళ్ళు దొరికాయి. అంటే ధాన్యాన్ని పిండిచేయడం మానవులు నేర్చుకున్నారన్నమాట. చెట్లను నరకడానికి వాడే రాతిగొడ్డళ్ళు కూడ లభించాయి. అంటే చెట్లను నరికి, నేలను చదునుచేసి, వ్యవసాయాన్ని మొదలుపెట్టారని అర్ధమవుతోంది. అంతేకాదు. పంటకోతకు ఉపయోగించే కొడవళ్ళ అంచులకు పదునైన చిన్నరాళ్ళను తారుతో అతికించిన ఆధారాలు దొరికాయి. అంటే రాతి కొడవళ్ళను మరింత పదునుగా చేసి, వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడం జరిగిందన్నమాట. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే కొత్తరాతియుగంలోనే, మన పూర్వీకులు

తక్కువ వర్షపాతంగల ప్రాంతాలలో వాగులకు అడ్డుకట్టలు వేసి నీటి సౌకర్యం పెంచుకున్నట్లుగా ఆధారాలు లభించాయి. మరో ముఖ్యవిషయం. ఒకే సైజులో మట్టి ఇటుకలు తయారుచేసి, వాటిని ఆరబెట్టి ఆ ఇటుకలతో వారు ఇళ్ళు నిర్మించుకున్నారు. ఆ ఇళ్ళలో అగ్నికి ప్రత్యేక స్థానం కేటాయించారు. ఇళ్ళు అనేక చిన్న చిన్న గదులుగా విభజించబడ్డాయి. ఇలాంటి ఇళ్ళుగల గ్రామం సింధుమైదాన శిధిలాలలో బయల్పడింది. క్రీ.పూ. 4000 సంవత్సరం నాటికి కుండలు తయారుచేసే చక్రం (సారె) కనుగొనబడింది. ఆకాలంలోనే ప్రత్తి సాగుచేయడం, నూలు తీయడం, బట్ట నేయడం మనవారు కనుగొన్నారంటే మీకు ఆనందంగా లేదా? అడిగారు మాస్టారు.

"చాలా ఆనందంగా ఉంది మాస్టారు!" అన్నారు పిల్లలందరూ.

"ఇంకో ఆనందకరమైన విషయం చెబుతాను. కొత్తరాతియుగంలోనే మనవాళ్ళు చక్కని కళారూపాలు గీయడం నేర్చుకున్నారు. భోపాల్ సమీపంలోని భీమ్‌బెట్కా గుహలో వారు గీసిన చిత్రాలలో విల్లు, అమ్ములతో జంతువులను వేటాడే చిత్రాలు, బరువు మోస్తున్న స్త్రీ చిత్రం, ఆడ నెమలి చిత్రం ప్రపంచ ప్రఖ్యాతిని గడించాయి. చివరగా ఆ సంస్కృతిలోని బాధాకరమైన అంశాన్నొకదాన్ని వివరిస్తాను. ఆనాటి సమాధుల్లో, కొన్నిటిలో విలువైన రాళ్ళు ఉన్నాయి. కొన్నిటిలో లేవు. ఇది ఏ పరిస్థితిని సూటస్తోంది?" అడిగారు మాస్టారు.

"ఆ ప్రజలలో కొంతమంది ధనికులుగాను, కొందరు పేదలుగానూ ఉన్నారనీ, వారిలో సామాజిక అంతరాలు ఉన్నాయనీ సూచిస్తోంది" బదులిచ్చాడు సిద్దూ.

"ఇక కంచుయుగ సంస్కృతిని సంక్షిప్తంగా వివరించి ఈ క్లాసు ముగిస్తాను. ఈ సంస్కృతి క్రీ.పూ. 6000 నుండి క్రీ.పూ. 3000 వరకు ఉంది. కంచుయుగంలో, కంచు ఆయుధాలు కల్గిన ప్రజలు కొత్తరాతి ఆయుధాల

ప్రజలపై విజయం సాధించినప్పటికీ ప్రజల సాంస్కృతిక జీవనంలో పెద్దమార్పులేవీ సంభవించలేదు. కారణాలు ఏమిటంటే కంచులోహాలు చాలా తక్కువ పరిమాణంలో లభించడమూ, గెలిచినవారు ఓడిపోయిన వారి సంస్కృతిని కొనసాగించడమూ. ఈ కాలంనాటి కొన్ని విశేషాలు మీకు చెబుతాను. మొదటిది ఈకాలంనాటి శిధిలాలలో కనిపించిన వర్క్‌షాపులు, బట్టీలు రాగి, కంచు వస్తువులు తయారుచేసే నిపుణులున్నారని సూచిస్తోంది. సరుకులపై వేయబడిన రాగిముద్రలు వర్తకపు అభివృద్ధిని సూచిస్తున్నాయి. ఆనాటి అస్థిపంజరాలపై జరిగిన అధ్యయనం ఏం తెలియజేస్తోందంటే వర్క్‌షాపులలో హానికరమైన గాలి, చాలసేపు ఒకేచోట కూర్చొని పనిచేయడం వలన ప్రజల ఆరోగ్యానికి తీవ్రమైన హాని జరిగిందనీ, దానివలన సగటు ఆయుఃప్రమాణం కొత్తరాతియుగంలో 31 సం॥లు ఉండగా, కంచుయుగంలో అది 24 సం॥లకు తగ్గిందనీ రుజువైంది. దీనినిబట్టి కార్మికుల ఆరోగ్యాలను పణంగా పెట్టి భౌతిక అభివృద్ధిని సాధించడం ఆనాటినుండి ఉన్నదని అర్ధమవుతోంది. ఇవీ కంచుయుగ సంస్కృతి విశేషాలు. వచ్చే క్లాసులో సింధునాగరికతను గూర్చి ముచ్చటించుకుందాం” అంటూ ముగించారు మాస్టారు.



# 3వ భాగం. సింధూ నాగరికత

"పిల్లలూ! క్రీ.పూ. 2600 నాడే, అంటే ఇప్పటికి 4600 సంవత్సరాల క్రితమే, భారతదేశంలో ఒక మహోన్నత నాగరికత విలసిల్లింది తెలుసా? ఆనాటికే సింధూనదీ పరీవాహక ప్రాంతంలో, అంటే సింధూనది ప్రవహించే ప్రాంతానికి ఇరువైపులా ఉన్న ప్రాంతంలో అనేక గొప్ప నగరాలు నిర్మించబడ్డాయి. ఆ నగరాలు విలసిల్లిన నాగరికతను చరిత్రకారులు ఏమని పిలిచారో తెలుసా?" అడిగారు విశ్వం మాస్టారు.

"సింధూ నాగరికత మాస్టారూ!" టకీమని బదులిచ్చింది నవ్య.

"కరెక్ట్. ఎలా చెప్పగలిగావు?" నవ్వుతూ అడిగారు మాస్టారు.

"మీరే చెప్పారుగా మాస్టారూ! ఆ నాగరికత సింధూ పరీవాహక ప్రాంతంలో విలసిల్లిందని" బదులిచ్చింది నవ్య.

"గుడ్. ఆ నాగరికత ఎంత విస్తీర్ణంలో విస్తరించిందంటే, పడమర పాకిస్తాన్‌లోని మహంజోదారో నుండి తూర్పున రాజస్థాన్‌లోని కాలిబంగన్ వరకు, ఉత్తరాన పాకిస్థాన్‌లోని హరప్పా నగరం నుండి దక్షిణాన గుజరాత్‌లోని లోథాల్ వరకు విస్తరించి ఉంది. వీటిలో పెద్ద నగరమైన మొహంజోదారో ఎంత విస్తీర్ణంలో ఉందో తెలుసా? దాదాపు 500 ఎకరాలు. దాని జనాభా దాదాపు 85,000 ఉండేదని చరిత్రకారులు అంచనావేశారు. ఈ నాగరికత గొప్పతనం ఏమిటంటే అన్నివేల ఏళ్ళనాడే నగరాలను అత్యంత ప్రణాళికాబద్ధంగా నిర్మించడం. ఉదాహరణకు మొహంజోదారో తీసుకుందాం. దీనిలో ఎత్తైన బేస్‌మెంట్‌పై ఒక కోట నిర్మించబడింది. ఇతర పెద్ద గృహాలు కూడా ఎత్తైన బేస్‌మెంట్‌పైనే నిర్మించబడ్డాయి. దీనివలన ఆకోట, గృహాలు వరదల నుండి రక్షించబడ్డాయి. రోడ్లు విశాలంగా, ఒకదాని కొకటి సమాంతరంగా ఉన్నాయి.

ప్రధానరోడ్లు ఎంత వెడల్పంటే, రెండు ఎద్దుల బండ్లు ఎదురెదురుగా వచ్చినా, ఇరుకు లేకుండా దాటిపోగలవు. గోడలలో క్రింది భాగాన్ని కాల్చిన ఇటుకలతోనూ, పై భాగాన్ని ఎండిన ఇటుకలతోనూ కట్టారు. మరొక గొప్ప విషయమేమంటే ప్రతి ఇంటిలోనూ ఒక స్నానాల దొడ్డి, ఒక మరుగుదొడ్డి ఉన్నాయి. వీటినుండి వచ్చే నీరు బయటికిపోయి, వీధిలోని మురుగు కాల్వలలో కలుస్తాయి. కొన్ని వీధులలో మురుగు కాల్వల బదులు మట్టి (టెర్రకోటా) తో తయారుచేసిన పైపులున్నాయి. ప్రధాన రోడ్డు ప్రక్కన మురుగు కాల్వ పైనుండి కప్పబడింది. కొన్ని చోట్ల మనిషి ఎత్తున్న పై కప్పు నిర్మించబడింది. ఒక మనిషి లోపలికి వెళ్ళి కాలువను శుభ్రం చేయవచ్చు. ఇది వింటే మీకేమనిపిస్తోంది?" అడిగాడు మాస్టారు.

"దాదాపు 5000 ఏళ్ళనాడే మనవాళ్ళు సివిల్ ఇంజనీరింగ్‌లో ఎంత గొప్పవారోనని ఆశ్చర్యం వేస్తోంది మాస్టారూ!" అన్నాడు తేజ.

"నగర నిర్మాణానికి సంబంధించి మరో ముఖ్యమైన అంశాన్ని చెబుతాను వినండి. మొహంజోదారోలో 12 మీటర్ల పొడవు (40 అడుగులు), 7 మీటర్ల (దాదాపు 25 అడుగులు) వెడల్పు, 2.4 మీటర్ల (8 అడుగులు) లోతు కల్గిన ఒక పెద్ద స్నానవాటికను కాల్చిన ఇటుకలతో కట్టారు. ఈ తొట్టి బయటి భాగాన్ని తారువంటి పదార్థంతో పూతవేశారు. అందువలన ఈ తొట్టిలో నుండి నీరు కారిపోకుండా ఉంటుంది. దీనికి అడుగున, నీరు బయటకు పోయేందుకు ఒక తూమును ఏర్పాటుచేశారు. స్నానవాటికలోనికి దిగటానికి మెట్లు నిర్మించారు. ఈ స్నానవాటిక ప్రక్కన మరో నిర్మాణం ఉంది. దానిని ధాన్యాగారంగా చరిత్రకారులు గుర్తించారు. ఈ స్నానవాటికలో స్నానాలు చేసి, మతాచార్యులు కొన్ని మత కర్మలు నిర్వహించి, రైతులవద్ద నుండి పన్నులను ధాన్యం రూపంలో వసూలు చేసేవాళ్ళనీ, ప్రజలలో మత విశ్వాసాలూ, మూఢ విశ్వాసాలూ బాగా ఉన్న కారణంగా ప్రజలు ఎంత ధాన్యాన్ని అయినా

సంతోషంగా పన్నుల రూపంలో ఇచ్చేవాళ్ళనీ, ఆ ధాన్యాన్ని ప్రక్కనే ఉన్న ధాన్యాగారంలో నిల్వచేసేవారనీ చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు.

ఈ నగరాలలో నీటి సౌకర్యం కొరకు అనేక వందల బావులు తవ్వుకున్నారు. మొహంజోదారోలో 700 బావులున్నాయి.

సింధూ నాగరికతలోని మరో ముఖ్య విషయం ఏమిటంటే నదులకు ఆడ్డుకట్టలు వేసి, కాలువలను త్రవ్వి, వాటినుండి పొలాలలకు నీరు ఏర్పాటుచేసుకొని వ్యవసాయం చేశారు. వారు గోధుమ, బార్లీ, పప్పు ధాన్యాలు, నూనె గింజలు, ప్రత్తి, మొక్కజొన్న పండించినట్లు ఆధారాలు దొరికాయి. అంతేకాదు. నార, అల్లిన బట్ట అవశేషాలు మొహంజోదారోలో దొరికాయి. టెర్రకోటాతో చేసిన దారపుకండెలు పెద్ద సంఖ్యలో సింధూ నగరాలలో దొరికాయి. దీనిని బట్టి మీకేం అర్థం అవుతోంది. జహంగీర్! నువ్వు చెప్పు".

"ప్రజలు బట్టలను చేనేత ద్వారా నేసి ఉపయోగించుకొనేవారు మాస్టారు" ! జహంగీర్ సమాధానమిచ్చాడు.

"అవును. అంతేకాదు చక్రంతో చేసి, ఎర్రగా కాల్చబడిన అనేక కుండలు ఆ నగరాలలో దొరికాయి. మరో విశేషం ఏమిటంటే, ఏదైనా తాగి పారవేసే చిన్న మట్టికప్పులు గట్టలు గుట్టలుగా కొన్ని బావులవద్ద దొరికాయి. అంటే.... ఆగారు మాస్టారు.

"మనం ఈనాడు వాడుతున్న డిస్పోజబుల్ మట్టి కప్పులు ఆనాటి నుండి ఉన్నవని అర్థం అవుతోంది మాస్టారూ!" డేనియల్ అన్నాడు.

"కరెక్ట్. అలాగే మాంజిష్ట మొక్క రసంతో ఎరుపు రంగు అద్దకం వేసిన బట్టలు మొహంజోదారోలో దొరికాయి. అంటే ఆనాటికే భారతీయులకు గుడ్డలపై అద్దకం వేసే నైపుణ్యం ఉందని తెలిసి మీకు గర్వంగా ఉంది గదా?"

"ఉంది మాస్టారూ" పిల్లలందరూ అన్నారు.

"మరో విషయం. దొరికిన ఎముకలలో ఎద్దు, గొర్రె, మేక, బర్రె, చేప చిత్రాలున్నాయి. దీనినిబట్టి సింధు ప్రజలు పైవాటిని ఆహారంగా స్వీకరించేవారని తెలుస్తోంది. మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే అడవి గాడిదల ఎముకలు లభ్యమైనాయి. కొందరు ఈ ఎముకలు మచ్చికచేయబడిన గుర్రాల ఎముకలుగా భావిస్తున్నారు. కాని జంతుశాస్త్రజ్ఞులు చెప్పేదేమిటంటే, మచ్చికచేయబడిన జంతువుల ఎముకల ఆకృతి మారిపోతుంది. వాటిద్వారా ఆ ఎముకలు అడవి జంతువువా, లేక మచ్చికచేయబడిన జంతువా అని తెలిసిపోతుంది. వారి పరిశీలన ప్రకారం సింధు ప్రాంతంలో దొరికిన ఎముకలు అడవి గాడిదలవేనని తేలింది. అంతేకాదు, ఈనాటికీ ఆ ప్రాంతంలో అడవి గాడిదలుండటం వారి వాదనను బలపరుస్తోంది. కాబట్టి సింధు నాగరికతా కాలంలో ప్రజలకు గుర్రాన్ని గూర్చి తెలియదని అర్థమవుతోంది. సింధూ నాగరికతకు సంబంధించిన మరికొన్ని విశేషాలు వచ్చే క్లాసులో ముచ్చటించుకుందాం" అని చెప్పి క్లాసు ముగించారు మాస్టారు.



# 4వ భాగం. సింధూ నాగరికత (కొనసాగింపు)

"పిల్లలూ! సింధూ నాగరికతలోని మరికొన్ని విశేషాలు చెబుతాను. వాళ్ళు విదేశాలతో వ్యాపారం చేసేవారు. చరిత్రకారులు ఇది ఎలా చెప్పగలుగుతున్నారంటే, తుర్క్‌మెనిస్థాన్‌లో సింధూ నాగరికతకు చెందిన ముద్రలు దొరికాయి. అంటే సింధు ప్రాంతపు వ్యాపారులు అక్కడికి వెళ్ళినట్లేకదా? అలాగే మొహంజోదారో, హరప్పాలలో బాక్ట్రియన్ ఒంటెల ఎముకలు దొరికాయి. అంటే మధ్య ఆసియాకు చెందిన బాక్ట్రియా వర్తకులు వ్యాపారం కోసం సింధూ ప్రాంతానికి వచ్చినట్లే కదా? అంతేకాదు. సింధూ నాగరికతకు చెందిన ముద్రలు మధ్య ఇరాక్‌లో లభించాయి. ఇదికూడ మనవారి విదేశీవర్తకాన్ని నిరూపిస్తోంది. ఇంకోవిషయం ఏమిటంటే సింధూ నాగరికతా నగరాలలో ఖచ్చితమైన బరువుతో అనేక తూనికరాళ్ళు దొరికాయి. అలాగే క్రమబద్ధమైన గుర్తులున్న కొలబద్దలు చాలా దొరికాయి. ఇవన్నీ వారి వ్యాపార అభివృద్ధిని సూచిస్తున్నాయి." అని చెప్పారు విశ్వం మాస్టారు.

"వారూ మనలాగా అన్నం తినేవారా? రొట్టెలు తినేవారా మాస్టారూ?" అడిగాడు అభినంద్.

"వారు మాంసం, రొట్టెలే తినేవారు అభినంద్. చరిత్రకారులకు ఎలా తెలుసంటే ఆ నగరాలలో తందూరీ పొయ్యిలు వారికి లభ్యమయ్యాయి" అన్నారు మాస్టారు.

"వారికి ఏ ఏ లోహాలు తెలుసు మాస్టారు?" అడిగింది శాంతి.

"వారికి బంగారు, వెండి, రాగి, కంచు తెలుసు. బంగారు, వెండితో ఆభరణాలు, రాగి, కంచుతో పనిముట్లు, ఆయుధాలు తయారుచేశారమ్మా" బదులిచ్చాడు మాస్టారు.

“వారి భాష పేరేమిటి మాస్టారూ? అడిగాడు రాజశేఖర్.

“రాజశేఖర్, వారి నాగరికత, సంస్కృతి, నగరాలు అన్నీ క్రీ.పూ. 1750 నుండి కొన్ని వందల ఏళ్ళలో ఒకదాని తర్వాత ఒకటిగా పూర్తిగా ధ్వంసంచేయబడ్డాయి. కొన్నివేల ఏళ్ళపాటు ఆ నగరాల శిధిలాలు భూమిలోనే కప్పబడి ఉండిపోయాయి. అసలు ఆ నగరాలు, ఆ నాగరికత ఉందనేదే భారతీయులకుగాని, ఇతర ప్రపంచానికి గాని తెలియదు. ఇటీవలనే, అంటే ఒక వంద సంవత్సరాల క్రితం, క్రీ.శ. 1920 ప్రాంతంలో, సింధు మైదానంలో జరిగిన త్రవ్వకాలల్లో మొహంజోదారో, హరప్పా నగరాలు, తర్వాత కాలిబంగన్, ధోలవిరా, లోథాల్ నగరాలు బయటపడ్డాయి. ఈ నగరాలన్నిటి నిర్మాణం, ముద్రలు, లిపి ఒకేరకంగా ఉండటం, ఒకే కాలానికి చెందినవి కావడంతో ఆ నగరాలన్నిటి నాగరికతను సింధు నాగరికత అని చరిత్రకారులు పిలుస్తున్నారు. వారి లిపిని ఇంతవరకు ఎవరూ చదవలేకపోయిన కారణంగా వారి భాషను ఖచ్చితంగా ఎవరూ చెప్పలేకపోతున్నారు. ఐతే వారి లిపిలోని కొన్ని సంకేతాలు ఆఫ్ఘనిస్థాన్‌లోని ‘బ్రాహుయి’ అనే ఉత్తర ద్రవిడియన్ భాషను పోలి ఉండటాన్నిబట్టి, వారి భాష ఉత్తర ద్రవిడియన్ భాషా కుటుంబానికి చెందిఉంటుందని భావిస్తున్నారు.

“వారి మతం, దేవుళ్ళు, మతాచార్యులను గూర్చి చెప్పరా మాస్టారు?” అడిగింది శైలజ.

“సింధు ప్రాంతంలో మాతృదేవతల బొమ్మలు చాలా దొరికాయి. సంఖ్యలో ఇవి పురుష దేవతల బొమ్మలకంటే చాల ఎక్కువ ఉన్నాయి. తలకు గేదె కొమ్ములు కలిగి, మానవుడి రూపం కల్గి, చుట్టూ పశువులున్న దేవుడి ముద్ర మొహంజోదారోలో దొరికింది. కాబట్టి ప్రధానంగా వారు స్త్రీ దేవతలను పూజించేవారనీ, పశుపతిని గూడ పూజించేవారనీ అర్థమవుతోంది. అలాగే మీసాలు లేకుండా, గడ్డం కల్గి, ఒక భుజం మీదుగా కండువా చుట్టబడిన

ఒక విగ్రహం మొహంజోదారోలో దొరికింది. ఇది ఆనాటి మతాచార్యుడుగానీ, మతాచార్యుడైన రాజుదిగానీ విగ్రహమని చరిత్రకారులు భావిస్తున్నారు. వారి మతాచారాలేవీ తెలియనప్పటికీ, అంత్యక్రియల విషయంలో చనిపోయిన వారిని పూడ్చిపెట్టేవారనీ, దహనం చేసేవారు కాదనీ ఆధారాలు దొరికాయి.

“మాస్టారూ! కనీసం ఆకాలంలోనైనా ప్రజలు ధనిక, బీద అంతరాలు లేకుండా సమానంగా బతికారా? సుందర్ అడిగాడు.

“లేదు సుందర్! సింధు నాగరికతా కాలంలో కూడ ప్రజలలో అంతరాలుండేవి’’ అని ఒక నిట్టూర్పువిడిచి కొనసాగించాడు మాస్టారు.“ఆకాలంలో కట్టిన ఇళ్ళలో కొన్ని పెద్ద ఇళ్ళను కాల్చిన ఇటుకతో కట్టారు. వాటిలో అనేక గదులున్నాయి. ఉమ్మడి వంటశాల ఉన్నది. కొన్ని గదులలో చేతివృత్తులలో వాడగా మిగిలిన ముడిసరుకు లభించింది. అంటే కొన్ని గదులను చేతి వృత్తుల వారికి కేటాయించారు. ఇవి ధనవంతుల ఇళు ్ళ. మరోచోట రెండు గదులున్న పదహారు ఇళ్ళు, ఎండిన ఇటుకలతో కట్టబడి, రెండు వరుసలలో ఉన్నాయి. ఇవి 20 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పు కలిగిఉన్నాయి. ఇవి కూలీల ఇళ్ళు. ఇలా రెండు రకాలైన ఇళ్ళు ఆ సమాజంలో ధనికులు, పేదలు అనే రెండు వర్గాలున్నట్లు తెలుస్తోంది” ముగించారు మాస్టారు.

“ఆనగరాలు పూర్తిగా ధ్వంసం అయిందన్నారుగదా? అవి ఎలా ధ్వంసం అయ్యాయి? ఎవరు చేశారు? ఆ వివరాలు చెప్పరా మాస్టారూ! అడిగాడు సిద్దూ.

“వచ్చే క్లాసులో చెబుతాను సిద్దూ” అంటూ లేచారు మాస్టారు.



# 5వ భాగం. సింధు నాగరికత ఎలా నాశనమయింది?

"పిల్లలూ! సింధు నాగరికత, వారి నగరాలు క్రీ.పూ. 1750 నుండి ఒకటొకటిగా వరుసగా నాశనం చేయబడ్డాయి. ఈ విషయంలో రుజువులతో కూడిన, మెజారిటీ చరిత్రకారులు అంగీకరించిన అంశాలనే మీకు చెబుతాను." అంటూ మొదలెట్టారు విశ్వం మాస్టారు.

"సింధు నాగరికతకు సంబంధించిన ప్రధాన నగరాలైన హరప్పా, మొహంజోదారోలు క్రీ.పూ. 1750 ప్రాంతంలో నాశనం చేయబడ్డాయనీ, ఈ నాశనం బయటి నుండి వచ్చి దాడిచేసిన వారి వలన అయిందని రుజువులు దొరికాయి".

"ఏమిటా రుజువులు మాస్టారూ?" అడిగాడు అభినంద్.

"మొహంజోదారో శిథిలాల్లో, 38 అస్థిపంజరాలు అత్యంత అసాధారణమైన పరిస్థితులో పడి ఉన్నవి దొరికాయి. కొన్ని ఇళ్ళలో, కొన్ని రోడ్లమీద పడి ఉన్నాయి. దురాక్రమణదార్ల దాడిలో చనిపోయినవారి అస్థిపంజరాలుగా, చరిత్రకారులచే ఇవి గుర్తించబడ్డాయి. అంతేకాదు ఆనాటి అనేక నగరాలలో, వారి సంపదకు చెందిన భాండాగారాలు తవ్వకాలలో బయటపడ్డాయి. అంటే ఆ భాండాగారాలకు చెందినవారు, వాటిలోని ధనం తీసుకోకుండా చంపివేయబడటమో, పారిపోవడమో జరిగిందన్నమాట" అన్నారు మాస్టారు.

"ఇదేనా? ఇంకేమైనా రుజువులున్నాయా మాస్టారూ?" ఆడిగాడు రోహిత్.

"ఉన్నాయి రోహిత్ ! సింధు నగరాల శిథిలాలలో కంటే, వారిని నాశనం చేసిన వారికి చెందిన సాహిత్యంలో ఎక్కువ రుజువులు దొరికాయి. సింధు నాగరికతను నాశనం చేసినవారిని ఆర్యన్ భాషాజాతికి చెందినవారుగానూ, వారు మధ్య ఆసియా నుండి మనదేశంపై దండయాత్రలు చేసినవారుగానూ

అనేక రుజువులతో చరిత్రకారులు నిర్ధారించారు. ఇక ముందు వారిని సౌలభ్యంకోసం 'ఆర్యులు' అని పిలుద్దాం."

"ఆర్యులు సింధు నగరాలపై దాడిచేసి, వాటిని నాశనం చేశారనేందుకు, వాళ్ళ సాహిత్యంలో ఉన్న రుజువులేమిటి మాస్టారు?" అడిగింది స్రవంతి.

"ఆర్యులు అపారమైన సాహిత్యాన్ని వెలువరించారమ్మా. వాటిలో మొదటివి వేదాలు. ఇవి నాలుగు. రుగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం. వీటిలో మొట్టమొదటిది రుగ్వేదం. అంటే చరిత్రకు అందినంతవరకు భారతదేశానికి చెందిన మొట్టమొదటి సాహితీ గ్రంథం రుగ్వేదం. వేద సాహిత్యం క్రీ.పూ. 1750 ప్రాంతంలో ఆరంభమయిందనీ, రుగ్వేదం క్రీ.పూ. 1750 ప్రాంతంలో వ్రాయబడిందనీ చరిత్రకారులు నిరూపించారు. విశేషమేమంటే ఈ వేదాలన్నీ అప్పటినుండి బ్రిటీష్ వారు వచ్చేవరకు గురువు నుండి శిష్యునికి నోటిద్వారా చెప్పబడి, భట్టీయం చేయబడి, మనకు అందాయి. బ్రిటీషువారి కాలంలోనే వేదాలు, వాటి అర్థాలు గ్రంథస్తం చేయబడ్డాయి. అలా తరతరాలకు వేద సంహితులను మనకు అందించిన వేదపండితులకు మనం కృతజ్ఞతలు తెలియజేయాలి. అలా చెప్పడం, వినడం ద్వారా అధ్యయనం చేయబడ్డవి కాబట్టే వాటిని శృతులు అనికూడా పిలుస్తున్నారు. ఈ వేదాలలో ఆర్యులు సింధూ నాగరికతను నాశనం చేసినట్లు తెలిపే అనేక అంశాలు మనకు దొరుకుతాయి. ఉదాహరణకు రుగ్వేదం 6వ మండలం, 27వ సూక్తం, 6వ మంత్రంలో ఇలా చెప్పబడింది. "ఇంద్రా! యుద్ధమున నిన్ను గెలిచి అన్నము, కీర్తి సాధించదలచినవారు, యజ్ఞపాత్రలను భగ్నము చేసినవారు, కవచములు ధరించినవారగు వరశిఖుని130 మంది పుత్రులు హరయూపియా వద్ద ఏకకాలమున చంపబడినారు". ఈ హరయూపియాయే ఈనాటి హరప్పా అని చరిత్రకారులు నిర్ధారించారు. అంతేకాదు. అధర్వణవేదం ఆర్యులు సింధూ నగరాలను నాశనం చేశారని అనుమానానికి తావులేకుండా నిరూపిస్తోంది.

ఆ వేదంలో 20వ కాండ, 4వ అనుపాకం, 4వ సూక్తం, 5వ మంత్రంలో "ఇంద్రా! నీవు అసురుల 99 పురములను ధ్వంసము చేసినావు. నీ నివాసము కొరకు 100వ పురమును ఆక్రమించినావు" అని ఉంది. ఇది ఆర్యులు సింధూ ప్రజల పురాలను నాశనం చేయడాన్ని నిరూపిస్తోంది గదా?" అన్నారు మాస్టారు.

"ఆర్యులు సింధూనాగరికతనూ, వాళ్ళ పట్టణాలను ఎందుకు అంత తీవ్రంగా నాశనం చేశారు మాస్టారూ?" అడిగాడు అశ్వంత్.

"అది తెలుసుకోవాలంటే వారి ఆర్థిక విధానాల్లో తేడాలు తెలుసుకోవాలి అశ్వంత్! దండయాత్రీకులైన ఆర్యులు ప్రధానంగా పశుపోషకులు. వేదాలనిండా వేదరుషులు ఇంద్రుని, అగ్నిని, వరుణుడిని తమకు గోవులను యీయమని కోరిన మంత్రాలు ఉన్నాయి. పశువుల మేతకోసం పచ్చికబయళ్ళు కావాలి. ఆ బయళ్ళు ఎక్కడ ఉంటే అక్కడికి ఆర్యులు తరలిపోయేవారు. అందువలన వారికి స్థిరనివాసం, పట్టణాలు అవసరం లేదు. సింధు నాగరికతా ప్రజలకు శాస్త్రజ్ఞానం ఎక్కువ. వారు ప్రధానంగా వ్యవసాయం మీద ఆధారపడి జీవించేవారు. అందుకోసం నదులకు అడ్డుకట్టలు కట్టారు. దానివలన నదికి ప్రక్క ప్రాంతాలలో, వర్షాకాలంలో వరద ముంపు ప్రాంతం పెరిగేది. వరదలవలన ఏర్పడిన బురద సారవంతమైన నేల. ఆనేలలో వ్యవసాయం చేసేవారు. స్థిరమైన చోట వ్యవసాయం కాబట్టి స్థిరనివాసాలు ఏర్పరచుకొన్నారు. అవే వారి పట్టణాలు. కాని నదులపై అడ్డుకట్టల వలన ఆర్యులకు రెండు నష్టాలున్నాయి. ఒకటి వరదలవలన నది ప్రక్క ప్రాంతమంతా బురదగామారి పశువులు తిరగటానికి చోటుండదు.రెండవది నదికి దిగువ భాగంలో నీటి కరువు వచ్చి పశుసంపదకు తీవ్రమైన అసౌకర్యం ఏర్పడుతుంది. అందువలన ఆర్యులు తమ పశు సంపదకోసం ఆనకట్టలు తెగగొట్టారు. ఇది సింధు ప్రజల ఆర్థిక విధానాన్ని దెబ్బతీసింది. తమ శత్రువులైన సింధు ప్రజల పట్టణాలను, శతృవులను నాశనం చేసి, ఆర్యులు శతృశేషం లేకుండా, వారి సంస్కృతి చిహ్నాలు కూడ మిగలకుండా చేశారు." అన్నారు మాస్టారు.

"ఆర్యులు సింధు ప్రజలు నిర్మించిన అడ్డుకట్టలను నాశనం చేశారనేందుకు రుజువులేమయినా ఉన్నాయా మాస్టారూ?" అడిగాడు సుఖదేవ్.

"ఉన్నాయి సుఖదేవ్! రుగ్వేదంలోనే రుజువులున్నాయి. ఉదాహరణకు రుగ్వేదం 6వ మండలం, 17వ సూక్తం, 12వ మంత్రంలో ఏముందో తెలుసా? 'ఇంద్రా! వృత్రునిచే ఆపబడి, స్థిరముగా ఉన్న నదీజలములను విముక్తము చేసినావు. అందువలన నదులు ప్రవహింపసాగినవి. నీటి అలలను విమక్తము చేసినావు. ఆనదులు క్రిందివైపునకు ప్రవహించినవి" అని ఉంది. అంటే బంధించబడ్డ నదీజలాలను తమ దైవం సహాయంతో, అడ్డుకట్టలను ధ్వంసంచేయడం ద్వారా, క్రిందికి పారించామని రుగ్వేదంలో స్పష్టంగా చెప్పబడింది గదా?"

"మాస్టారు! ఆర్యులు మనదేశం మీదికి వచ్చిన విదేశీ దండయాత్రీకులని అన్నారు గదా? దానికేమైనా రుజువులున్నాయా?" అడిగాడు పవన్‌కుమార్.

"ఉన్నాయి పవన్ ! అవి వచ్చే క్లాసులో చెబుతాను" అంటూ ఆరోజు క్లాసు ముగించారు మాస్టారు.



# 6వ భాగం. ఆర్యులు విదేశీయులా?

‘‘పవన్!’’ ‘ఆర్యులు విదేశీదండయాత్రీకులు అనేందుకు రుజువులున్నాయా?’ అని అడిగావు గదా? రుజువులున్నాయి. వాటిని వివరంగా చెబుతాను” అంటూ ఆ రోజు క్లాసు మొదలెట్టారు మాస్టారు.

“సింధూ నాగరికతకు చెందిన నగరాల శిధిలాలలో అడుగు పొరలలో ఎక్కాడా మచ్చిక చేయబడ్డ గుర్రాల ఎముకలు పురావస్తు శాస్త్రజ్ఞులకు దొరకలేదు. అంటే అర్థమేమిటి? సాయిజ్యోతి ! నీవు చెప్పమ్మా” అడిగారు మాస్టారు.

“అంటే, ఆ ప్రజలకు గుర్రాల గూర్చి ఏమీ తెలియదన్నమాట” అంది సాయిజ్యోతి.

“ఆర్యులకు చెందిన వైదిక సాహిత్యంలో అనేక చోట్ల గుర్రాలను గూర్చీ, గుర్రాలు పూన్చిన రథాలను గూర్చీ చెప్పబడింది. దానిని బట్టి నీకేమి అర్థమయింది. చందూ నువ్వు చెప్పు”.

“ఆర్యులు గుర్రాలను బాగా మచ్చిక చేసుకున్నారని అర్థమవుతోంది మాస్టారు!” అన్నాడు చందూ.

“ఆర్యులు ఎక్కడి నుండి వచ్చారు. అనేందుకు ఇది ఒక కీలక సాక్ష్యం. ఆర్యులు గుర్రాలను మచ్చిక చేసుకున్నవారని అర్థమవుతోందిగదా? వారు గుర్రాలను ఎప్పుడు మచ్చిక చోసుకున్నారు? ఎక్కడ మచ్చిక చేసుకున్నారు? ఏ త్రోవన సింధు ప్రాంతానికి వచ్చారు? దీనికి సంబంధించి, పురాతత్వ శాస్త్రజ్ఞులు స్పష్టమైన రుజువులు సంపాదించారు. పురాతత్వ శాస్త్రజ్ఞులు అంటే ఎవరో ఎవరైనా చెప్పగలరా? అడిగాడు మాస్టారు.

“నేను చెప్తాను మాస్టారు!” చేయి పైకెత్తి అన్నాడు సిద్దూ.

"చెప్పు సిద్దూ !" నవ్వుతూ అడిగాడు మాస్టారు.

"ఒక ప్రదేశాన్ని జాగ్రత్తగా తవ్వి, అక్కడ దొరికిన ఎముకలు, వస్తువులు, శిథిలమైన ఇళ్ళ ఆనవాళ్ళు బాగా పరిశీలించి, కొన్ని పరీక్షల ద్వారా అవి ఎప్పటివో నిర్ణయించి, ఆ ప్రాంతంలో పురాతన కాలంలో ఉన్న ప్రజల నాగరికతను వివరించేవాళ్ళే పురాతత్వ శాస్త్రజ్ఞులు." అన్నాడు సిద్దూ.

"కరెక్ట్. బాగా చెప్పావు సిద్దూ! సిద్దూ చెప్పినట్లుగా పురాతత్వ శాస్త్రజ్ఞులు ప్రపంచంలోని అనేక ప్రాంతాలలో పరిశోధనలు చేసి తేల్చి చెప్పిన విషయం చెబుతాను. మచ్చిక చేయబడిన గుర్రాల ఎముకలు ప్రపంచంలో అనేక చోట్ల దొరికాయి. వాటిలో విశేషం ఏమిటంటే గుర్రాల ఎముకలు నేటి రష్యాలోని ఓల్గానదీ తీరంలో దొరికిన వాటిని క్రీ.పూ. 6000 నాటివిగా శాస్త్రజ్ఞులు తేల్చారు. అవి అనటోలియా ప్రాంతంలో అంటే నేటి టర్కీ ప్రాంతంలో క్రీ.పూ. 4000 ప్రాంతంలో దొరికాయి. అంటే ఏమి అర్థం చేసుకున్నారు?"

క్లాసంతా మౌనం.

మరల మాస్టారే చెప్పడం మొదలెట్టారు.

"అంటే గుర్రాలను మచ్చిక చేసుకోవడం నేర్చిన వ్యక్తులు క్రీ.పూ. 4000 నాటికి రష్యా నుండి టర్కీకి వచ్చారన్నమాట. ఆ గుర్రాల ఎముకలు క్రీ.పూ. 3000 నాటికి ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్‌లలో లభ్యమయ్యాయి. అంటే ఏం జరిగిందన్నమాట?" చెప్పడం ఆపారు మాస్టారు.

"గుర్రాలను మచ్చిక చేసుకున్నవారు క్రీ.పూ. 3000 నాటికి ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్ వరకూ వచ్చారని అర్థమవుతోంది మాస్టారు!" అన్నాడు శ్రీను.

"అవును. ఇప్పుడు అసలు విషయానికి వస్తాను. మచ్చిక చేయబడిన గుర్రాల ఎముకలు సింధూనగరాల శిథిలాల పైపొరల్లో అంటే క్రీ.పూ. 1750 నాటి శిథిలాలలో దొరికాయి. ఇప్పుడు శాస్త్రిజ్ఞుల పరిశోధనల్లో ఏం

రుజువయిందో ఊహించి చెప్పండి" అడిగారు మాస్టారు.

"గుర్రాలను మచ్చిక చేసుకున్న ఆర్యులు క్రీ.పూ. 6000 ప్రాంతంలో రష్యాలో ఉండేవారని, వారు క్రమంగా దక్షిణంగా ప్రయాణించి క్రీ.పూ. 4000 నాటికి టర్కీ వచ్చారనీ, అక్కడి నుండి ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్‌లకు క్రీ.పూ. 3000 నాటికి చేరి, క్రీ.పూ. 1750 నాటికి సింధూ నదీ తీరనగరాలకు చేరారనీ అర్థమవుతోంది మాస్టారూ!" అన్నాడు మణిధర్.

"గుడ్. పురాతత్వ శాస్త్రజ్ఞులు ఇదే నిర్ధారించారు. ఇప్పుడు హిందువుల పవిత్ర గ్రంథమైన "రుగ్వేదమూ", మరో హిందూ మత గ్రంథం "బౌద్ధాయన శ్రౌతసూత్ర", రుగ్వేదంతో భాషాపరంగా సన్నిహిత సంబంధమున్న ఇరానియన్ మత గ్రంథం "అవేస్తా"లలో ఆర్యులు పశ్చిమం నుండి వచ్చారనేందుకు ఉన్న రుజువులను వివరిస్తాను. ఋగ్వేదం 7వ మండలంలో ఇలా ఉంది " మిత్రావరుణులారా! యజమానులు కొడవలి చేతబట్టి తూర్పు దిక్కుగా సాగినారు. మీరు దాసులను, సుదాస శత్రువులైన ఆర్యులను వధించండి". ఈ విషయాన్ని "బౌద్ధాయనశ్రౌతసూత్ర" మరింత స్పష్టంగా పేర్కొన్నది. దానిలో ఇలా ఉంది " పురూరవుడు, ఊర్వశిలకు ఇరువురు సంతానం. వారు ఆయువు, అమవసువు. తల్లి ఊర్వశి, వారిని బయటి ప్రాంతాలకు వెళ్ళమన్నది. ఆయువు తన అనుచరులతో తూర్పుగా వెళ్ళాడు. వారు కురు, పాంచాల, కాశి, విదేహాలను ఆక్రమించారు. అమవసువు పశ్చిమ ప్రాంతంలోనే ఆగిపోయాడు". ఇరానియన్ మత గ్రంథం "అవేస్తా" కూడా ఇదే విషయాన్ని ధృవీకరిస్తున్నది. ఇది మన పార్శీల మతగ్రంథం కూడా. విశేషమేమంటే సంస్కృతంలోని 'స' అనే అక్షరాన్ని ప్రాచీన ఇరానీయులు 'హ' గా పలికేవారు. దానిలో ఏమున్నదంటే "ఆర్యులు తూర్పువైపున అనేక ప్రాంతాలకు వలస వెళ్ళారు." అని ఉంది. ఆ గ్రంథం 16 ప్రాంతాలను పేర్కొన్నది. వాటిలో చివరి ప్రాంతంగా "హప్తహిందూ" ను చెప్పింది. "హప్తహిందూ" అంటే ఏమిటో ఎవరైనా చెప్పగలరా? జహంగీర్ నువ్వు చెప్పు" అన్నారు మాస్టారు.

"హప్తహిందూ" అంటే 'సప్తసింధూ' అని అర్ధం మాస్టారు!" అన్నాడు జహంగీర్.

"అవును. సింధూనది, దాని ఉపనదుల ప్రాంతాన్ని సప్తసింధూ ప్రాంతమని పిలుస్తారు. ఆర్యులు పశ్చిమాసియా నుండి తూర్పుగా బయలుదేరి ఆఖరు మజిలీగా సప్తసింధు ను చేసుకున్నారని ఈ గ్రంధం స్పష్టంగా పేర్కొంటోంది. కాబట్టి ఈ గ్రంధాలన్నీ ఆర్యులు భారతదేశానికి పడమర వైపునుండి బయలుదేరి సింధూ ప్రాంతం వరకు, అక్కడి నుండి తూర్పుగా విదేహ అంటే నేటి నేపాల్ వరకూ ప్రాంతాలను ఆక్రమించి పాలించారని అర్ధమవుతోంది.

మరో ముఖ్య విషయం. భారతమాత ముద్దుబిడ్డలైన బాలగంగాధర తిలక్, స్వామీ వివేకానంద కూడ ఆర్యులు విదేశీయులేనన్నారు. ఆర్యులు ఉత్తర ధృవ ప్రాంతం నుండి వచ్చారని వివరిస్తూ తిలక్ ఒక గ్రంధమే రాశారు. వివేకానంద అయితే ఆర్యులేకాదు, ఆర్యకవులు సృష్టించిన పౌరాణిక పాత్రలను గూర్చికూడా, స్పష్టంగా తన అభిప్రాయాన్ని ఇలా వెల్లడించారు. "ప్రత్యేక జన్మలెత్తిన వారిగా పురాణాల్లో చెప్పిన వ్యక్తులు కూడ బయటదేశాల నుండి వచ్చి హిందువులై పోయారని అనుకొంటున్నాను". ఈ విషయం "వివేకానంద మహోపన్యాసాల, రచనల సమాహారం", మూడవ సంపుటంలోని 383వ పేజిలో ఉంది. పవన్! ఇన్ని స్పష్టమైన రుజువులున్నాయి కాబట్టి ఇప్పుడు ఆర్యులు విదేశీయులేనని అంగీకరిస్తావా?" అడిగాడు మాస్టారు.

"అంగీకరిస్తాను మాస్టారు ! మీరు చాల వివరంగా చెప్పారు" అన్నాడు పవన్.

"మంచిది వచ్చే క్లాసులో క్రీ.పూ. 1750 నుండి క్రీ.పూ. 600 వరకూ మనదేశ పరిస్థితిని గూర్చి వివరిస్తాను" అని ముగించారు మాస్టారు.



# 7వ భాగం. వేదకాలము

"పిల్లలూ! క్రీ.పూ. 1750 నుండి క్రీ.పూ. 600 వరకు ఉన్న కాలాన్ని భారతదేశ చరిత్రలో 'వేదకాలము' అని పిలుస్తారు". అంటూ చరిత్ర పాఠాన్ని మొదలుపెట్టారు విశ్వం మాస్టారు. "ఎందుకంటే ఆకాలంలోనే వేదాలు, వేదాలకు అంగాలుగా చెప్పబడే బ్రాహ్మణాలు చెప్పబడ్డాయి. వీటిలో వేదాలను యీనాటికీ గురువు నుండి శిష్యునికి వాక్కు రూపంలో నేర్పడమే జరుగుతున్నది. వేద సాహిత్యంలో 4 వేదాలు క్రీ.పూ. 1750 నుండి క్రీ.పూ. 800 లోపల కూర్చబడ్డాయి. బ్రాహ్మణాలు, ఉపషనిత్తులు క్రీ.పూ. 800, క్రీ.పూ. 600 మధ్య కూర్చబడ్డాయి. అన్నారు.

"వేద సాహిత్యం క్రీ.పూ. 1750, క్రీ.పూ. 600 మధ్య కూర్చబడ్డదని చెప్పేటందుకు రుజువులేమయినా ఉన్నాయా మాస్టారూ?" అడిగాడు అభినంద్.

"ఉన్నాయి అభినంద్ ! భాషాశాస్త్రం, పురావస్తు శాస్త్రం దీనికి సంబంధించిన ఆధారాలు అందిస్తున్నాయి. ఉదాహరణకు ఋగ్వేదం క్రీ.పూ. 1750, క్రీ.పూ. 1100 మధ్య కూర్చబడినదని భాషా శాస్త్రం తెలియజేస్తున్నది. ఈ విషయాన్ని పురావస్తు శాస్త్రం కూడ నిరూపిస్తున్నది. ఎలాగంటే ఋగ్వేదంలో ఇనుము వినియోగానికి సంబంధించిన ప్రస్తావన ఏదీలేదు. ఈ ఖనిజం వినియోగానికి సంబంధించి ఉత్తర భారతదేశంలో క్రీ.పూ. 1000 తర్వాతనే విస్తృతంగా ఉపయోగంలో ఉన్నట్లు రుజువులున్నాయి. అందువల్ల ఋగ్వేదం ఆ కాలానికి ముందుదని రుజువవుతోంది. ఇలా వేద సాహిత్యానికి సంబంధించిన కాలాన్ని గురించి అనేక రుజువులున్నాయి" అన్నారు మాస్టారు.

"వేదకాలపు ప్రజలు భారతదేశమంతటా నివశించారా మాస్టారూ?" అడిగాడు తేజ.

"లేదు తేజా! వారు సింధూ నదీతీరప్రాంతాల నుండి క్రమంగా ఆగ్నేయంగానూ, తూర్పు వైపుకూ విస్తరించారనే రుజువులే వేదసాహిత్యంలో దొరుకుతున్నాయి. ఉదాహరణకు ఋగ్వేదంలో సింధునది, సప్తసింధు ప్రాంతం ఆర్యుల నివాసప్రాంతంగా చెప్పబడింది. యమునా నది వారి నివాసప్రాంతానికి ఆగ్నేయ హద్దుగా చెప్పబడింది. కాని నాల్గవ వేదమైన అధర్వణవేదం, అలాగే బ్రాహ్మణాలు రచించబడే కాలం నాటికి ఆర్యులు మరింత ఆగ్నేయ దిశగా తరలివచ్చినట్లు రుజువవుతోంది. ఈకాలం నాటికి గంగ, యమునల మధ్యప్రాంతం పవిత్రమైన భూమిలోని మధ్యభాగంగా శతపధబ్రాహ్మణం పేర్కొంటోంది. కోసల, విదేహ వరకు ఆర్య తెగల పరిపాలన సాగినట్లు ఆ గ్రంధాలు పేర్కొంటున్నాయి. ఈ కాలంలో, ఈ ప్రాంతాలకు తూర్పున ఉన్న అంగ (తూర్పు బీహార్), మగధ, పుండ్ర (ఉత్తర బెంగాల్) తెగల రాజ్యాలు వీరి ఆధీనంలో లేవు. అందుకే అధర్వణవేదంలో, జ్వరం తమను వదలి, అంగ, మగధ రాజ్యాలవైపు వెళ్ళమనికోరే మంత్రం కన్పిస్తుంది. పుండ్ర జనులు చండాలురు అని ఐతరేయబ్రాహ్మణం పేర్కొంటోంది. ఈ విషయాలన్నీ ఆర్యులు సప్తసింధు ప్రాంతం నుండి క్రమంగా ఆగ్నేయం వైపుకూ, తూర్పువైపు మగధ వరకూ విస్తరించారని రుజువుచేస్తున్నాయి." అని వివరించారు మాస్టారు.

"వేదకాలం నాటి సాంఘిక పరిస్థితులు వివరిస్తారా మాస్టారు!" అడిగింది సాయిప్రియ.

"చెబుతానమ్మా ! ఆర్యులు సప్తసింధు ప్రాంతానికి క్రీ.పూ. 1750 ప్రాంతంలో వచ్చారన్నాను గదా? వారు వచ్చేటప్పటికి సింధు ప్రాంతంలోనూ, ఇతర భారతదేశ ప్రాంతాలలోనూ ద్రవిడియన్ భాషా కుటుంబానికి చెందినవారు నివసించేవారు. ఇకముందు వీరిని ద్రావిడులు అని పిలుద్దాం. ఆర్యులు ప్రతి ప్రదేశంలోనూ ద్రావిడులతో సంఘర్షణ పడ్డారు. వారిని యుద్ధాలలో జయించారు. మొదటి దశలో ఓడిన ద్రావిడులను సమూలంగా నాశనంచేశారు.

వారి పశువులను, స్త్రీలను వశంచేసుకున్నారు. స్త్రీలను దాసీలుగా చేసుకున్నారు. ఆర్యుల ప్రధాన వృత్తి పశుపోషణ అన్నాను గదా? ఐతే వారు భారతదేశం వచ్చాక వారికి వ్యవసాయ వృత్తిలోని సౌకర్యం అర్థమయింది. ఏమిటా సౌకర్యం? సంవత్సరంలో మూడో, నాలుగో నెలలు పనిచేస్తే పంట చేతికివచ్చి, ఆ ధాన్యాన్ని సంవత్సరమంతా అనుభవించవచ్చు. అందువలన వారుకూడ వ్యవసాయ వృత్తిని మొదలుపెట్టారు. వ్యవసాయం చేయడానికి వారికి ఎక్కువమందు మనుష్యులు కావలసివచ్చారు. దానికోసం వాళ్ళు ఏమి చేశారో తెలుసా? యుద్ధాలలో ఓడిపోయిన ద్రావిడులను చంపివేయకుండా వారికొక షరతుపెట్టారు. అదేమిటంటే, యుద్ధంలో గెలిచిన ఆర్య తెగకు, ఓడిన ద్రావిడ తెగకు చెందిన వారిలో ఎక్కువమంది బానిసలుగా ఉండి, వారి ఇంటిపనులూ, వ్యవసాయపనులూ చేయాలని. చంపకుండా ఉంటేచాలని, ద్రావిడులు ఆ షరతుకు ఒప్పుకొని పనిచేయసాగారు" అని మాస్టారు ఇంకా ఏదో చెప్పబోయే లోపల రాజశేఖర్ లేచి "దీనికేమైనా రుజువులున్నాయా మాస్టారు?" అని అడిగాడు.

మాస్టారు చిరునవ్వుతో "ఉన్నాయి రాజశేఖర్! ఒక రుజువు చెప్తాను. బుద్ధుడు వేదకాలం తరువాత జన్మించినవాడు. ఆయన గత జన్మలలో జరిగాయని చెప్పబడే అనేక కథల్ని బౌద్ధులు బౌద్ధజాతక కథలు అనే పేరున ప్రచారంచేశారు. ఆ కథలు బుద్ధుని కాలంనాటి, అంతకుముందు కాలానికి సంబంధించిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల్ని వివరిస్తాయి. ఒక జాతక కథలో బ్రహ్మదత్తుడు అంటే బుద్ధుని పూర్వజన్మలోని వ్యక్తి ఒక శతృదేశం పైకి దండయాత్రచేసి వారిని జయించాడు. అప్పుడు ఆ రాజ్యంలోని వేలాదిమంది ప్రజల్ని చంపబోయాడు. వారంతా దీనంగా తమను చంపవద్దని కోరారు. బ్రహ్మదత్తుడు వారంతా తనకు జీవితమంతా బానిసలుగా పనిచేస్తానంటే వారిని చంపకుండా వదలివేస్తానన్నాడు. వారందరూ అందుకు అంగీకరించారు. ఈ కథ ద్వారా బుద్ధుని ముందు కాలంలో వేలాదిమందు బానిసలు ఎలా

తయారయ్యారో అర్థమవుతోంది” అన్నారు మాస్టారు.

“ఎక్కువ మంది బానిసలయ్యారని చెప్పారు. మరి మిగిలిన వారి సంగతేమిటి మాస్టారూ?” అడిగాడు జహంగీర్.

“పిల్లలూ! ఇక్కడ ఒక ముఖ్య విషయం మీకు చెప్పాలి. అప్పటికే ఆర్యులలోనూ, ద్రావిడులలోనూ ప్రజలు అనేక వృత్తులు చేస్తూఉన్నారు. కొందరు దేవతలను ప్రసన్నం చేసుకునేందుకు మంత్రాలు చదవడం, పూజలు చేయడం, కొందరు యుద్ధ వీరులుగా యుద్ధాలలో పాల్గొనడం, కొందరు పశుపోషణ, వ్యాపారం, వ్యవసాయం, ఇతర చేతివృత్తులు చేయడం ఇలా చేసేవారు. ఐతే ఎవరూ, ఏ వృత్తినీ తండ్రినుంచి కొడుకుకు నేర్పడం అనే వంశపారంపర్య హక్కుగా కల్గిఉండలేదు. కాకపోతే మంత్రాలు చదివేవాళ్ళకూ, యుద్ధవీరులకూ, వారి తెగల్లో ఎక్కువ గౌరవం ఉండేది. ఇప్పుడు ఆర్యులు ఒక తెలివిగల పనిచేశారు. ద్రావిడులలో మంత్రాలు చదివేవారిని, అదే వృత్తిని కొనసాగిస్తూ తమలో కలుపుకున్నారు. ద్రావిడుల అమ్మ దేవతలనూ, వారి లింగాకార దేవుణ్ణీ తమ దేవుళ్ళలో కలుపుకున్నారు. యుద్ధ వీరులనూ, వ్యాపారం చేసేవారినీ, వ్యవసాయం చేయించేవారినీ, అదే వృత్తిని కొనసాగించి తమలో కలుపుకున్నారు. వ్యవసాయం చేసే వారినీ, చేతివృత్తుల వారినీ తమ బానిసలుగా చేసుకొని అవే వృత్తులు కొనసాగించమన్నారు. ఈ ఏర్పాటు కారణంగా ద్రావిడ తెగలలోని తెలివిగలవారూ, సమర్థులూ ఆర్యులను వ్యతిరేకించి తిరుగుబాటు చేసే పరిస్థితి తప్పిపోయింది. క్రమంగా యీ వృత్తులను వంశపారంపర్య హక్కుగా చేసుకున్నారు. అలా నాలుగు ప్రధాన వృత్తుల వారూ నాలుగు వర్ణాలుగా వేదకాలంలో రూపొందడం జరిగింది” అని వివరించారు మాస్టారు.

“ద్రావిడ తెగలలోని తెలివిగల వారినీ, సమర్థులనూ ఆర్యులు తమలో కలుపుకున్నారు అనేందుకు రుజువులేమైనా ఉన్నాయా మాస్టారూ?” అడిగాడు సిద్దూ.

"ఉన్నాయి సిద్దూ. ఉదాహరణకు ఋగ్వేదం 8వ మండలం, 40వ సూక్తం, 7వ మంత్రంలో ఒక ఋషి "స్తుతిమంతులగు శతృవులను చేర్చుకుందుము" అని అంటాడు. ఈ ఋజువు చాలదా?" అన్నారు మాస్టారు. అంగీకార సూచకంగా తల ఊపాడు సిద్దూ.

"వర్ణము అంటే రంగు గదా? వేదకాలంలో వృత్తుల వారీగా జరిగిన విభజనకు చాతుర్వర్ణ వ్యవస్థ అని ఎందుకు పేరు వచ్చింది మాస్టారు!" అడిగాడు జహంగీర్.

"చాతుర్వర్ణ వ్యవస్థ అంటే నాలుగు వర్ణాల వ్యవస్థ అని పేరు. ఆ వ్యవస్థకు ఆపేరు రావడానికి ఒక కారణం ఉండి ఉంటుంది. అదేమంటే ఆర్యులు తెల్లటివారు, ద్రావిడులు నల్లటివారు..."అని ఇంకా చెప్పబోతుండగా, రాజశేఖర్ లేచి "దీనికేమైనా రుజువులున్నాయా మాస్టారూ?" అని అడిగాడు.

"ఉన్నాయి రాజశేఖర్ ! చాలా రుజువులున్నాయి. ప్రస్తుతం ఒక్క రుజువు మీకు వినిపిస్తాను. ఋగ్వేదం 1వ మండలం, 100వ సూక్తం, 18వ మంత్రంలో "ఇంద్రుడు, అతని శ్వేతవర్ణ మిత్రులతో కలిసి అంటే తెల్లని రంగుగల స్నేహితులతో కలిసి భూమిని జయించాడని చెప్పడం జరిగింది. అలాగే ఋగ్వేదం, 6వ మండలం, 47వ సూక్తం, 21వ మంత్రంలో "ఇంద్రా! నల్లగా కనిపించే ఆ ప్రజలను ఒకచోటు నుంచి మరోచోటికి వెళ్ళగొట్టు" అని కోరడం జరిగింది. కాబట్టి ఉన్నతమైన వృత్తులను చేపట్టిన తమను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలవారు అనీ, తామే నీచవృత్తులు అంటగట్టిన వారిని శూద్రవర్ణంవారు అనీ పేర్లుపెట్టి ఉంటారు. ఆవిధంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణాలతో కూడిన సాంఘిక వ్యవస్థ వేదకాలంలో రూపొందింది" అని వివరించారు మాస్టారు.

"ఇంకా వేదకాలంనాటి విశేషాలు చెప్పండి మాస్టారూ!" అడిగాడు డేనియల్.

"మీకు ఆశ్చర్యాన్ని కలింగించే ఒక విశేషమేమంటే వేదాలు, బ్రాహ్మణులు మొత్తంలో ఒక్క నగరం లేక పట్టణం పేరుకూడ లేదు. పురావస్తు త్రవ్వకాలలో కూడ హరప్పా మొదలైన నగరాలు నాశనమైన తర్వాత క్రీ.పూ. 6వ శతాబ్దం వరకూ ఒక్క నగరమైనా ఉన్న ఆనవాళ్ళు కనిపించలేదు. అంటే వైదిక ఆర్యులు ఒక్క నగరాన్ని కూడ నిర్మించలేదని అర్ధమవుతోంది. వారు ప్రధానంగా గ్రామాలలోనే నివశించారు. అలాగే మరో విచిత్రమైన విషయం ఏమిటంటే వైదిక ఆర్యులు ఋగ్వేదకాలంలో వ్యవసాయాన్ని ఒక గౌరవనీయమైన, పవిత్రమైన వృత్తిగా చెప్పినప్పటికీ, వేదకాలం చివరికి వచ్చేసరికి వ్యవసాయాన్ని ఒక నిందించదగిన వృత్తిగా స్మృతులు పేర్కొన్నాయి. ఉదాహరణకు ఋగ్వేదం 1వ మండలం, 112వ సూక్తం, 18వ మంత్రంలో ఏముందో తెలుసా?" అశ్వినులారా! శౌర్యవంతుడయిన మనువుకు విత్తనములు అందించి వ్యవసాయము చేయించినారు" అనిఉంది. అంతేకాదు. ఋగ్వేదం 4వ మండలం, 57వ సూక్తం, 6వ మంత్రంలో సీతకు అంటే నాగటిచాలుకు ఎంతో పవిత్రతను ఆపాదించింది. ఆ మంత్రంలో ఏమున్నదంటే "సౌభాగ్యవతివగు సీతా! నీవు మాకు సుందర ధనమును, సుందర ఫలములను ప్రసాదింతువు. అందుకే నీకు మేము నమస్కరించుచున్నాము" అని ఉంది. కాని మనుస్మృతి ఏంచెబుతోందంటే "నాగలి నింద్యమైనది. కనుక పై వర్ణాలకు చెందినవారు దానిని తాకరాదు" అని, మనుస్మృతిలోని 10 అధ్యాయం 84వ శ్లోకం చెబుతోంది. ఇలా వ్యవసాయానికి వేదాలు ఇచ్చిన గౌరవాన్ని స్మృతికారులు తిరస్కరించారు". అన్నారు మాస్టారు.

"వేదకాలంలోని మతం, దేవుళ్ళను గూర్చి వివరించరా మాస్టారూ! అడిగాడు కిరణ్.

"వివరిస్తాను కిరణ్! వేదకాలంనాటి ప్రధాన దేవుడు ఇంద్రుడు. అగ్ని, సూర్యుడు, అశ్వనీదేవతలు, వరుణుడు ముఖ్య దేవతలు. వీరిని ప్రార్థించే శ్లోకాలే

ప్రధానంగా ఋగ్వేదం, యజుర్వేదం సామవేదాలలో ఉన్నాయి. అధర్వణవేదంలో రోగనివారణకు మంత్రాలు, స్త్రీ వశీకరణ మంత్రాలు, సకల భూత, గ్రహ చికిత్సా మంత్రాలు మొదలైనవి ఉన్నాయి. ముఖ్యమైన విషయం ఏమిటంటే వేదకాలంలో ఏ దేవతనూ విగ్రహ రూపంగా పూజించే పద్ధతి లేదు. యజ్ఞాలుచేసి, ఆ యజ్ఞాలలో తమ దేవుళ్ళను ప్రార్థించి, వారిని తృప్తిపరచడానికై మేకలు, గొర్రెలు, ఆవులు, ఎద్దులు, గుర్రాలు వంటి జంతువులను చంపి వాటి మాంసాన్ని యజ్ఞగుండం అంటే యజ్ఞంకోసం చేసిన అగ్నిగుండంలో కొంతవేసి, మిగిలిన దానిని ప్రసాదంగా తీసుకొనేవారు. ఇక అరణ్యకాలు, ఉపషనిత్తులలో దేవుళ్ళ పూజల ప్రస్తావన లేదు. వాటిలో ఆత్మ అనేది జీవులలో ఉంటుందని పేర్కొని, దాని స్వభావాన్ని గూర్చి వివరణలవంటి మార్మిక విషయాలను గూర్చి చర్చించాయి. ఉదాహరణకు కఠోపనిషత్తు, రెండవ అధ్యాయంలోని 20వ శ్లోకం ఏం చెబుతోందంటే

శ్లో॥ ఆణోరణీయాన్,మహతో మహీయాన్
ఆత్మాశ్యజంతో ర్నిహితం గుహాయాం॥

అని చెబుతోంది. అంటే 'సూక్ష్మాతి సూక్ష్మమైన అణువుకంటే చిన్నదీ, బ్రహ్మాండానికంటే పెద్దదీ అయిన ఆత్మ ప్రాణుల హృదయాలలోనే ఉన్నది" అని అర్థం. ఇదీ వేదకాలం నాటి మతంయొక్క పరిస్థితి". అని వివరించారు మాస్టారు.

"వేదకాలంలో రాజ్యపరిపాలనావ్యవస్థ ఎలా ఉండేది మాస్టారూ?" అడిగాడు సుఖదేవ్.

"వేదకాలం మొదట్లో తెగలు, గణాల నాయకుల పరిపాలనా వ్యవస్థ ఉండేది సుఖదేవ్. ఈ నాయకులను ప్రజలే ఎన్నుకొనేవారు. ఈ పరిపాలకుల పాలన సక్రమంగా సాగటం కోసం ప్రజలు తామే ఇష్టపూర్వకంగా తమ ఆహార ధాన్యాలలో గానీ, పశువుల రూపంగా గాని కొంత భాగాన్ని ఇచ్చేవారు. ఈ

విషయాన్ని గౌతమబుద్ధుడు తన శిష్యుడు వాసెట్టహ కు సవివరంగా బోధించాడు. (దీఘనికాయ, మౌరిస్‌వాల్షే అనువాదం, పేజీలు 407–15). కాని వేదకాలం చివరినాటికి పరిపాలకులను ఎన్నుకోవడంపోయి, రాజులు పట్టాభిషేకం చేసుకోవడం, వారి సంతానం వారి తర్వాత రాజులు కావడం జరిగింది. ఈ రాజులు పన్నుల ద్వారా ఆదాయాన్ని ప్రజల నుండి గుంజటం మొదలుపెట్టారు. ఐతే ఈ పీడించిన సొమ్ములో కొంత భాగాన్ని యజ్ఞయాగాదులు చేయించే బ్రాహ్మణులకు అందించేవారు. అందుకే వేదాలలో నాల్గవదీ, చివరిదీ అయిన “అథర్వణ వేదం” లో రాజు బ్రాహ్మణ రక్షకుడు గానూ, ప్రజా భక్షకుడుగానూ వర్ణించబడ్డాడు” అని ప్రముఖ చరిత్రకారుడు డి.ఎన్.ఝూ తాను వ్రాసిన “ప్రాచీన భారతదేశం” అనే గ్రంథంలో 38వ పేజీలో పేర్కొన్నాడు. ఇదీ ఆకాలంనాటి రాజ్య పరిపాలనా పరిస్థితి. పిల్లలూ! మీకు వేదకాలం నాటి సాంఘిక, రాజకీయ, మత పరిస్థితులన్నీ వివరించాను. వచ్చే క్లాసులో, క్రీ.పూ. 600 తర్వాత జరిగిన పరిణామాలు, మత విప్లవాలు మొదలైనవన్నీ వివరిస్తాను”. అని క్లాసు ముగించారు మాస్టారు.



# 8వ భాగం. మతవిప్లవాల కాలం

"పిల్లలూ! క్రీ.పూ. 600 నుండి క్రీ.పూ. 327 వరకూ ఉన్న కాలాన్ని మత విప్లవాల కాలం అని పిలుస్తారు. ఆ కాలంనాటి విశేషాలు వివరిస్తాను" అంటూ భారతదేశ చరిత్రను వివరించడం మొదలుపెట్టారు మాస్టారు.

"క్రీ.పూ. 327 వరకూ మీరు వివరిస్తానన్నారు. ఆ సంవత్సరం యొక్క ప్రత్యేకత ఏమిటి మాస్టారూ?" అడిగాడు శరత్ చంద్ర.

"ఆ సంవత్సరంలో అలెగ్జాండర్ అనే మాసిడోనియా పాలకుడు భారతదేశం పైకి దండెత్తి వచ్చాడు. అప్పటినుండి భారతదేశ చరిత్ర అనేక మలుపులు తిరిగింది. అందువలన భారతదేశ చరిత్రను ఆ సంవత్సరం వరకు ముందుగా చెప్పుకుందాం" అన్నాడు మాస్టారు.

"ఆకాలంలో రాజకీయ రంగంలో జరిగిన ప్రధానమైన సంఘటనలేమిటి మాస్టారూ?" అడిగింది అమంద.

"పిల్లలూ! మీకు క్రిందటి క్లాసులోనే సింధు నగరాల పతనం తర్వాత క్రీ.పూ. 6వ శతాబ్దం వరకూ ఒక్క నగర నిర్మాణమైనా జరిగినట్లు పురావస్తు ఆధారాలు ఏమీ లేవని చెప్పాను గదా! ఆ కాలమంతా ఆర్యుల తెగల పరిపాలన సాగింది. వాటినే గణ రాజ్యాలు అని చరిత్రకారులు పిలిచారు. ఈ గణ రాజ్యాలను, తెగలు, గణాల నాయకులు పరిపాలించేవారని కూడా చెప్పాను. వేదకాలం చివరినాటికి పరిపాలకులను ఎన్నుకోవడం పోయి కొన్నిచోట్ల రాజులు పట్టాభిషేకం చేసుకోవడం, వారి సంతానం వారి తర్వాత రాజులు కావడం మొదలయింది. అలా ఏర్పడిన రాచరిక రాజ్యాలలో ముఖ్యమైనవి మగధ, కోసల రాజ్యాలు. వారిలో మగధరాజు బింబిసారుడు తన రాజ్యానికి తూర్పున ఉన్న అంగరాజ్యాన్ని అంటే తూర్పు బీహార్ ప్రాంతాన్ని, ఉత్తరాన నేపాల్

సరిహద్దుల వరకూ ఉన్న రాజ్యాలనూ జయించి భారతదేశంలో మొట్టమొదటి చక్రవర్తి అయినాడు. ఈయన క్రీ.పూ. 545లో, తన తండ్రిచే, మగధరాజుగా అభిషిక్తుడు అయ్యాడు. ఈయన కోసల, వైశాలీ రాజ్యాల పాలకులతో వివాహసంబంధాలు ఏర్పరచుకున్నాడు. కోసలరాజు ప్రసేనజిత్తు చెల్లెలును బింబిసారుడు వివాహం చేసుకున్న కారణంగా కట్నంగా ప్రసేనజిత్తు బింబిసారునునికి కాశీ రాజ్యాన్ని ఇచ్చాడు. వైశాలి గణ నాయకునితో వివాహసంబంధం కారణంగా బింబిసారుడు ఎటువంటి ఆటంకం లేకుండా నేపాల్ సరిహద్దుల వరకూ తన రాజ్యాన్ని విస్తరించగలిగాడు. బాధాకరమైన విషయమేమంటే, బింబిసారుని కుమారుడు అజాతశత్రు, తండ్రిని చంపి క్రీ.పూ. 493లో మగధ సామ్రాజ్య చక్రవర్తి అయ్యాడు. బింబిసారుని మరణాన్ని భరించలేక, ప్రసేనజిత్తు చెల్లెలు కూడా మరణించింది. తన సోదరి మరణానికి ప్రతీకారంగా, ప్రసేనజిత్తు తాను కట్నంగా ఇచ్చిన కాశీ గ్రామాన్ని తిరిగి వశంచేసుకున్నాడు. ఆ గ్రామాన్ని తిరిగి స్వాధీనం చేసుకోవడానికి అజాతశత్రు కోసలపై యుద్ధం ప్రకటించాడు. వీరిద్దరిమధ్యా అనేకసార్లు యుద్ధాలు జరిగాయి. మరో ముఖ్య విషయం ఏమిటంటే, ప్రసేనజిత్తు కొడుకు విబుదాభుడు కూడా అజాతశత్రు వంటివాడే. అతడు కూడా తండ్రిని చంపడానికి అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు. ఒకసారి యుద్ధ విరామ సమయంలో ప్రసేనజిత్తు బుద్ధుని దర్శనానికి వెళ్ళిన సమయంలో, ప్రసేనజిత్తు యొక్క మంత్రి దీర్ఘచరాయణుడూ, విబుదాభుడూ కలిసి కుట్ర చేశారు. ప్రసేనజిత్తు యొక్క రాజముద్రికనూ, సైన్యాధికారాన్నీ దీర్ఘచరాయణుడు విబుదాభునికి అందించాడు. విబుదాభుడు కోట తలుపులు మూసివేయమని ఆజ్ఞ జారీచేశాడు. ప్రసేనజిత్తు కోట దగ్గరకు చేరుకొనేటప్పటికి కోట తలుపులు మూసివేయబడి ఉండటంతో, అలసల వల్ల కోట బయటే మరణించాడు. అతనికి అజాతశత్రు రాజోచితంగా దహన సంస్కారాలు చేసి, తాను మేనల్లుడనైనందున కోసల రాజ్యంపై తనకు హక్కు ఉందనీ, దానిని తనకు ఇమ్మనీ విబుదాభుని అడిగాడు. విబుదాభుడు దానికి

తిరస్కరించడంతో యుద్ధం అనివార్యమయింది. ఇద్దరి సైన్యాలు యుద్ధానికి సిద్ధమయ్యాయి. కోసల సైన్యం రాప్తి నదిలోని ఇసుక తిన్నెలపై మోహరించింది. సైనికులందరూ రాత్రిపూట నిద్రిస్తుండగా, రాప్తినదికి అకస్మాత్తుగా వరదలు వచ్చి, విబుదాభుని సైన్యం కొట్టుకుపోయింది. దానితో యుద్ధం చేయకుండానే, కోసల రాజ్యం అజాతశత్రు వశమయింది.

ఆ తర్వాత అజాతశత్రు కన్ను లిచ్ఛవీల నాయకత్వంలో ఉన్న వజ్జి గణరాజ్యంపై పడింది. వారిపై దాడిచేయబోయే ముందు అజాతశత్రు బుద్ధుని అభిప్రాయాన్ని తెలుసుకొనే ఉద్ధేశ్యంతో ఒక బ్రాహ్మణ మంత్రిని ఆయన వద్దకు పంపాడు. ఆ మంత్రి అజాతశత్రు అభిప్రాయాన్ని చెప్పగానే, బుద్ధుడు “వజ్జీయులు ఎంతకాలమైతే సమైక్యంగా తమ తెగ సమావేశాలు జరుపుతూ ఉంటారో, ఎంతకాలమైతే తమ పెద్దలను గౌరవిస్తూ వారి మద్దతు పొందుతూ, వారి మాటలు శ్రద్ధగా ఆలకిస్తూ ఉంటారో అంతకాలం వారు పతనం కాకుండా అభివృద్ధి చెందుతారు” అన్నాడు. అందువలన లిచ్ఛవీలలో ఐక్యతను దెబ్బతీయడానికి అజాతశత్రు వారి లోనికి వస్యకారుడనే మంత్రిని పంపాడు. అతడు లిచ్ఛవీల ఐక్యతను దెబ్బతీయడానికి అనేక కుట్రలుచేశాడు. ఉదాహరణకు తన గూఢచారులను బ్రాహ్మణులుగానూ, జ్యోతిష్యులుగాను లిచ్ఛవీ గణాలలో చెలామణీ అయ్యేట్టుగా చేశాడు. వారు గణ పెద్దలతో, గణంలోని తక్కువవారితో వివాహసంబంధాలు కానీ, సహపంక్తి భోజనాలు కానీ పెట్టుకోకూడదని చెప్పసాగారు. మరోప్రక్క గణాలలోని తక్కువ హోదావారితో, అలాంటి సంబంధాలు, పంక్తి భోజనాల విషయంలో గణ పెద్దలపై ఒత్తిడి చేయాలని చెప్పసాగారు. అలా గణ పెద్దలకూ, గణంలోని తక్కువ హోదా వారికీ మధ్య విభేదాలు సృష్టించి, వారిని బలహీనం చేశారు. అప్పుడు అజాతశత్రు ఆ గణ రాజ్యంపై దాడిచేసి, వారిని జయించి, ఆ రాజ్యాన్ని తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. అదే విధానాన్ని ఉపయోగించి మల్లు తెగ యొక్క గణ రాజ్యాన్ని కూడా అజాతశత్రు జయించాడు. అలా భారతదేశపు

మొదటి సామ్రాజ్యాన్ని అజాతశత్రు మరింత విస్తరించాడు.

అజాతశత్రు క్రీ.పూ. 461లో మరణించాడు. సిలోన్‌లోని బౌద్ధరచనయైన 'మహావంశము' ప్రకారం అతని తరువాత సింహాసనాన్ని అధిష్ఠించిన అయిదుగురు రాజులూ అజాతశత్రు లాగే తమ తండ్రులను చంపి గద్దెనెక్కారు. ఈవిధంగా తండ్రులను చంపిన వారు వరుసగా తమకు రాజులు కావడంతో, ప్రజలు తీవ్రంగా కోపగించుకొని క్రీ.పూ. 413లో వీరిలో ఆఖరివానిని గద్దెదించి, బెనారస్ రాజ్య ప్రతినిధిగా ఉన్న శిశునాగుని మగధ చక్రవర్తిగా చేశారు. ఈ శిశునాగ వంశం మగధను దాదాపు అర్ధశతాబ్దం పైగా పాలించింది. తర్వాత క్రీ.పూ. 344లో మహాపద్మనందుడు ఈ వంశాన్ని గద్దెదించి, మగధకు చక్రవర్తి ఐనాడు. 20 సంవత్సరాలకు పైగా నందవంశం మగధను పరిపాలించింది. ఇదీ క్రీ.పూ. 600-327ల మధ్య ఉన్న రాజకీయ పరిస్థితి" అని ముగించాడు మాస్టారు.

"ఆకాలం నాటి సామాజిక, ఆర్థిక పరిస్థితులు వివరిస్తారా మాస్టారూ!" అడిగాడు ప్రవీణ్.

"భారతదేశ చరిత్రలో క్రీ.పూ. 16వ శతాబ్దం తరువాత వెయ్యేళ్ళకు, అంటే క్రీ.పూ. 6వ శతాబ్దంలో మరల నగర నిర్మాణం ప్రారంభమయ్యింది. నగరాలలో వీధుల కిరువైపులా దుకాణాలు ఉండేవి. దుకాణాల వెనుక గృహాలు ఒక వరుస క్రమంలోఉన్నాయి. గృహాలలో బావులు, మురుగుపోయే వసతులు, రాతి బాటలు అమర్చిన పెరళ్ళతో ఉన్నాయి. అయితే, యీ గృహాలకు విరుద్ధంగా వాటి మధ్యలో పేదలు నివసించే ప్రాంతం ఉంది. ఇక్కడి ఇళ్ళకు ఒక ప్రణాళికగానీ, విశాలమైన వీధులుకానీ, బావులు, మురికినీటి వసతులుగానీ లేవు. ఇళ్ళకు సంబంధించిన యీ తేడాలు ఆ సమాజంలో ఉన్న ధనిక, బీదల మధ్య ఉన్న వ్యత్యాసాలను తెలియజేస్తున్నాయి. మరో ముఖ్యమైన విశేషం ఏమిటంటే యీ నగరాల రక్షణకోసం పెద్ద పెద్ద ప్రాకారాలు నిర్మించబడ్డాయి.

ఉదాహరణకు రాజ్‌గిరి నగరం చుట్టూతా ఉన్న గోడ పునాది వెడల్పు 40 మీటర్లు, పొడవు 6 కిలోమీటర్లుగా ఉన్నది.

ఆహారం విషయానికి వస్తే వారి ప్రధానమైన ఆహారం మాంసమే. వరి, బార్లీ, గోధుమ, మినుములు, పెసలు, జొన్నలు కూడ వారి ఆహారంగా ఉండేవి. చెఱుకు, ఆవాలు కూడ పండించేవారు.

పురావస్తు తవ్వకాలలో ఆకుపచ్చ, నీలంరంగు గాజులు పెద్దసంఖ్యలో లభించడాన్నిబట్టి వారు గాజులను ముంజేతి కంకణాలుగా వాడేవారని అర్థమవుతోంది. అమ్మతల్లి బొమ్మలు విస్తారంగా దొరికాయి. కాబట్టి అమ్మతల్లి పూజలు బాగా జరిగేవని తెలుస్తోంది.

పిల్లలూ ! ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే, మన పూర్వీకులు ఆనాటికే ధాన్యాన్ని ఏడేళ్ళపాటు నిల్వ ఉంచే పద్ధతిని కనిపెట్టారు. ఎత్తయిన దిమ్మలపైనగానీ, లేదా ఇంటి పై భాగానగానీ గడ్డి, వెదురుబద్దలు తదితరాలతో ధాన్యపు గిడ్డంగులు తయారుచేసేవారు. వాటిని పేడతో అలికేవారు. లోపల ధాన్యాన్ని నింపి పైభాగాన్ని బురదమట్టితో పూర్తిగా మూసివేసేవారు. ఇలా చేయడం వలన తృణధాన్యాల విత్తనాలను మూడేళ్ళు, కాయధాన్యాల విత్తనాలను ఐదేళ్ళు, గోగు, ఆవాల విత్తనాలను ఏడేళ్ళు నిల్వ ఉంచేవారని ఆకాలంనాటి గ్రంథం 'భగవతి' తెలియజేస్తోంది.

వ్యాపార విషయానికి వస్తే, ఇనుపపారలు, కొడవళ్ళు, కత్తులు, మేకులు, బాణపు మొనలు వంటి ఇనుప వస్తువులు ఆనాటి వ్యాపార వస్తువులు. వాయువ్య దిక్కునగల పోట్వార్ మైదాన ప్రాంతాల్లో ఉప్పును గనుల నుండి త్రవ్వితీసి, అక్కడినుండి దూరంగా ఉన్న గంగామైదానానికి రవాణాచేసి అమ్మేవారు. చేతివృత్తిదారులు బట్టలు, పూసలు, మట్టిపాత్రలు, దంతపు వస్తువులు, పింగాణి, గాజు సామాన్లు తయారుచేసి అమ్మేవారు. ఈ వస్తువులను వాయువ్య ప్రాంతానికి తీసుకవెళ్ళి, మారకవ్యాపారం ద్వారా వీటి ఖరీదుకు గుర్రాలను కొనేవారు.

కాల్చిన బంకమన్నుతో చేసిన మానవుల, జంతువుల బొమ్మలకు ఆకాలంలో ఎంతో గిరాకీ ఉండేదని, ఆ ప్రాంతాల్లో విస్తారంగా దొరికిన ఆ బొమ్మల మూసలు రుజువు చేస్తున్నాయి. బావులకు వరలు, పెద్ద పెద్ద కుండల మూతల వ్యాపారం కూడా బాగా జరిగేదని పురావస్తు శిధిలాలు తెలియజేస్తున్నాయి.

ఇక ఆకాలంనాటి సాంకేతిక నిపుణతను పరిశీలిద్దాం. క్రీ.పూ. 600కు ముందే ఇనుప ఆయుధాల, పనిముట్ల తయారీ మనవారికి తెలుసు. కాకపోతే ఆ వస్తువులు తక్కువ శ్రేణి ఇనుముతో తయారయ్యాయి. క్రీ.పూ. 600 తర్వాత తయారైన ఇనుప వస్తువులు గుణాత్మకంగానూ, పరిమాణాత్మకంగానూ మరింత మెరుగైనవిగా పురావస్తు శాస్త్రజ్ఞులు గుర్తించారు. అలాగే మధ్యగంగా మైదానంలోని బురదభూముల్ని ఒండ్రుమట్టి భూములుగా మార్చడానికి వారు నీటిపారుదల కాలువలు త్రవ్వారని ఆకాలంనాటి వైదిక సాహిత్యం తెలియజేస్తోంది.

సముద్ర ప్రయాణమూ, సముద్రాల ఆవతలి వారితో వ్యాపారం ఆకాలంలో జరుగుతుండేది. అయితే ఈ విషయాన్ని వైదిక వాఙ్మయం, బౌద్ధ సాహిత్యం వేరు వేరు విధాలుగా పరిగణించాయి. వైదిక వాఙ్మయం, సముద్ర ప్రయాణాన్ని పాపంగా పరిగణించగా, బౌద్ధ వాఙ్మయం సముద్ర ప్రయాణాన్ని అంగీకరించింది. వ్యాపారానికి సంబంధించిన ముఖ్య విషయం ఏమిటంటే, వర్తకం ప్రధానంగా విలాస వస్తువులకే పరిమితమైంది. అంటే వర్తకులు ధనికుల అవసరాలు తీర్చే వస్తువులతో వ్యాపారానికే ప్రాధాన్యమిచ్చారు.

పిల్లలూ! ఆకాలంనాటి సామాజిక పరిస్థితులను గూర్చిన విశేషాలను ముగించబోయేముందు, ఒక ముఖ్య విషయాన్ని వివరిస్తాను. అదేమిటంటే అది ధనికులు, పేదల మధ్య ఉన్న అంతరాలు. నివాస గృహాలు, వీధులు ధనికులు, పేదల మధ్య ఉన్న తీవ్రమైన తేడాల్ని చూపిస్తున్నాయని ఇంతకుముందే చెప్పాను. ఈ అంతరాలకు బుద్ధుడు చాలా బాధపడ్డాడు. పేదల పరిస్థితి ఎంత

బాధాకరంగా ఉందో, ఆయన ఒక ఉదాహరణ ద్వారా చెప్తాడు. ఈయన ఇలా అంటాడు. "ఒకానొక మనిషి అర్ధ కహాపణ, ఒక కహాపణ లేక వంద కహాపణాలు దొంగిలించినందుకు గాను చెరసాల పాలయ్యాడు. అంతే మొత్తాన్ని దొంగిలించిన మరో మనిషి చెరసాలకు వెళ్ళలేదు. ఇందుకు కారణం మొదటివాడు చింకిపాతల నిరుపేదకాగా, చెరసాలకు వెళ్ళనివాడు సాధన సంపత్తి పుష్కలంగా ఉన్న శ్రీమంతుడు."

పిల్లలూ! ఆకాలంనాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులు మీకు వివరించాను. ఆ కాలాన్ని చరిత్రకారులు 'మతవిప్లవాలకాలం' అని ఎందుకన్నారో, ఆ వివరాల్ని వచ్చే క్లాసులో వివరిస్తాను" అంటూ లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 9వ భాగం, మత విప్లవాలకాలం (కొనసాగింపు)

"పిల్లలూ! క్రీ.పూ. 600 వరకూ వైదికమతం యొక్క ప్రభావమే సమాజంపై, ప్రజలపై తీవ్రంగా ఉండేది. వైదిక మత నాయకులు అంటే పురోహిత వర్గంవారు పరలోక సుఖంకోసం యజ్ఞాలు, యాగాలూ రాజులచేతా, ధనికులచేతా చేయించేవారు. ఈ యాగాలలో వేలాది పశువులను బలిఇచ్చి, వాటి మాంసంలో కొంత భాగాన్ని అగ్నికి అర్పించి, అంటే అగ్నిలోవేసి మిగిలిన దానిని యజ్ఞం చేయించిన యజమానీ, పురోహితులూ ఆరగించేవారు. దీనితో అప్పుడే వృద్ధిచెందుతున్న వ్యవసాయానికి పశువుల కొరత ఏర్పడే ప్రమాదం వచ్చింది. అంతేకాదు. వైదిక మతనాయకులు చెప్పే విషయాలు తార్కికమైన ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేకపోయేవి. ఉదాహరణకు ఈలోకంలో ఒక బ్రాహ్మణుడికి భోజనం పెడితే, పరలోకంలోని తండ్రి ఆత్మకు ఆ భోజనం అందుతుందని వైదిక మతనాయకులు చెప్పేవారు. కాని ఒక భవనం క్రింది అంతస్థులో, ఒక వ్యక్తికి మంత్రాలతో భోజనం పెడితే పై అంతస్థులోని వ్యక్తికే కడుపునిండదు కదా? మరి పరలోకంలోని ఆత్మకు చేరుతుందని రుజువేమిటి? అన్ని తార్కికుల ప్రశ్నకు ఆ నాయకులు సమాధానం చెప్పలేకపోయేవారు. ఇలాంటి కారణాల వలన ప్రజలకు వైదికమతంపై నమ్మకం సడలిపోసాగింది. వారిలో అసంతృప్తి పెరిగింది. ఈ అసంతృప్తి ఆకాలంలో అనేక నూతన మతశాఖలు పుట్టడానికి కారణమైంది. ఎన్ని మత శాఖలు పుట్టాయో తెలుసా? ఆనాటి జైనమత సాహితీ గ్రంథాల ప్రకారం ఆకాలంలో 363 మతశాఖలు పుట్టాయి. ఈ మతాలన్నీ వైదికమతానికి వ్యతిరేకమైనవే. ఆ మతంపై విప్లవాన్ని ప్రకటించేవే. అందుకే ఆకాలాన్ని 'మత విప్లవాల కాలం' అని చరిత్రకారులు పేర్కొంటున్నారు అని వివరించారు. విశ్వం మాస్టారు.

"ఆ మతాలలోని కొన్ని ముఖ్యమైన మతాల పేర్లు చెబుతారా మాస్టారూ!" అడిగాడు చందూ.

"అవి ఏకత్వవాదమతం, అనేకవాదమతం, విశ్వపరిణామవాద మతం, ఇంద్రియవాదమతం, భౌతికవాదమతం, అజ్ఞేయతావాద మతం, ఉనికివాద మతం, విధ్వంసవాదమతం, శాశ్వతవాద మతం, ఉచ్ఛేదవాదమతం, చార్వాక మతం, అజీవక మతం అనేవి. ఇవిగాక మరో రెండు మతాలు, ఆకాలంలో ఆర్భవించి, ఈనాటికీ భారతదేశంలో లక్షలాది మంది అనుచరులను కలిగిఉన్నాయి. అవి ఏవో చెప్పండి. సిద్దూ! నీవు చెప్పు" అడిగాడు మాస్టారు.

"అవి బౌద్ధమతం, జైనమతం మాస్టారూ!" అన్నాడు సిద్దూ.

"అవును. ఆ మతాలు రెండూ ఆకాలంలో పుట్టినవే. విశేషం ఏమిటంటే, వాటిలో బౌద్ధమతం సామాన్య ప్రజానీకంలో ఆమోదం పొంది, దాదాపు వేయి సంవత్సరాల పాటు భారతదేశంలో ప్రధానమతంగా విలసిల్లింది". అన్నారు మాస్టారు.

"పైన చెప్పిన ఏకత్వవాదమతం మొదలైన మతాలను గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగింది అమంద.

"అవన్నీ వైదికమతానికి వ్యతిరేకంగా పుట్టిన మతాలు అని చెప్పాను గదమ్మా. అందువలన ఆ మతాలను వైదికమతనాయకులు తీవ్రంగా అణచివేశారు. వారి సాహిత్యాన్ని కాల్చివేశారు. వారిని గూర్చిన వివరాలు, వారిని తీవ్రంగా విమర్శించేవారి గ్రంథాల నుండే లభిస్తున్నాయి. శృంగేరిలోని శంకరాచార్య మఠం ప్రధానాచార్యుడూ, పద్నాలుగవ శతాబ్దానికి చెందినవాడూ అయిన మాధవాచార్య రచించిన 'సర్వదర్శన సంగ్రహం' అలాంటి గ్రంథాలలో ఒకటి. బౌద్ధ గ్రంథాలైన 'దీఘనికాయ' వంటి గ్రంథాలలో కూడ వారి సింద్ధాంతాలకు సంబంధించిన వివరాలు లభిస్తున్నాయి. ఈ మతాల వారందరనీ లోకాయతులు లేక చార్వాకులు అని చరిత్రకారులు పేర్కొంటున్నారు. వీరందరూ సన్యాస జీవితాన్నే గడిపారు. వీరి ఆత్మగౌరవం, ఇంద్రియ నిగ్రహం, జంతువులపట్లా, సమస్త జీవుల పట్లా ఉన్న దయవంటి సద్గుణాలను గూర్చి 'దీఘనికాయ' పేర్కొన్నది. చార్వాకులు యజ్ఞయాగలలోని డొల్లతనాన్ని

ప్రయోగాత్మకంగా నిరూపించారు. వీరి ప్రయోగాలకు ఒక ఉదాహరణ చెబుతాను వినండి. వైదిక పురోహితులు యజ్ఞాలలో బలి యీయబడిన జంతువూ, యజ్ఞం చేసిన యజమానీ, స్వర్గానికి పోతారని చెప్పి యజ్ఞాలు చేయించేవారు. ఈ వాదనలోని డొల్లతనాన్ని సోదాహరణంగా నిరూపించాలని ఒక చార్వాకముని అనుకొన్నాడు. ఒక ధనికుడి వద్దకు వెళ్ళి తాను యజ్ఞం చేయిస్తానన్నాడు. యజమాని అంగీకరించాడు. యజ్ఞం జరుగుతోంది. చివరలో చార్వాకుడు తన శిష్యులతో 'యజ్ఞ పశువు' ను తెమ్మన్నాడు. శిష్యులు లోనికి వెళ్ళి యజ్ఞం చేసే యజమాని తండ్రిని బలవంతంగా లాక్కురాసాగారు. యజమానికి ఆశ్చర్యమూ, కోపమూ వచ్చాయి. తీవ్ర స్వరంతో 'నా తండ్రిని ఎందుకు తీసుకువస్తున్నారు?' అని అడిగాడు. చార్వాకముని శాంతంగా 'అయ్యా! బలియీయబడిన యజ్ఞ పశువు నేరుగా స్వర్గానికి పోతుందని శాస్త్రాలు చెబుతున్నాయి. మీతండ్రి గారిని బలిఇస్తే ఆయన నేరుగా స్వర్గానికి పోతాడుగదా? అందుకని ఆయనను తీసుకురమ్మన్నాను' అన్నాడు. యజమానికి, ఆ మాటలతో, యజ్ఞాలు, యజ్ఞ ఫలితాలకు సంబంధించిన డొల్లతనం అర్ధమయింది. యజ్ఞాన్ని నిలిపివేశాడు. ఇలాంటి ప్రయోగాత్మక ప్రచారాలతో ప్రజలను ఆకర్షించేవారు. అంతేకాక, వీరు ఒక శక్తివంతమైన భౌతికవాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఆ సిద్ధాంత వివరాలేమిటంటే "నాలుగు మూల భూతముల సమ్మేళనమే మానవుడు. మానవుడు మరణించగానే మట్టి మట్టిలోను, నీరు నీటిలోనూ, అగ్ని అగ్నితోనూ, వాయువు వాయువుతోనూ కలిసిపోయి, చైతన్యం అనంతంలో ఐక్యమౌతుంది. నలుగురు మనుష్యులు శవాన్ని స్మశానానికి మోసుకుపోతారు. అక్కడ అతని కాలిన ఎముకలు పావురం రెక్కరంగులోకీ, కర్మలన్నీ బూడిదరంగులోకీ మారతాయి. పిండాలను పెట్టమని చెప్పేవారు మూర్ఖులు. ప్రాణం పోగానే మూర్ఖుడూ, జ్ఞానీ ఒకే రకంగా క్షయిస్తారు. మరణానంతరం వారు జీవించబోరు." (దీఘనికాయ 1-55) అని వివరించారు మాస్టారు.

"ఆకాలం నాటి ప్రధాన మతాలలో ఒకటైన బౌద్ధమతాన్ని గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగాడు రోహిత్.

"బుద్ధుని అసలు పేరు సిద్ధార్ధుడు. క్రీ.పూ. 564లో జన్మించాడు. 484లో చనిపోయాడు. ఈయన శాక్య గణానికి చెందిన క్షత్రియ పాలకుని కుమారుడు. విలాసవంతమైన జీవితాన్ని గడుపుతుండేవాడు. జబ్బుతో బాధపడుతున్న వ్యక్తినీ, చనిపోయిన వ్యక్తినీ, సన్యాసినీ చూచి జీవితంపై విరక్తిచెందాడు. చివరకు ఒకనాటి రాత్రి ఇంటినీ, భార్యనూ వదిలి సన్యాసి అయ్యేందుకు బయలుదేరాడు. కొంత కాలం శరీరాన్ని తీవ్రంగా కష్టపెడుతూ, ఉపవాసాలు చేస్తూ, సన్యాసి జీవితం గడిపిన తర్వాత, ఇది మార్గం కాదని, ధ్యానమార్గం ఎన్నుకొని, 49వ రోజున జ్ఞానోదయం పొందాడు. దుఃఖానికి కారణాలు అర్ధంచేసుకున్నాడు. సిద్దార్ధుడు బుద్ధుడయ్యాడు.ఆయన తన మొదటి ధర్మప్రసంగాన్ని వారణాసి నగరానికి దగ్గరగా ఉన్న సారనాధ్‌లో తన మొదటి ఐదుగురు శిష్యులకూ చేశాడు. దీనిలోనే ఆయన తర్వాత చేసిన ఉపదేశాల సారాంశమంతా ఉంది. దానిలో బుద్ధుడు నాలుగు ఉత్తమ సత్యాలు తెలియజేశాడు. అవి.

1. ప్రపంచంలో దుఃఖం ఉంది.

2. దుఃఖానికి కారణం ఉంది.

3. ఆ కారణమే కోరికలు.

4. కోరికలు లేకుండా జీవిత ప్రయాణం సాగించడమే నిర్వాణం లేక పునర్జన్మ నుండి విముక్తి.

ఈ బోధనలను అర్ధంచేసుకొని ఆచరించడానికి లోతైన తాత్వక చింతనలు అవసరం లేదు. అతి తేలికైన అష్టాంగ మార్గాన్ని బుద్ధుడు సూచించాడు. అవి 1.) సత్ అభిప్రాయం 2) సత్ నిర్ణయం 3) సత్ వాక్కు 4) సత్ ప్రవర్తన 5) సత్ జీవన విధానం 6) సత్ శ్రమ 7) సత్ జ్ఞాపకం 8) సత్ ధ్యానం. ఇవన్నీ కలిసిన మార్గాన్నే మధ్యేమార్గమన్నారు.

బుద్ధుని బోధనలలో 'ఆత్మ'ను గూర్చిన ప్రస్తావన లేనేలేదు. ఆయన 'అనత్త' (ఆత్మలేదు) అన్నీ భావనకే గట్టిగా కట్టుబడి ఉండటం బౌద్ధమతంలోని విశేషం. ఇంకో ముఖ్యమైన విశేషం ఏమిటంటే, బౌద్ధ దర్శనంలో ఎక్కడా సృష్టికర్తకు అంటే భగవంతునికి స్థానంలేదు.

"ఈ జగత్తు శాశ్వతమైనదా, అశాశ్వతమైనదా?", వంటి ప్రశ్నలకు బుద్ధుడు సమాధానం ఈయక మౌనం పాటించాడు. అందుకు కారణమేమిటని ఒక శిష్యుడు ప్రశ్నించినపుడు ఆయన "అలాంటి ప్రశ్నలకు సంబంధించిన చర్చ నిష్ప్రయోజనం. అది నిబ్బాన సాధనకు (నిర్వాణ సాధనకు) తోడ్పడదు" అని సమాధానమిచ్చాడు.

పిల్లలూ! రాచరికం ఎలా ఏర్పడింది అనే విషయంలో వైదిక గ్రంథాలకు భిన్నమైన విషయాన్ని బుద్ధుడు పేర్కొన్నాడు. వైదిక గ్రంథాలు రాజు దైవాంశ సంభూతునిగా చిత్రించాయి. వాటిలోని ఒక కల్పిత గాథ ప్రకారం రుషులు సృష్టించిన మొట్టమొదటి రాజు కారునలుపు దేహము కల నిషాదుడు. ఇతనిని అడవులకు పోయి వేటవానిగా బ్రతకమని రుషులు బహిష్కరిస్తారు. తర్వాత వేనుడు అనే వ్యక్తిని రాజుగా ప్రతిష్ఠిస్తారు. ఈయన నిరంకుశుడు కాగా, రుషులు ఈయనను చంపివేసి పృథును సృష్టించి రాజును చేస్తారు. ఈవిధంగా వైదిక గ్రంథాలు రాచరికాన్ని బ్రాహ్మణవాద సంప్రదాయానికి చెందిన మహర్షుల కానుకగా చిత్రించడం జరిగింది.

అయితే, బుద్ధుడు రాజును 'సామాజిక ఒడండబిక' ద్వారా ఎన్నుకోబడిన వాడుగా వర్ణిస్తాడు. 'దీఘనికాయ' లోని 'అగ్గన్న సుత్త' లో బుద్ధుడు ఇలా పేర్కొంటాడు. "వరి పొలాలలో దొంగతనాలు సంభవిస్తుండేవి. వాటిని ఆపడానికి రాజును ఎన్నుకోవాలని ప్రజలు నిర్ణయించారు. అతను వారికి రక్షణను కల్పించి, పరిస్థితిని అదుపుచేయగల్గితే, అందుకు ప్రతిఫలంగా ఉత్పత్తిలో వాటాను వాగ్దానం చేశారు". ఇలా రాజరికపు మూలాన్ని గూర్చి వైదికమతమూ, బౌద్ధమతమూ

రెండు విభిన్న వర్ణనలు చేశాయి" అని బౌద్ధమతానికి సంబంధించిన అనేక వివరాలు తెలియజేశారు మాస్టారు.

"దరిద్రమూ, దాని పరిష్కారాలను గూర్చి బుద్ధుడు ఏం చెప్పలేదా మాస్టారూ!" అడిగింది ప్రియాంక.

"చెప్పాడమ్మా! సామాజిక చెడు ప్రవర్తనలకు మూలం దారిద్ర్యం మరియు నిరుద్యోగం అని బుద్ధుడు అన్నాడు. వాటిని ధనికుల దాతృత్వంతోనూ, రాజుగారి తీవ్ర అణచివేత విధానాలతోనూ రూపుమాపలేమన్నాడు. వ్యవసాయం, పశుపోషణలపై జీవించే వారికి విత్తనాలు, ఆహారం, అందించడమే యీ సమస్యకు సరియైన పరిష్కారం అన్నాడమ్మా" అని మాస్టారు వివరించాడు.

"స్వర్గ నరకాలను గూర్చి బుద్ధుడేమన్నాడు మాస్టారూ" అడిగాడు ప్రవీణ్.

"పుణ్యం చేయడం, దానివలన స్వర్గానికి వెళ్ళడం అంతా మోసమేనని బుద్ధుడు చెప్పాడు. ఉదాహరణకు 'పుణ్ణథేరీ' అనే బౌద్ధ గ్రంథంలో బుద్ధుడిలా అంటాడు :

'నీటిలో చేసే స్నానం

దుష్టకమ్మ (కర్మ) నుండి విముక్తి కి ఉపయోగపడుతుందా?

అదే జరిగితే, చేపలు, తాబేళ్ళు, కప్పలు, మొసళ్ళు నీటిలో సంచరించే ప్రాణులన్నీ నేరుగా స్వర్గానికి వెళ్తాయి" ఇలా నదీస్నానాలను బుద్ధుడు ఎగతాళి చేశాడు" అన్నాడు మాస్టారు.

"ఆకాలంలో ఆవిర్భవించిన మరోమతం జైనమతాన్ని గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగింది సునీత.

"అలాగేనమ్మా! జైనమతం చాలా సనాతనమైనది. ఈ మత ప్రవక్తలను తీర్థంకరులు అంటారు. తీర్థంకరులు వేదకాలంలోనే ఉన్నారు. ఋగ్వేదంలో

ఇద్దరు తీర్ధంకరుల పేర్లు ప్రస్తావ చేయబడ్డాయి. వారిలో 24వ తీర్థంకరుడైన మహావీరుడు, జినుడు అంటే జయించిన వాడు అనే బిరుదు సంపాదించిన కారణంగా ఆ మతానికి జైనమతం అనే పేరు వచ్చింది.

మహావీరుడు క్రీ.పూ. 540-468 మధ్య జీవించాడు. ఈయన ప్రాచీనకాల తీర్ధంకరులు చెప్పిన దానికి అదనంగా మరికొన్ని జోడించాడు. జైనుల దృష్టిలో ఎవరో ఒక దేవుడు యీ ప్రపంచాన్ని సృష్టించలేదు. అంతేకాదు, జన్మరాహిత్యానికి సరైన మార్గం జ్ఞానంకాదని జైనుల భావన. జన్మరాహిత్యానికి నాలుగు మౌలిక సూత్రాలను క్రీ.పూ. 7వ శతాబ్దానికి చెందిన పార్శ్వనాథుడు బోధించాడు. అవి 1) అహింస 2) పరధనమును అపహరించకుండుట 3) వ్యక్తిగత ఆస్థి లేకుండుట, 4) సత్యవర్తనము కలిగి యుండుట. ఈ నాలుగింటికీ మహావీరుడు బ్రహ్మచర్యాన్ని చేర్చాడు.

ఇవీ పిల్లలూ! జైనమతానికి చెందిన ముఖ్య సూత్రాలూ, జీవనమార్గాలూ. ముఖ్యమైన విషయం ఏమిటింటే, బౌద్ధ, జైన మతాలు దాదాపు ఒకే కాలంలో ఆవిర్భవించినా, బౌద్ధం ప్రజా సామాన్యానికి చేరువయ్యింది" అన్నారు మాస్టారు.

"బౌద్ధమే ప్రజలకు ఎందుకు చేరువయింది మాస్టారూ?" అడిగాడు శరత్‌చంద్ర.

"దీనికొక ప్రధాన కారణం ఉంది. బౌద్ధం ఆకాలంలో బాగా అభివృద్ధి చెందుతున్న వ్యవసాయాభివృద్ధికి దోహదంచేసింది. బుద్ధుడు, వ్యవసాయాభివృద్ధికోసం రైతులకు విత్తనాలను రాజు అందించాలని చెప్పాడని ఇంతకు ముందే చెప్పాను గదా! జైనమతం మాత్రం అహింసా సిద్ధాంతాన్ని అతిగా అన్వయించి, వ్యవసాయ ప్రక్రియల్లో కీటకాలు, పురుగులను చంపవలసి ఉంటుంది. కాబట్టి అసలు వ్యవసాయ ప్రక్రియనే అంగీకరించలేదు. దానితో వ్యవసాయం మీద ఆధారపడిన ప్రజలందరూ జైనమతం అంటే విముఖత చూపారు. బౌద్ధం వైపు మొగ్గుచూపారు. అలా బౌద్ధం సామాన్య ప్రజలకు

బాగా చేరువయ్యింది. జైనం వాణిజ్య వర్గాల వరకే పరిమితమయ్యింది. ఇలా మత విప్లవాలకాలంలో యజ్ఞయాగాల పేరుమీద అపారమైన పశువధ జరిపి, వ్యవసాయానికి హానిచేస్తున్న వైదిక మతానికి వ్యతిరేకంగా ఆవిర్భవించిన బౌద్ధ, జైనమతాలు ఈనాటికీ భారతదేశంలో నిలిచిఉన్నాయి. ఇవీ మత విప్లవాల కాలం విశేషాలు. పిల్లలూ! వచ్చే క్లాసులో క్రీ.పూ. 327 తర్వాతి కాలపు భారతదేశ చరిత్ర విశేషాలు తెలుసుకుందాం" అని ముగించి, మాస్టారు లేచారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 10వ భాగము. మౌర్యుల కాలపు భారతదేశం

"పిల్లలూ! ఇంతవరకూ మీకు క్రీ.పూ. 327 వరకూ నడిచిన భారతదేశ చరిత్రను గూర్చి చెప్పాను గదా? ఇప్పుడు ఆ తర్వాతి కాలపు చరిత్రను గూర్చి చెబుతాను. క్రీ.పూ. 327లో మాసిడోనియా రాజు అలెగ్జాండర్ భారతదేశంలోని వాయువ్య ప్రాంతంపై దాడిచేశాడు. వాయువ్య భారతదేశంలోని తక్షశిల రాజు అంభి, అతనితో యుద్ధం చేయకుండానే లొంగిపోయాడు. కాని జీలం–రావి నదుల మధ్య ప్రాంతాన్ని పరిపాలిస్తున్న పురుషోత్తముడు అనే రాజు అలెగ్జాండరును ఎదిరించాడు. కాని, యుద్ధంలో ఓడిపోయాడు. అయితే పురుషోత్తముని పరాక్రమానికి మెచ్చి, అతని రాజ్యాన్ని అతనికిచ్చివేసి, అలెగ్జాండర్ పురుషోత్తముని తనకు సామంతరాజుగా చేసుకున్నాడు. తరువాత అలెగ్జాండర్ గ్లౌగనికయ అనే గణతంత్ర రాజ్యాన్ని దానిలోగల 37 పట్టణాలతో సహా జయించాడు. ఆ తర్వాత ఇంకా తూర్పువైపుగా సాగి అశ్వాయన, అష్మకస్, కథాన్, మాళవ, క్షుద్రక, అగలసోయ్ మొదలైన తెగలను జయించి, మగధ సామ్రాజ్య సరిహద్దులకు చేరాడు. కాని అనేక యుద్ధాలతో విసిగిపోయిన అలెగ్జాండర్ సైనికులు, నందుల యొక్క భారీ సైన్యంతో యుద్ధం చేయడానికి నిరాకరించడంతో, అలెగ్జాండర్ వెనుదిరిగాడు.'' అని మాస్టారు కొనసాగించబోతుండగా అమంద లేచి "మాస్టారూ! నాదో డౌట్" అంది.

"అడుగమ్మా! అన్నారు మాస్టారు.

"అలెగ్జాండరుతో యుద్ధంలో పురుషోత్తముడే జయించాడని ఒక పుస్తకంలో చదివాను. అది నిజం కాదా మాస్టారూ?" అడిగింది అమంద.

"అమ్మా! పురుషోత్తముడితో యుద్ధం తరువాత అలెగ్జాండర్ అనేక గణ రాజ్యాలను జయించినట్లు చరిత్రకారులందరూ వ్రాశారు గదా? తనకు ఓడిన అలెగ్జాండరును, ఇంకా ముందుకు కొనసాగి, ఇతర రాజ్యాలను జయించడానికి

పురుషోత్తముడు అనుమతిస్తాడా? అట్లా అలెగ్జాండర్ ముందుకు సాగాడంటే, అలెగ్జాండర్–పురుషోత్తముల యుద్ధంలో విజేత అలెగ్జాండర్ అనే అర్థమవుతోందిగదా?" అని సమాధానమిచ్చాడు మాస్టారు. అవునన్నట్లు చిరునవ్వుతో తల ఊపింది అమంద.

మాస్టారు మరల కొనసాగించారు.

"అలెగ్జాండర్ దండయాత్రా కాలంలో మగధను నందులు అనేవారు పరిపాలిస్తున్నారని చెప్పానుగదా? వారిని సింహాసనం నుండి దింపి, తాను రాజ్యమేలాలని చంద్రగుప్త మౌర్య అనే యువకుడు ప్రయత్నిస్తున్నాడు. ఆయనను గ్రీకులు 'అంద్రకొట్టస్' అని పిలిచేవారు. ఆయన అలెగ్జాండరును కలిసి "నందులపై ప్రజావ్యతిరేకత తీవ్రంగా ఉన్నదనీ, అలెగ్జాండర్ ఇప్పుడు దాడిచేస్తే నందరాజ్యాన్ని సులభంగా కైవసం చేసుకోవచ్చుననీ" చెప్పాడని చరిత్ర గ్రంథకర్త ప్లుటార్క్ రాశాడు. అయితే, తనసైన్యం యొక్క వ్యతిరేకత కారణంగా అలెగ్జాండర్ మగధపై దండెత్తకుండా వెనుదిరిగాడు. అయితే ఆ తర్వాత చంద్రగుప్త మౌర్యుడు చాణక్యుడు అనే బ్రాహ్మణ గురువు సహాయంతో నందులను ఓడించి, మగధలో మౌర్య సామ్రాజ్యాన్ని క్రీ.పూ. 322లో స్థాపించాడు. చంద్రగుప్తుడు 298 బి.సి. వరకు పరిపాలించాడు. ఆ తర్వాత బి.సి. 270 వరకు ఆయన కుమారుడు బిందుసారుడు పరిపాలించాడు. బిందుసారుని తదనంతరం ఆయన కుమారులలో ఒకడైన అశోకుడు తన 99 మంది సోదరులను చంపి 270 బి.సి. లో సింహాసనాన్ని అధిష్ఠించాడు. అశోకుడు తన సామ్రాజ్య విస్తరణలో భాగంగా క్రీ.పూ. 262లో కళింగపై దాడిచేశాడు. ఆ యుద్ధంలో విజయం సాధించినా, యుద్ధం కారణంగా జరిగిన దారుణ మారణకాండకు చలించి, అహింస, శాంతిని ప్రతిపాదించిన బౌద్ధమతాన్ని స్వీకరించాడు. అశోకుడు క్రీ.పూ. 232 వరకు పరిపాలించాడు. ఆయన తర్వాత మౌర్య వంశపు రాజులు క్రీ.పూ. 185 వరకు భారతదేశంలో ఎక్కువ భాగాన్ని పరిపాలించారు. మౌర్య

రాజులలో ఆఖరివాడు బృహద్రధుడు. ఆయనను, సేనాధిపతి పుష్యమిత్రశుంగుడు హత్యచేసి గద్దెనెక్కాడు. అప్పటినుండి శుంగవంశ పాలన ప్రారంభమయింది". అని ముగించారు మాస్టారు.

"మౌర్యుల కాలంనాటి పరిపాలనా పద్ధతులను వివరించండి మాస్టారూ!" అడిగాడు రోహిత్.

"మౌర్యుల కాలంనాటి పరిపాలనా పద్ధతులు, వారు చేపట్టిన సంక్షేమ కార్యక్రమాలు, మతపరమైన ఆచరణలు తెలుసుకోవడానికి గ్రీకు చరిత్రకారుల రాతలు, చాణుక్యుడు రచించిన "అర్ధశాస్త్ర" అనే గ్రంధం, అశోకుని శిలా శాసనాలు ఉపయోగపడతాయి. మౌర్యుల పాలనలోని ముఖ్యమైన అంశం ఏమిటంటే రాజ్యమంతా చక్రవర్తి సంపదయే అని ప్రకటించబడింది. ప్రజలకెవరికీ భూమి, గనులు, వనాలపై ఏరకమైన హక్కులేదు. ఈ విషయాన్ని గూర్చి చాణుక్యుడు ఎంత స్పష్టంగా చెప్పాడంటే "ప్రపంచాధిపత్యం సంపాదించాలంటే గనుల మీద అజమాయిషీకావాలి" అన్నాడని డి.డి. కోశాంభి అనే చరిత్రకారుడు తాను వ్రాసిన "ఏన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" అనే గ్రంధంలో 218వ పేజీలో వ్రాశాడు. కాని యీనాడు మన ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయి? గనుల మీద అధికారాన్ని ప్రైవేటు వ్యక్తుల కిస్తున్నాయి. అంటే దేశాధిపత్యాన్ని ప్రైవేటువారికి కట్టబెడుతున్నాయి. ప్రభుత్వాన్ని బలహీనంచేస్తున్నాయి. ఇది కోట్లాది మంది ప్రజలకు ప్రమాదకరం కాదా?"

"ప్రమాదకరమే మాస్టారూ!" విచారంగా అన్నారు పిల్లలందరూ.

"అంతేకాదు. రాజ్య విస్తరణలో భాగంగా ఆటవిక గణాలను రాజు ఏవిధంగా లొంగదీసుకోవాలో, దానికి ఒక ఎత్తుగడను చాణుక్యుడు చెబుతాడు. "గూఢచారులు గణంలో ప్రవేశించి వారి మధ్యలో ద్వేషాన్ని పెంచాలి. గణం ముఖ్యులు సామాన్య గణ సభ్యులతో సహపంక్తి భోజనం చేయగూడదనీ, వివాహ సంబంధం పెట్టుకోకూడదనీ రెచ్చగొట్టాలి" అంటాడు. ఇంకో ముఖ్యమైన

విశేషం ఏమిటంటే, ఆకాలంలో ముఖ్యమంత్రి, పురోహితుడు, సైన్యాధిపతిల జీతం 48,000 పణాలు. వృత్తిపని వారి జీతం 120 పణాలు. 1 పణం 1 రూపాయి అనుకుంటే, క్రిందివారి జీతం కంటే పైవారి జీతం 400 రెట్లు ఎక్కువ! ఈ విషయం ఆనాటి సమాజంలో అంతరాలు ఎంత తీవ్రంగా ఉండేవో సూచిస్తోంది. పిల్లలూ! అన్నిటికంటే ముఖ్యమైన విషయం ఏమిటంటే అర్థశాస్త్రం "రాజు అధికారం అన్నింటినీ, ధర్మాన్ని కూడా మించినది" అని చెప్తుంది. "మారుతున్న పరిస్థితులను బట్టి ధర్మాన్ని వ్యాఖ్యానించే అధికారం రాజుకు ఉంది" అని కూడ చెబుతుంది. దానికి కొనసాగింపుగానే "ధనం అవసరం ఉన్న రాజు, బ్రాహ్మణులు ఉపయోగించే దేవాలయాలు తప్ప, ఇతరుల దేవాలయాల సంపదను కొల్లగొట్టవచ్చునని చాణుక్యుడు అర్థశాస్త్ర (ఐ.18.9) లో చెబుతాడు. ఈయననే చరిత్రకారులు కౌటిల్యుడు అనికూడా చెబుతారు. ఇవీ మౌర్యుల కాలంనాటి పరిపాలనా పద్ధతులు" అన్నాడు మాస్టారు.

"మౌర్యుల కాలంనాటి సంక్షేమ కార్యక్రమాలను వివరించండి మాస్టారూ! అడిగాడు కార్తీక్.

"ఆకాలంలో ప్రభుత్వమే డాములు, చెరువులు, కాలువలు తవ్వించింది. ఉదాహరణకు చంద్రగుప్తుడు సుదర్శన చెరువును తవ్వించాడనీ, దానిని అశోకుడు మరింత అభివృద్ధి చేశాడనీ చరిత్రకారులు వ్రాశారు. అశోకుడు మనుషులకు, పశువులకు విడివిడిగా వైద్యాలయాలు నిర్మించాడు. ఔషధ మొక్కలు నాటించాడు. రోడ్ల కిరుప్రక్కల మర్రి, మామిడి మొక్కలను నాటించాడు. మనుషులకు, పశువులకు దాహార్తి తీరడానికి బావులు త్రవ్వించాడు. విశ్రాంతి స్థలాలు ఏర్పాటు చేయించాడు. ఇవీ ఆకాలంలో ప్రజా సంక్షేమ కార్యక్రమాల వివరాలు" అన్నాడు మాస్టారు.

"ఆ కాలంనాటి మతపరమైన నమ్మకాలు, పూజా కార్యక్రమాలు "మతపరమైన విషయాలలో కౌటిల్యుని 'అర్థశాస్త్రం' అశోకుని రాతి శాసనాలు

పరస్పర విరుద్ధ విషయాలు చెప్పాయి. అర్ధశాస్త్ర సూత్రాలను బహుశ చంద్రగుప్తుడు, బిందుసారుడు ఆచరించి ఉండవచ్చు. రాతిశాసనాలలో పేర్కొన్నట్లు అశోకుడు, ఆయన తర్వాతి వారు అనుసరించి ఉండవచ్చు. ఆ విషయాలను పరిశీలిద్దాం. అర్ధశాస్త్రం 2.17లో భూదానాలు బ్రాహ్మణ పూజారులు, పురోహితులు, వేదాలు అభ్యసించిన బ్రాహ్మణులకు మాత్రమే ఇవ్వాలని చెప్పబడింది. కాని అశోకుడు తాను కేవలం బౌద్ధ బిక్షు వ్యవస్థ అయిన 'సంఘం' మాత్రమే కాక, బ్రాహ్మణులు, అజీవకులు, జైనులను కూడా సమానంగా ఆదరిస్తానని రాతిస్తంభ శాసనంVII లో ప్రకటించాడు. అలాగే ప్రజల నివాస స్థలాల్ని గూర్చి అర్ధశాస్త్ర "బ్రాహ్మణ మునులకు తప్ప ఏ ఇతర పరివ్రాజానికీ ఒక జనపదంలో ఉండేందుకు అనుమతి ఇవ్వరాదు" అని II 1.32లో పేర్కొంది. మరియు అర్ధశాస్త్ర II 4.23లో కులభ్రష్టులతో పాటు, పాషండులు పట్టణాల్లో ఎక్కడా ఉండటానికి వీలులేదు. వీరంతా పట్టణాల వెలుపల స్మశానవాటికల సమీపంలో ఉండవచ్చు" అనికూడ చెప్పింది. కాని అశోకుడు రాతిశాసనం VII లో "అన్ని మత వర్గాలవారు ప్రతిచోట స్థిరపడాలి" అని ప్రకటించాడు. అర్ధశాస్త్రం పరమత అసహనాన్ని బోధిస్తే, అశోకుడు పరమత సహనాన్ని బోధించాడు. కౌటిల్యుడు, పూర్వీకుల శ్రాద్ధ కర్మలు జరిపేటప్పుడు గానీ, దైవ పూజలప్పుడు గానీ బౌద్ధం, అజీవక భిక్షువులను భోజనానికి పిలువవద్దన్నాడు. అలా పిలిస్తే ఎక్కువ మొత్తంలో రాజు జరిమానా విధించాలని చెప్పాడు. కాని అశోకుడు రాతిశాసనం XII లో పరమత సహనం యొక్క ఆవశ్యకతను గూర్చి ఇలా పేర్కొన్నాడు. "ప్రజలు ఇతర శాఖీయులను కూడా తప్పనిసరిగా అన్నివిధాలా గౌరవించాలి. ఆవిధంగా చేసేవాడు తన స్వీయశాఖ వృద్ధిని మరియు ఇతర వర్గాల వృద్ధిని సాధించగలడు. తన వర్గం అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని ఇతర వర్గాలవారిని దూషించేవాడు, తన వర్గానికే మిక్కిలి హాని చేకూరుస్తాడు. కాబట్టి సయోధ్య ఒక్కటే శ్రేష్ఠమైంది." ఇలా ఇంతటి మతసహనాన్ని చూపినప్పటికీ, అశోకుడు వైదికమతంలోని మూఢాచారాలనూ,

బలులనూ, పూజలనూ, వ్యతిరేకించాడు. ముఖ్యంగా కుటుంబంలో పిల్లలు పుట్టినప్పుడు, వివాహాలప్పుడు, ఏదైనా ప్రయాణాలు చేసేటప్పుడు, జబ్బు చేసినప్పుడు జరిపే తతంగాలన్నింటినీ ఆయన నిరసించాడు. ఇవన్నీ తక్కువ స్థాయి పురోహితులు తమ జీవనాధారం కోసం చేసే క్రతుకాండలన్నాడు. పిల్లలూ! ఇవీ మౌర్యుల కాలంనాటి మతపరమైన కార్యక్రమాల వివరాలు. వచ్చే క్లాసులో మౌర్యుల అనంతర కాలపు భారతదేశ చరిత్రను గూర్చి తెలుసుకుందాం" అంటూ మాస్టారు లేచారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 11వ భాగం. మౌర్యుల అనంతరకాలం

"పిల్లలూ! మౌర్యుల పరిపాలన క్రీ.పూ. 185 వరకూ సాగిందనీ, ఆ సంవత్సరంలో మౌర్యుల చివరి రాజు బృహద్రధుని, అతని సేనాని పుష్యమిత్రుడు అనే శుంగ వంశపు బ్రాహ్మణుడు హత్యచేసి, రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్నాడనీ క్రిందటి క్లాసులో చెప్పాను గదా? అప్పటినుండి ఉత్తర భారతదేశాన్ని శుంగ వంశం పరిపాలించింది. పుష్యమిత్రుడు 36 సంవత్సరాలు పరిపాలించాడు. ఈయన తర్వాత ఈయన కుమారుడు అగ్నిమిత్రుడు మగధ సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. ఈ అగ్నిమిత్రుడే మహాకవి కాళిదాసు రచించిన "మాళవికాగ్నిమిత్ర" అనే నాటకంలో హీరో. వీరి పరిపాలనాకాలంలో శుంగరాజ్యం గంగా, నర్మదా నదుల మధ్య భాగం అంతటా విస్తరించింది. శుంగరాజుల్లో చివరివాడు భాగభద్రుడు. ఈయన క్రీ.పూ. 115 నుండి క్రీ.పూ. 83 వరకు పాలించాడు. కాని ఈయన పరిపాలనా కాలంలో శుంగవంశ అధికారం క్షీణించి కేవలం మగధ ప్రాంతానికే పరిమితమైంది. చివరకు క్రీ.పూ. 83లో మగధరాజ్యాన్ని కణ్వవంశం వారు ఆక్రమించుకున్నారు. వీరు క్రీ.పూ. 28 వరకు పరిపాలించారు.

క్రీ.పూ. 2వ శతాబ్దిలో ఇండోగ్రీకు పాలకులు విజృంభించి, విశాల సామ్రాజ్యాన్ని ఏలారు. వీరిలో మినాందర్ ముఖ్యుడు. ఈయన క్రీ.పూ. 155 నుండి క్రీ.పూ. 130 వరకు ఉత్తర భారతాన్ని ఏలాడు. ఈయన సామ్రాజ్యం వాయువ్యలోని స్వాట్‌లోయ, పంజాబ్, ఉత్తరాన కాబూల్, దక్షిణాన మధుర వరకు విస్తరించింది. ఈయననే మిలిందుడని చరిత్రకారులు పిలిచారు. మిళిందుడు నాగశేనుడనే బౌద్ధ గురువుతో జరిపిన చర్చలు "మిళిందపన్హా" అనే గ్రంధంగా ప్రసిద్ధిచెందాయి. ఆ చర్చల పర్యావసానంగా మిళిందుడు బౌద్ధమతాన్ని స్వీకరించాడు.

మిళిందుని తర్వాత ఉత్తర భారతదేశాన్ని పరిపాలించిన రాజులలో రుద్రదమనుడు ముఖ్యుడు. ఈయన భారతదేశం పైకి దండెత్తివచ్చిన విదేశీయులైన శకులలో అత్యంత సమర్ధుడు. రుద్రదమనుడు క్రీ.శ. 2వ శతాబ్దిలో, క్రీ.శ. 130 నుండి క్రీ.శ. 160 వరకు పరిపాలించాడు. ఈయన సింధు, కచ్, గుజరాత్, రాజస్తాన్, కొంకణ్, నర్మదాలోయ, మాళ్వా, కథియవాడ్, పశ్చిమ దక్కన్ ప్రాంతాలను పాలించాడు. ఈయన కథియవాడ్‌లో మౌర్యుల కాలం నుండి సేద్యపునీటిని సరఫరా చేస్తున్న సుదర్శన సరస్సుకు మరమ్మత్తులు చేయించాడు." అని వివరించాడు మాస్టారు.

"మరి కనిష్కుడు కూడ క్రీ.శ. 2వ శతాబ్దిలో ఉత్తర భారతదేశాన్ని పాలించాడని విన్నాను. ఆయనను గూర్చి చెప్పరా మాస్టారూ!" అడిగాడు రోహిత్.

"చెబుతాను రోహిత్! కనిష్కుడు చైనా టర్కిస్తాన్ లోని యూచీ తెగకు చెందిన కుషాణులకు చెందిన రాజు. ఈయన క్రీ.శ. 160 నుండి 183 వరకు పెద్ద సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. కనిష్కుడు మధ్య ఆసియాలోని కొంత ప్రాంతాన్ని, వాయువ్య భారతాన్ని, సింధు, గంగ పరీవాహక ప్రాంతాలను పరిపాలించాడు. ఈయన సామ్రాజ్యం దక్షిణాన ప్రస్తుత మధ్యప్రదేశ్‌లోని సాంచి వరకు, తూర్పున బెనారస్ వరకు విస్తరించి ఉంది. ఈయన బౌద్ధమతాన్ని స్వీకరించి, ఆదరించాడు. కుషాణులు క్రీ.శ. 258 వరకు వాయువ్య, ఉత్తర భారతదేశాలను పరిపాలించారు. ఈసమయంలో పాలిస్తున్న వాసుదేవుడనే కుషానురాజును పర్షియాకు చెందిన రాజు ఒకడు ఓడించి, కుషాణులను సామంతుల స్థితికి తీసుకువచ్చాడు. తర్వాత క్రమంగా కుషాణుల పెత్తనం అంతరించింది" అన్నాడు మాస్టారు.

"కళింగ రాజ్యాన్ని పరిపాలించిన రాజుల్లో క్రీ.పూ. 1వ శతాబ్ధిలో పరిపాలించిన ఖారవేలుడు సుప్రసిద్ధుడు. ఈయన మహామేఘవాహన వంశానికి

చెందినవాడు. ఈయన వేయించిన హాథిగుంప శిలాశాసనం ప్రకారం, ఈరాజు "గులాబీ వర్ణంతో మెరిసిపోయే సుందరమైన శరీరాన్ని కలిగిఉన్నవాడు". ఖారవేలుడు జైనమతస్థుడు. అయినప్పటికీ ఈయన అనేక యుద్ధాలు చేశాడు. పశ్చిమ దక్కనును, మగధను జయించాడు. వాయువ్యంలో గ్రీకులను, దక్షిణాన పాండ్యరాజ్యాన్ని జయించినట్లు హాథిగుంప శాసనం తెలియజేస్తోంది. ఈ రాజు పూర్వకాలపు రాజొకరు తవ్వించిన పంటకాలువను బాగా పెద్దదిచేశాడు. ఖారవేలుడు బ్రాహ్మణులకు పన్నుల నుండి మినహాయింపునిచ్చాడు" అని వివరించాడు మాస్టారు.

"ఆ కాలంనాటి ఆంధ్ర ప్రాంత పరిస్థితిని వివరించండి మాస్టారూ!" అడిగాడు కార్తీక్.

"క్రీ.పూ. మూడవ శతాబ్ది చివరి నుండి క్రీ.శ. 2వ శతాబ్ది చివరి వరకు ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలను, మహారాష్ట్రలోని కొంత భాగాన్ని శాతవాహనులు అనే రాజులు పరిపాలించారు. శాతవాహన రాజ్య స్థాపకుడు శ్రీముఖుడు. ఈయన క్రీ.పూ. 221 లో దక్కనుకు వాయువ్యంగా ఉన్న ప్రతిష్ఠానపురం అంటే నేటి మహారాష్ట్రలోని పైథాన్ రాజధానిగా రాజ్యాన్ని స్థాపించి, క్రీ.పూ. 198 వరకు పరిపాలించాడు. శాతవాహనరాజులలో గౌతమీపుత్ర శాతకర్ణి గొప్పవాడు. ఈయన క్రీ.శ. 78 నుండి 102 వరకు పాలించాడు. ఈయన శకుల అధికారాన్ని, క్షత్రియుల గర్వాన్ని అణచివేశాడు. బ్రాహ్మణుల బాగునుకోరి, నాలుగు వర్ణాలవారు కలిసిపోవడం ఆపివేశానని చెప్పుకున్నాడు. ఈయన కుమారుడు వశిష్ఠపుత్ర శాతకర్ణి, క్రీ.శ. 2వ శతాబ్ది మొదట్లో పరిపాలించాడు. రాజ్యాన్ని మరింత విస్తరించాడు. ఈయనకాలం నాటికి శాతవాహన రాజ్యం పశ్చిమతీరంలో కథియవాడ్ వరకు, కృష్ణాడెల్టా ప్రాంతం, ఆగ్నేయంలో తమిళనాడు ఉత్తర ప్రాంతం వరకు విస్తరించింది.ఆ తర్వాత క్రమంగా శాతవాహనుల రాజ్యం క్షీణించింది". అన్నారు మాస్టారు.

"ఆ కాలంలో భారతదేశ దక్షిణ ప్రాంత పరిస్థితిని గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగింది అమంద.

"మౌర్యుల అనంతర కాలంలో దక్షిణ భారతదేశంలో 3 ప్రముఖ రాజ్యాలున్నట్లు గ్రీకుల రాతలు తెలియజేస్తున్నాయి. అవి చోళరాజ్యం, చేరరాజ్యం లేక కేరళ రాజ్యం, పాండ్యరాజ్యం. పాండ్యరాజ్యం భారత ద్వీపకల్పపు ఆగ్నేయపు కొసన ఉన్నట్లు గ్రీకు చరిత్రకారులు తెలియజేశారు. ఆసక్తికరమైన అంశమేమిటంటే, క్రీ.పూ. 4వ శతాబ్దిలోనే పాండ్యరాజ్యాన్ని ఒక స్త్రీ పరిపాలిస్తున్నదని గ్రీకు చరిత్రకారుడు మెగస్తనీస్ వ్రాశాడు. పై మూడు రాజ్యాలూ నిరంతరం తమలో తాము యుద్ధాలు చేసుకుంటూ ఉండేవి. ఆనాటి రాజులలో చోళరాజు కరికాలచోళుడు ప్రసిద్ధుడనీ, ఆయన కావేరీ పట్టణాన్ని రాజధానిగా చేసుకొని రాజ్యాన్ని పాలించాడనీ ఆనాటి సంగమ సాహిత్యం తెలియజేస్తోంది" అని వివరించారు మాస్టారు.

"ఆనాటి సాంఘిక, ఆర్థిక, మతపరమైన పరిస్థితులు వివరించండి మాస్టారూ!" అడిగాడు శరత్‌చంద్ర.

"ఆనాటి పరిస్థితులను గూర్చి క్రీ.పూ. 200 క్రీ.శ. 200ల మధ్యకాలంలో రచించబడ్డ మనుస్మృతి, క్రీ.పూ. 150 కాలం వాడైన పతంజలి రచనలు, ఆకాలంలోనే రచించబడ్డ పురాణాలు విస్తరిస్తున్నాయి. మౌర్యుల కాలంలో చేతిపనులు వృద్ధిచెందడంతో, వృత్తి నిపుణులుగా ఉన్న శూద్రుల ఆర్థిక పరిస్థితి మెరుగుపడింది. కాని క్రీ.పూ. 200-క్రీ.శ. 300 మధ్య మనువు, శూద్రులపై విధించిన ఆంక్షల వల్ల ఈకాలంలో శుద్రుల ఆర్థిక పరిస్థితి ఎంతో దెబ్బతిన్నది. శూద్రులు అగ్రవర్ణాల వారిని సేవించడానికే సృష్టించబడ్డారనీ, వారు చదువుకోగూడదనీ, ఆస్థి కలిగి ఉండకూడదనీ, ఆయుధం ధరించగూడదనీ మనువు మనుస్మృతిలో శాసించాడు. శూద్రులు ఎవరినైనా గాయపరచినా లేదా ఏదైనా నేరం చేసినా, వారికి విధించే శిక్షలు చాలా కఠినంగా ఉండేవి.

శూద్రులు అగ్రవర్ణాల వారిని ఏ అంగంతో బాధిస్తే ఆ అంగాన్ని ఛేదించాలని మనువు చెప్పాడు. అంతేకాదు, "శూద్ర స్త్రీలు అగ్రవర్ణాలవారి సుఖం కోసమే ఉద్దేశింపబడ్డారు". అని పతంజలి పేర్కొన్నాడు. ఇలాంటి స్మృతులు, సూత్రాలతో అసంతృప్తి పెరిగిన శూద్రులు ఒక్కొక్కసారి బ్రాహ్మణులపై, అగ్రవర్ణాల వారిపై తిరగబడేవారని ప్రసిద్ధ చరిత్రకారుడు డి.ఎన్. ఝూ "ప్రాచీన భారతదేశం" అనే తనగ్రంథంలో పేర్కొన్నాడు. అంతేకాదు, ఈ స్మృతులు, శాస్త్రాలు స్త్రీలకు ఆస్థిలో హక్కులేకుండా చేసి, స్త్రీల వివాహ వయోపరిమితిని చాలా తగ్గించివేశాయి. దానితో స్త్రీలకు వివాహ విషయంలో గానీ, ఆస్తి విషయంలోగాని నిర్ణయాధికారం లేకుండా పోయింది.

ఇక విదేశీ దండయాత్రీకుల విషయానికి వస్తే, వారిని బ్రాహ్మణులు, బ్రాహ్మణ, క్షత్రియ కులాలలో కలిపివేశారు. ఈ సమ్మేళనానికి రుజువు మహాభారతంలో కనిపిస్తుంది. ఈ గ్రంథంలో యవనులుగా పేర్కొనబడ్డ విదేశీయులు ఒకచోట యయాతి పుత్రులుగా చెప్పబడ్డారు. ఇంకోచోట వశిష్ఠుని ఆవు హుంకారం నుండి జన్మించారని చెప్పబడింది. మరోచోట వారు బ్రాహ్మణ ధర్మాన్ని అనుసరిస్తే, బ్రాహ్మణ వర్గంలో చేరవచ్చని ఇంద్రుడన్నట్లుగా చెప్పబడింది. మన సమాజంలో వారిని కలుపుకోవడానికి చేసే ప్రయత్నాలకు రుజువులుగా చరిత్రకారులు వీటిని భావిస్తున్నారు.

"ఆ కాలంలో కూడా ప్రజల మధ్య ఆర్థిక, సామాజిక అంతరాలు ఉన్నాయా మాస్టారూ?" అడిగింది సౌజన్య.

"ఉన్నాయి సౌజన్యా! వాటిని గూర్చి వివరిస్తాను". అని బాధగా నిట్టూర్చి, మాస్టారు కొనసాగించారు. "మధురలోని ఒక శిల్పంలో ఒక ధనిక వర్గం మహిళ నిలబడి ఉండటం, ఆమెకు ఒక సేవకురాలు తలపై గొడుగు పట్టడం, మరొకరు విసనకర్రతో విసరడం, ఇంకో సేవకురాలు పూలదండ పట్టుకొని ఉండటం కనిపిస్తుంది. మరో శిల్పంలో కొందరు సేవకులు తమ యజమాని

గుర్రం ముందు పరుగెడుతూ కనబడతారు. ఇవన్నీ ఆనాటి సమాజంలో ధనిక, బీద అంతరాలు తీవ్రంగా ఉండటాన్ని తెలియజేస్తున్నాయి” అని ముగించారు మాస్టారు.

“మాస్టారూ! ఇందాక మీరు ‘పురాణాలు ఆకాలంలో రచించబడ్డాయి’ అన్నారు. దానికి రుజువులేమయినా ఉన్నాయా?” అడిగాడు మనోహర్.

“చెబుతాను మనోహర్! ఈ విషయాన్ని ప్రముఖ చరిత్రకారుడు ఆర్.సి. మజుందార్ తాను వ్రాసిన “ఏన్షెంట్ ఇండియా” అనే గ్రంథంలో సుదీర్ఘంగా చర్చించారు. ఆయన చెప్పినదాని సారాంశం ఏమిటంటే...

క్రీ.పూ. 2వ శతాబ్దానికి ముందు రాజసూయం, అశ్వమేధం వంటి యాగాలు చేసే సమయంలో, ‘యజ్ఞం చేయించేవ్యక్తి అంటే యజమానికి సంబంధించిన పూర్వీకుల కథలు’ అంటూ కొన్ని కథలను కొందరు వ్యక్తులు (భట్రాజులు) గానం చేసేవారు. అలా కురువంశం వారికి సంబంధించి పరీక్షిత్తు, జనమేజయుల కథలూ, ఇక్ష్వాకు, కోసల రాజులకు సంబంధించిన హరిశ్చంద్రుని కథ వంటివీ చెప్పబడేవి. ఆ గాథలు ప్రజలలో ప్రచారం పొందటాన్ని బౌద్ధ గ్రంథాలు కూడా అంగీకరించాయి. అయితే, ఆ కథాగానాన్ని బుద్ధుడు తీవ్రంగా నిరసించాడని ఆ గ్రంథాలు పేర్కొన్నాయి, ఆ గాథలు వేదసంహితలలో ఎక్కడా చెప్పబడలేదు. అలాంటి గాథలలో ఇక్ష్వాకు వంశస్థుడూ, దశరథుని కుమారుడూ అయిన రాముని గాథ ఒకటి. దానిని గూర్చి, బౌద్ధ జాతక కథలలోనూ, క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందిన గుహా శిల్పాలలోనూ చెప్పబడింది. అలాగే, పాండవులను గూర్చిన మరొక గాథ కూడ జాతకకథలలో ఉంది. దానిని గూర్చి క్రీ.పూ. 4వ శతాబ్దినాటి గ్రీకుల రాతలలో ప్రస్తావించబడింది. ఆ గ్రంథాలలో శ్రీకృష్ణుడు, గ్రీకుల హెరాక్లెస్‌గా వర్ణించబడింది. అదే విషయం క్రీ.పూ. 350 వాడైన పాణిని, క్రీ.పూ. 250 వాడైన కాత్యాయనుడు, క్రీ.పూ. 150 వాడైన పతంజలిల గ్రంథాలలో కూడ

పేర్కొనబడింది. పతంజలి రచనలలో రామకథలో కిష్కింధా వృత్తాంతం ప్రస్తావించబడింది. బౌద్ధ జాతక కథలలో ఒకటైన దశరథ జాతక కథ ప్రకారం రాముడు కాశీనగరానికి అధిపతి. అయోధ్యకు కాదు. ఈ కథలు ఆ తర్వాతి కాలంలో పూర్తిస్థాయి గ్రంథాలుగా వ్రాయబడ్డాయి. వాటి రచయితలైన వాల్మీకి, వ్యాసుల పేర్లు చివరి వైదిక గ్రంథాలు, వేదాంగాలలో పేర్కొనబడ్డాయి. రామాయణానికి సంబంధించిన మొదటి ప్రస్తావన క్రీ.శ. 1,2 శతాబ్దాలకు చెందిన బౌద్ధ, జైన గ్రంథాలలో ఉంది. ఆ గ్రంథాలలో కూడా, రామాయణం 12,000 శ్లోకాల గ్రంథంగానే ప్రస్తావించబడింది. అంటే ఇప్పటి రామాయణ గ్రంథం యొక్క సైజులో సగమే అప్పట్లో ఉండేది.

మహాభారతాన్ని గూర్చి అశ్వలాయనుని గృహ్య సూత్రాలలోనూ, పాణిని అష్టాధ్యాయిలోనూ ప్రస్తావించబడింది. అది, ఆ కాలంనాటికి, ఇప్పుడున్న గ్రంథంలో నాల్గోవంతు శ్లోకాలతో ఉన్నట్లుగా చెప్పబడింది. లక్ష శ్లోకాలతో కూడిన ప్రస్తుత మహాభారతాన్ని గూర్చి మొదటగా గుప్తులకాలం నాటి శాసనంలో ప్రస్తావన చేయబడింది.

రామాయణ, మహాభారతాలలోని నీతి బోధ చేసే భాగాలు తర్వాతికాలంలో చేర్చబడ్డాయి. కృష్ణుడు, దేవకీ వసుదేవుల పుత్రుడుగా మాత్రమే ఛాందోగ్య ఉపషనిత్తులో చెప్పబడింది. అయితే 'తైత్తిరీయ అరణ్యక'లో కృష్ణుడు విష్ణుమూర్తి అవతారంగా చెప్పబడింది. అలాగే, 'శతపదబ్రాహ్మణం'లో అర్జునుడే ఇంద్రుడుగా పేర్కొనబడ్డాడు. కాని మహాభారతంలో అర్జునుడు ఇంద్రుని కుమారుడుగా చెప్పబడ్డాడు. కౌరవవంశ వినాశనాన్ని గూర్చి ఛాందోగ్యోపనిషత్తులోనూ, ఒకానొక శ్రౌత సూత్రంలోనూ సూచించబడింది. కౌరవుల ప్రధాన శత్రువుగా సృంజయులను 'శతపద బ్రాహ్మణం' పేర్కొంటోంది. గ్రీకు ఖగోళ శాస్త్రజ్ఞుడు టాలెమీ రాతల ప్రకారం, ఆకాలంలో, పంజాబ్‌లో, పాండు అనే జాతివారు నివసించేవారని తెలుస్తోంది. మహాభారతాన్ని, తర్వాతి కాలంలో

తిరగరాశారనేందుకు రుజువుగా, దానిలో యవనులు, శకులను గూర్చిన అంశాలు నిలుస్తున్నాయి.

మజుందార్ పరిశోధనా వివరాలను భారతీయ చరిత్రకారులందరూ ఆమోదించారు. రామాయణ, మహాభారతాలు భట్రాజుల నోటి గాథల స్థాయినుండి, పురాణ గ్రంధాలుగా క్రమంగా పరిణామం చెందాయని అందరూ అంగీకరిస్తున్నారు.

పిల్లలూ! క్రీ.శ. 300 వరకు జరిగిన రాజకీయ, ఆర్థిక, సామాజిక, మతపరమైన చరిత్రను తెలుసుకున్నారుగదా? వచ్చే క్లాసులో క్రీ.శ. 300 తర్వాత భారతదేశ చరిత్రను తెలుసుకుందాం” అంటూ లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 12వ భాగం. ప్రాచీన భారతదేశ చరిత్ర - క్రీ.శ. 300 తర్వాత

"పిల్లలూ! ఈరోజు క్రీ.శ. 300 తర్వాత జరిగిన ప్రాచీన భారతదేశ చరిత్రను తెలుసుకుందాం" అంటూ చరిత్ర పాఠాన్ని మొదలుపెట్టారు మాస్టారు. "క్రీ.శ. 319లో మొదటి చంద్రగుప్తుడు రాజు కావడంతో గుప్త సామ్రాజ్య పరిపాలన ప్రారంభమయింది. చంద్రగుప్తుని కంటే ముందు ఒకరిద్దరు గుప్తరాజులు మగధను పాలించినా, వారు చిన్న రాజులుగానే చరిత్రలో నిలిచారు. మొదటి చంద్రగుప్తుడు తూర్పు ఉత్తరప్రదేశ్ ప్రాంతాన్ని కూడ జయించి, మగధ సామ్రాజ్యాధిపతి అయ్యాడు. ఈయన తదనంతరం, ఈయన కుమారుడు సముద్రగుప్తుడు క్రీ.శ 335లో రాజయ్యాడు. ఈయన కాలంలో దాదాపు ఉత్తర భారతదేశమంతా గుప్త సామ్రాజ్యంలో భాగమయింది. సముద్రగుప్తుని అనంతరం ఈయన పెద్దకుమారుడు రామగుప్తుడు రాజయ్యాడు. అయితే అతని తమ్ముడైన రెండవ చంద్రగుప్తుడు, అన్నయైన రామగుప్తుని చంపి, తాను రాజయ్యాడు. అన్న భార్య ధృవదేవిని వివాహమాడాడు. ఈయన క్రీ.శ. 375 నుండి 415 వరకు పాలించాడు. ఈయన తర్వాత, ఈయన కుమారుడు కుమారగుప్తుడు రాజ్యాన్ని పాలించాడు. కుమారగుప్తుని తరువాత ఈయన వారసుల పాలనాకాలంలో హూణుల దండయాత్రల కారణంగా గుప్తరాజ్యం క్రమంగా బలహీనమై అంతరించింది. హూణ రాజులలో తోరమాణుడు, ఆయన కుమారుడు మిహిరకులుడు ప్రసిద్ధులు. వీరు పర్షియా నుండి మధ్యభారత్‌లోని ఎరాన్ వరకు పాలించారు.

గుప్తుల తర్వాత ఉత్తర భారతదేశాన్ని పాలించిన రాజులలో హర్షుడు ప్రముఖుడు. ఈయన క్రీ.శ. 606 నుండి 41 సంవత్సరాలపాటు గాంధార, సింధు, గుజరాత్, మాళ్వలను పాలించాడు. ఈయన జీవితచరిత్రను "హర్ష చరిత" పేరుమీద బాణుడు అనే మహాకవి రచించాడు. హర్షుని తర్వాత

ఉత్తరభారతంపై పెత్తనం కోసం రాష్ట్రకూటులు, ప్రతీహారులు, పాలరాజులు పోటీపడి నిరంతర యుద్ధాల్లో మునిగితేలారు. దానితో యీ మూడు రాజవంశాలూ బలహీనమై క్రీ.శ. 1000 నాటికి ఒక్కసారిగా అంతరించాయి" అని ముగించారు మాస్టారు.

"గుప్తుల కాలంనుండి క్రీ.శ. 1000 వరకు దక్షిణ భారతదేశ పరిస్థితిని గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగాడు వీరయ్య.

"ఆకాలంలో దక్షిణ భారతదేశాన్ని బాదామి రాజధానిగా చాళుక్యులు, కంచి రాజధానిగా పల్లవులు, మధురై రాజధానిగా పాండ్యులు పరిపాలించారు. చాళుక్యులలో రెండవ పులకేశి, పల్లవులలో మహేంద్రవర్మ, ఈయన కుమారుడు మొదటి నరసింహవర్మ ప్రసిద్ధులు. ఈ మూడు రాజవంశాలవారూ తమలో తాము నిరంతరం కలహించుకొని, బలహీనపడిపోయారు. ఈ కలహాలలో చోళులు కూడ భాగస్వాములై కొన్నిసార్లు గెలుపును, కొన్నిసార్లు ఓటమిని చవిచూశారు. మొత్తానికి అన్ని రాజ్యాలు బలహీనం కావడమనేదే బాధాకరమైన విషయం" అన్నారు మాస్టారు.

" ఆ కాలంనాటి సామాజిక, ఆర్థిక పరిస్థితులు వివరించండి మాస్టారూ!" అడిగింది అంజమ్మ.

"చైనా యాత్రికుడు పాహియాన్ గుప్తుల కాలంలో భారతదేశాన్ని సందర్శించాడమ్మా! ఆయన క్రీ.శ. 405 నుండి 411 వరకు అనేక ప్రాంతాలు తిరిగి, దేశ పరిస్థితిని గూర్చి వ్రాశాడు. అలాగే మరో చైనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ హర్షుని కాలంలో క్రీ.శ. 630 నుండి 643 వరకు భారతదేశ పర్యటన చేసి, అనేక వివరాలను తన యాత్రా పర్యటన విశేషాలుగా వ్రాశాడు. మరోముఖ్యమైన విషయం ఏమిటంటే, గుప్తుల కాలంలో హిందువుల పురాణాలలో ప్రముఖమైన భాగవతం, అష్టాదశ పురాణాలలో కొన్ని వ్రాయబడ్డాయని చరిత్రకారుల పరిశోధనల్లో తేలింది. పై గ్రంథాలూ, మహాకవి బాణుని 'హర్ష చరితమూ' ఆకాలంనాటి సామాజిక ఆర్థిక వివరాలను

తెలుపుతున్నాయి. వివిధ కాలాలలో రాజులు నెలకొల్పిన రాతిశాసనాలు, వారు ముద్రించిన నాణేలూ కూడ అనేక విషయాలు తెలియజేస్తున్నాయి. వాటి ఆధారంతో చరిత్రకారులు కనుగొన్న ముఖ్యమైన విషయం ఏమిటంటే దండయాత్రీకులైన హూణులు, ఆనాటి భారతీయ వర్ణవ్యవస్థలో క్షత్రియులుగా 'రాజపుత్రుల' పేరుతో బ్రాహ్మణ పురోహితులచే చేర్చబడ్డారు.

ఇక సామాజిక అంశాలకు వస్తే, స్త్రీల పరిస్థితి మరింత దిగజారింది. క్రీ.శ. 300 తర్వాత స్త్రీలకు విద్య, ఆస్తిహక్కు నిషేదించబడింది. మరో బాధాకరమైన అంశం ఏమిటంటే గుప్తులకాలంలోనే సతీదురాచారం ఉన్నట్లు చరిత్రకారులకు రుజువులు దొరికాయి. ఇక వర్ణాల తేడా కారణంగా సామాజిక అంతరాలు ఎంత తీవ్రంగా ఉండేదంటే, గుప్తుల కాలంవాడైన వరాహమిహిరుడు నివాస గృహాలను గూర్చి యీ క్రింది విధంగా ఉండాలన్నాడు. బ్రాహ్మణుల గృహాలలో 5 గదులుండాలట. క్షత్రియుల ఇళ్ళలో 4 గదులు మాత్రమే ఉండాలట. వైశ్యుల ఇళ్ళలో 3 గదులు, శూద్రుల ఇళ్ళలో 2 గదులే ఉండాలన్నాడు. బ్రాహ్మణ ఆశ్రమాల్లో నేర్పబడే విద్య బ్రాహ్మణ, క్షత్రియులకు మాత్రమే పరిమితం చేయబడింది. ఇలా అంతరాలు సృష్టించిన పాలకవర్గం, శూద్రులు అసంతృప్తితో తిరగబడకుండా ఉండేందుకు కర్మ సిద్ధాంతాన్ని రూపొందించింది. ఈ సిద్ధాంతం ప్రకారం జనులు తాము పూర్వజన్మలో చేసిన పాప, పుణ్యాల కారణంగా ఈ జన్మలో దరిద్రులుగానో, ధనికులుగానో పుడతారు. ఈ జన్మలో, శూద్రులైనా పుణ్యం చేస్తే, వచ్చే జన్మలో ధనికులుగా పుడతారు. ఈ సిద్ధాంతం ఎంత బాగా పనిచేసిందంటే, శూద్రులు తాము ఈజన్మలో ధనికులపై అసూయాద్వేషాలు లేకుండా సేవజేస్తే, వచ్చే జన్మలో ధనికులుగా పుడతామని నమ్మి, సేవకావృత్తినే ఆనందంగా స్వీకరించారు". అన్నారు మాస్టారు.

"పాపాలు జేసిన వాళ్ళు చనిపోగానే నరకంలో శిక్షలు అనుభవిస్తారని

మన మత గ్రంథాలు చెబుతున్నాయి గదా? శిక్షాకాలం పూర్తి అయి, పాపమంతా పోయిన జీవుడికి మరల దరిద్రుడుగా జన్మించమని చెప్పడం అంటే ఒక తప్పుకు రెండు శిక్షలు వేయడంగదా? ఇది న్యాయమా మాస్టారూ!" అడిగాడు శ్రీను.

"శ్రీనూ! మత నాయకులు చేసిన గొప్పపని ఏమిటంటే, ప్రజలలో ఇలా ఆలోచించగలిగే, శాస్త్రీయ ఆలోచనా విధానాన్ని నాశనం చేయడం. అలా కోట్లాది మంది ప్రజలలో శాస్త్రీయ ఆలోచనా జ్ఞానం నశించి, వారెవరూ ఈ ప్రశ్నను వందలాది సంవత్సరాలుగా వేయలేకపోయారు. అందుకే మత నాయకుల ఆదిపత్యం ఇంకా కొనసాగుతోంది" అని సమాధానమిచ్చారు మాస్టారు.

"అంటరానితనం ఆ కాలంలో ఉండేదా? మాస్టారూ!" అడిగాడు కిరణ్.

"అంటరానితనం ఈ కాలంలో మరింత పెరిగింది కిరణ్! అగ్రకులాలవాళు ళ్ళ అంటరాని వాళ్ళను ఎంత హీనంగా చూసేవారంటే, వాళ్ళ నీడపడితే చాలు అపవిత్రులమై పోయామనుకొనేవాళ్ళు అని చరిత్రకారులు వ్రాశారు" అని వివరించాడు మాస్టారు.

"ఆ కాలంలో మతపరమైన మార్పులేమైనా జరిగాయా మాస్టారూ?" అడిగాడు రాజశేఖర్.

"మతపరంగా గుప్తులకాలంలోనే అన్ని మతాల్లోనూ ఒక ప్రధానమైన మార్పు జరిగింది. అదేమిటంటే విగ్రహారాధన మొదలయింది. బౌద్ధం హీనయాన, మహాయాన బౌద్ధాలుగా చీలిపోయింది. మహాయాన బౌద్ధులు బుద్ధుడిని దైవంగా భావించి, ఆయన విగ్రహాలకు పూజలు ప్రారంభించారు. జైనులు కూడ యీ కాలంలోనే వర్ధమాన మహావీరుడు, ఇతర తీర్ధంకరుల విగ్రహాలను పూజించడం మొదలుపెట్టారు. విచిత్రమయిన విషయం ఏమిటంటే, బుద్ధుడు, వర్ధమానుడు ఇద్దరూ దేవుడు లేడని ప్రకటించిన వారే. ఇక వైదిక

మతస్థులు కూడ అప్పటివరకు చేస్తున్న వాయువు, అగ్ని, వరుణుడు వంటి ప్రకృతి దేవతల ఆరాధన మానివేసి, విష్ణువు, శివుడు వంటి దేవుళ్ళ విగ్రహారాధన మొదలెట్టారు. దేశంలో మొట్టమొదటిదీ, గుప్తులకాలం నాటిదీ, అయిన విష్ణ్వాలయం దియోఘర్ (ఝాన్సి దగ్గర)లో బయటపడింది.

మతపరంగా ఆకాలంలో ప్రజలు సామరస్యంగా ఉండేవారు. గుప్తులకాలంలో బౌద్ధులు, బ్రాహ్మణులు పరస్పరం శాంతి, సఖ్యతలతో జీవించారని పాహియాన్ వ్రాశాడు.

మతపరంగా మరో ముఖ్యమైన విషయం ఈ కాలంలో జరిగింది. అదేమిటంటే, హిందూ మతానికి చెందిన త్రి మతాచార్యుల్లో ఒకరైన శంకరాచార్యులు క్రీ.శ. 8వ శతాబ్దంలో జన్మించారు. ఈయన స్థాపించిన మతం పేరు 'అద్వైతమతం'. అద్వైతం ప్రకారం మన శరీరంలో ఉండే జీవాత్మ, ప్రపంచమంతటా నిండివున్న పరమాత్మ ఒక్కటే. దీనిని మన సామాన్య పరిభాషలో చెప్పాలంటే జీవయ్య, పరమయ్య ఇద్దరూ ఒక్కరే అని చెప్పుకోవలసి ఉంటుంది. ఇదీ అద్వైతమత సారాంశం." అన్నారు మాస్టారు.

"ఆ కాలంనాటి సాహిత్య, శిల్పకళా పోషణలను గూర్చి చెబుతారా మాస్టారూ!" అడిగింది. శాంతి.

"ఆకాలంలో సాహిత్యమూ, శిల్పకళా అత్యున్నత శిఖరాలకు చేరిందమ్మా! మహాకవి కాళిదాసు యీ కాలం వాడే. ఈయన 'మేఘసందేశం' అభిజ్ఞాన శాకుంతలం' వంటి గొప్ప గ్రంథాలు రచించాడు. భారవి 'కిరాతార్జునీయం', మాఘుని 'శిశుపాలవధ', భవభూతి 'మాలతీమాధవం' గ్రంథాలు ఈ కాలంనాటివే. భర్తృహరి, అమరుడు ఈకాలంవారే. శూద్రకుని 'మృచ్ఛకటికం', విశాఖదత్తుని 'ముద్రా రాక్షసము', సుబంధుని 'వాసవదత్త', బాణుని 'హర్షచరిత' ఈ కాలంనాటి ప్రసిద్ధిచెందిన గ్రంథాలు. ప్రాకృత భాషలో రచించబడిన 'పౌమాచరియం' రామకథను జైన దృక్పథంలో చెప్పబడిన గ్రంథం. ఈ గ్రంథం

అనేక అంశాలలో వాల్మీకి రామాయణంతో విభేదిస్తుంది. ఇక ఆకాలం నాటి రాజుల శిల్పకళా పోషణను పరిశీలిస్తే 7వ శతాబ్దంలో పల్లవరాజైన మొదటి మహేంద్రవర్మ మహాబలిపురంలో అనేక రాతిరథాలు, కట్టడాలు చెక్కించాడు. క్రీ.శ. 7వ శతాబ్ది ప్రాంతంలో రాష్ట్రకూటరాజు మొదటి కృష్ణుడు ఎల్లోరాలో నిర్మించిన కైలాసనాథ్ రాతి దేవాలయం ప్రపంచ వింతలలో ఒకటిగా పేర్కొనబడదగినది. ఈ దేవాలయాన్ని ఒకే కొండను తొలిచి, రెండంతస్తుల రాతి దేవాలయంగా శిల్పులు చెక్కారు. ఇవీ ఆకాలంనాటి సాహితీ, శిల్పకళా విశేషాలు" అని వివరించారు మాస్టారు.

"ఆకాలంనాటి శాస్త్రవిజ్ఞాన విశేషాలు చెప్పండి మాస్టారూ!" అడిగాడు సూర్య.

"క్రీ.శ. 6వ శతాబ్దం నుండి కొన్ని వందల సంవత్సరాల పాటు భారతదేశం శాస్త్రవిజ్ఞాన విషయాలలో గొప్ప పరిశోధనలు చేసిన మహాశాస్త్రజ్ఞులకు నిలయమైంది. ఆకాలంనాటి ఖగోళ, గణిత శాస్త్రజ్ఞుడు ఆర్యభట్టు 'భూమి ఒక గోళమని, అది అంక్షాంశపై తిరుగుతూ ఉంటుందనీ, భూమి నీడ చంద్రునిపైబడి గ్రహణం ఏర్పడుతుందనీ' చెప్పాడు. ఆర్యభట్టు సూర్య సంవత్సరం 365.3586805 రోజులని లెక్కగట్టాడు. అది ఈనాటి లెక్కలకు దాదాపుగా సరిపోయింది. అలాగే ఈయన గణితశాస్త్రంలో 'పై' విలువను 3.1416 గా లెక్కగట్టాడు.

6వ శతాబ్దంవాడే అయిన వరాహమిహిరుడు గొప్ప ఖగోళ శాస్త్రవేత్త. ఈయన కూడ భూమి గోళాకారంగా ఉన్నదనీ, అది తనపై ఉన్న అందరినీ ఆకర్షిస్తున్నదనీ వివరించాడు.

బ్రహ్మగుప్తుడనే మరో ఖగోళ, గణిత శాస్త్రవేత్త 7వ శతాబ్దంవాడు. ఈయన ఆర్యభట్టులాగే భూమి ఒక గ్రహమని సూత్రీకరించాడు. గణిత శాస్త్రానికి ఈయన చేసిన గొప్పసేవ ఏమిటంటే, ఈయన సున్నా(0) ను కనుగొన్నాడు.

ఈయన కనుగొన్న యీ విషయం భారతీయ గణితశాస్త్రానికి ఎంతో కీర్తిని సంపాదించిపెట్టింది. మొట్టమొదటగా సున్నాను ఉపయోగించిన రాతిశాసనం క్రీ.శ. 7వ శతాబ్దిది కావడం బ్రహ్మగుప్తుడు సున్నాను కనుగొన్నాడని నిరూపిస్తోంది. ఇవీ ఆ కాలంనాటి శాస్త్రవిజ్ఞాన పరిశోధనా ఫలితాలు" అని వివరించాడు మాస్టారు.

"సైన్సులో ఇన్ని విజయాలు సాధించాముగదా? ఆకాలంలో మూఢనమ్మకాలు లేవా మాస్టారు?" అడిగింది ఇంద్రాణి.

"లేకేమమ్మా! ఉన్నాయి. దేశంలో తరచుగా వచ్చే క్షామాలకూ, తమ దరిద్రానికీ వాస్తవ కారణాలను గూర్చి సామాన్య ప్రజలు ఆలోచించేవారుకాదు. వాటికి కారణాలను జ్యోతిశ్శాస్త్రం లో వెతికేవారు. ఇది కలియుగం కాబట్టి, తమకు ఇంతకంటే మంచిరోజులు ఉండవని తమను తాము సమాధానపరచుకొని, దారిద్ర్య నిర్మూలన కోసం ఏ ప్రయత్నమూ చేసేవారు కాదు. అలా వారు జ్యోతిశ్శాస్త్రజ్ఞుల, అగ్రవర్ణాల విషకౌగిలిలో ఇరుక్కుపోయి తమ ఉన్నతి కోసం ఏమాత్రం ప్రయత్నించేవారు కాదు." అని చెప్పారు మాస్టారు.

"ఆనాటి ప్రజల్లో, పాలకుల్లో మత సామరస్యం బాగా ఉండేదా మాస్టారూ?" అడిగాడు సిద్దూ.

"సిద్దూ! ప్రజల్లో మతసామరస్యం బాగా ఉండేది. కాని ఆనాటి పాలకులు మత దురహంకారం చూపేవారు. శతృదేశాలపై దండెత్తినప్పుడు మతదురహంకారంతో, ఆ రాజ్యంలోని దేవాలయాలను ధ్వంసం చేసేవారు. విగ్రహాలను పెకలించి తీసుకువచ్చి, తమ ఖజానాలో కలిపివేశేవారు. దానికి కొన్ని రుజువులిస్తాను. వినండి.

1) చోళులు, పాండ్యులు నిరంతరం పరస్పరం కలహించుకోవడం, ఆలయాలను కూడా వదలకుండా పట్టణాలను కొల్లగొట్టడంవల్ల ఈ రాజ్యాలు బలహీనమైనాయి. (మధ్యయుగాల భారతదేశం, రచన : ప్రొ. సతీష్‌చంద్ర; పేజీలు ; 27,28)

2) కాశ్మీర్ పాలకులు దేవాలయాలను కొల్లగొట్టారనీ, వారిలో ఒకడైన హర్షదేవుడు దేవాలయాల విధ్వంసాన్ని పర్యవేక్షించాడానికి అధికారులను

నియమించాడనీ, కల్హణుడు వ్రాశాడు. (భారతదేశ చరిత్ర; రచన : ప్రొ. రొమిల్లాథాపర్; పేజి : 509)

3) మాళ్వాను పాలించిన పరమార పాలకుడైన సుభటవర్మ, చాళుక్యులను ఓడించిన అనంతరం, చాళుక్యులు జైనుల కొరకు నిర్మించిన ఆలయాన్ని అరబ్బుల కొరకు నిర్మించిన మసీదునూ ధ్వంసం చేశాడు. (భారతదేశ చరిత్ర; రచన : ప్రొ. రొమిల్లాథాపర్; పేజి : 509)

4) 9వ శాతాబ్దిలో పాండ్యరాజు శ్రీమార శ్రీవల్లభుడు శ్రీలంకపై దాడిచేసి, మొదటి సేన అనే రాజును ఓడించాడు. బౌద్ధ సన్యాసీ, చరిత్రకారుడూ అయిన ధర్మకొట్టి, ఆ యుద్ధాన్ని గూర్చి ఇలా రాశాడు. "అతడు అనేక విలువైన వస్తువులను తొలగించాడు. ఆభరణాల భవంతిలో ఉన్న బంగారు బుద్ధ విగ్రహాన్నీ, బుద్ధ మఠాలలో ఉన్న బంగారు విగ్రహాలనూ తరలించుకుపోయాడు."

మొదటి సేనుడి తర్వాత రాజ్యానికి వచ్చిన రెండవ సేనుడు, పాండ్య రాజధానియైన మధురై పై దాడిచేసి, పాండ్యరాజును ఓడించి, బంగారు విగ్రహాలను మరల తన దేశానికి తరలించుకుపోయాడు. (7వ తరగతి సోషల్ స్టడీస్ టెక్స్ట్ బుక్ నుండి; సంపాదకురాలు : ప్రొ॥ ఐ. లక్ష్మి: పేజి. 210).

5) 10 శతాబ్ది తొలికాలంలో రాష్ట్రకూటరాజు మూడవ ఇంద్రుడు, ప్రతీహారులను ఓడించినప్పుడు, 'కల్పన'లోని ప్రతీహార దేవాలయాన్ని నాశనం చేశాడు. (భారతదేశ చరిత్ర; రచన: ప్రొ. రొమిల్లాథాపర్; పేజి. 509).

పిల్లలూ! ఇవీ ప్రాచీన భారతదేశ చరిత్రకు సంబంధించిన విశేషాలు. క్రీ.శ. 934లో కాకర్త్యగండన అనే రాజు, ఆంధ్రదేశంలో కాకతీయ రాజ్యాన్ని స్థాపించడంతో, ప్రాచీన భారతదేశ చరిత్ర ముగిసి, మధ్యయుగాల భారతదేశ చరిత్రలో దక్షిణ భారతదేశ చరిత్ర మొదలవుతుంది. ఆ చరిత్రను వచ్చే క్లాసు నుండి తెలుసుకుందాం" అంటూ మాస్టారు లేచారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 13వ భాగం. కాకతీయ వీరులు - పల్నాటి యోధులు

"పిల్లలూ! భారతదేశ చరిత్రలో ఇప్పుడు కాకతీయులను గూర్చి తెలుసుకుందాం. తెలుగువారి చరిత్రలో ప్రసిద్ధిగాంచిన రాజులలో కాకతీయులు ఒకరు. వీరు తెలుగు భాషాప్రాంతాన్ని క్రీ.శ. 934-1328 మధ్య పరిపాలించారు. కాకతీయులలో రెండవ ప్రోలరాజు, రుద్రదేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు ముఖ్యులు. రెండవ ప్రోలరాజు క్రీ.శ. 1115-1158 మధ్య తెలంగాణ అంతటినీ పరిపాలించాడు. ఈయన జైనమతం నుండి వీరశైవంలోకి మారాడు. క్రీ.శ. 1158లో వెలనాటి చోడరాజైన గొంకరాజుతో జరిగిన పోరాటంలో రెండవ ప్రోలరాజు మరణించాడు. ఈయన తర్వాత ప్రసిద్ధుడైన కాకతీయ రాజు రుద్రదేవుడు. ఈయన పల్నాటియుద్ధంలో నాయకురాలు నాగమ్మకు సహాయంగా రెండువేల గుర్రపు రౌతులను పంపాడు. ఈయన తర్వాత కాకతీయ రాజులలో గణపతిదేవుడు ప్రసిద్ధుడు. ఈయన క్రీ.శ. 1198 నుండి 1262 వరకు కాకతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. గణపతిదేవుడు ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు మొత్తాన్నీ పాలించాడు. గణపతిదేవుని తర్వాత, ఆయన కుమార్తె రుద్రమదేవి క్రీ.శ. 1262 నుండి 1296 వరకు పరిపాలించింది. ఈమె కూతురు కొడుకైన ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1296-1328 ల మధ్య పాలించాడు. ఈయన హయాంలో క్రీ.శ. 1303లో, అల్లావుద్దీన్ ఖిల్జి యొక్క సైన్యాధిపతి మాలిక్ కాఫర్ కాకతీయ రాజ్యంపై దాడిచేసి, ఘోరంగా ఓడిపోయి వెనుదిరిగాడు. మరల 1309లో రెండవసారి మాలిక్ కాఫర్ చేసిన దాడిలో ఎవరికీ విజయం సిద్ధించలేదు. ప్రతాపరుద్రుడు మహమ్మదీయులకు విశేషంగా ధనమిచ్చి సంధి చేసుకున్నాడు. కాని 1328లో ఢిల్లీ పాలకుడైన గియాసుద్దీన్ చేసిన దాడిలో, ప్రతాపరుద్రుడు ఘోరంగా ఓడిపోయి, ఖైదు చేయబడ్డాడు. ఖైదీగా ఉండగానే

ప్రతాపరుద్రుడు ఆత్మహత్య చేసుకున్నాడు. దానితో తెలుగునాడు మొత్తాన్ని పరిపాలించిన కాకతీయ సామ్రాజ్యం అంతరించింది." అని ముగించారు విశ్వం మాస్టారు.

ఒక్క నిముషం క్లాసంతా నిశ్శబ్దం.

"మాస్టారూ! ఆకాలంలోని ఆర్థిక, సాంఘిక పరిస్థితులను వివరించండి" అడిగాడు తేజ.

"కాకతీయుల సుస్థిర పరిపాలన కారణంగా, తెలుగునాట వ్యవసాయం, విదేశీ వాణిజ్యంతో సహా వర్తక, వాణిజ్యాలు, నేత పరిశ్రమ అభివృద్ధి చెందాయి. కాకతీయులు తవ్వించిన రామప్ప చెరువు, పాకాల చెరువు, లక్నవరం చెరువు వంటి చెరువుల వలన వ్యవసాయం బాగా అభివృద్ధి అయింది. ఆకాలంలో గుంటూరు జిల్లాలోని మోటుపల్లి సుప్రసిద్ధ రేవు పట్టణంగా ఉండి, విదేశీ వాణిజ్యానికి సింహద్వారంగా ఉండేది. ఇచ్చటి నుండి సన్నని దారంతో నేయబడిన మల్లుసెల్లాలు, తివాచీలు విదేశాలకు విస్తారంగా ఎగుమతి అవుతూ ఉండేవి. క్రీ.శ. 14వ శతాబ్దంలో ఆంధ్రదేశ సంచారం చేసిన మార్కోపోలో అనే విదేశీ యాత్రికుడు వాటిని గూర్చి ఏమని వ్రాశాడంటే, 'కాకతీయ రాజ్యంలో శ్రేష్టమైన, సన్నసైన వస్త్రములు నేయబడుతుండేవి. వీని ధర చాలా ప్రియము. ఆ వస్త్రములను ధరింపననే రాజుగానీ, రాణీగానీ ప్రపంచంలో ఎవరూ ఉండరు." అని వ్రాశాడు.

సాంఘిక జీవనానికి సంబంధించి, కుల విద్వేషాలు పెరగనంత వరకు రాజకీయ సుస్థిరత్వం బాగున్నది. కాని ప్రతాపరుద్రుడిలో దూరదృష్టి లోపించి, అన్ని కులాలకూ సమాన ప్రాతినిధ్యం అనే విధానాన్నుండి వైదొలగి, వెలమ నాయకులకు ప్రాధాన్యత నిచ్చినందువలన, రెడ్డి, కమ్మ కులాలకు చెందిన నాయకులు ఆయన ఎడల ద్వేషభావం పెంచుకొని, ముస్లిం దండయాత్రల సమయంలో మనస్ఫూర్తిగా పోరాడక పోవడంతో కాకతీయ రాజ్యం

పతనమైంది". అని వివరించారు మాస్టారు.

"మాస్టారూ! కాకతీయుల కాలంనాటి మతపరమైన పరిస్థితులను వివరించండి" అడిగాడు జహంగీర్.

"రెండవ ప్రోలరాజు జైనమతం నుండి వీరశైవ మతంలోనికి మారాడని చెప్పానుగదా? ఆ తర్వాతి కాకతీయ రాజులందరూ వీరశైవాన్నే ఆదరించారు. జైనమత విద్వేషాన్ని ప్రోత్సహించారు. వీరి కాలంలో అనేక జైన దేవాలయాలు శైవ దేవాలయాలుగా మారినవి. హనుమకొండలోని చరిత్ర ప్రసిద్ధమైన పద్మాక్షి దేవాలయం జైనులది. జైన మతస్థుల చిత్రాలు, విగ్రహాలు ఇప్పటికీ అక్కడ ఉన్నాయి. కాకతీయుల కాలంలో అది శైవ ఆలయంగా మార్చబడింది. క్రీ.శ. 1250 ప్రాంతంలో అధర్వుడనే జైనకవిచే తెలుగు చేయబడ్డ భారతంలోని మూడు పర్వాలు మత విద్వేష పిశాచికి ఆహుతి అయ్యాయి. రుద్రదేవుని కాలంలో జీవించిన పాల్కురికి సోమనాధుడు రచించిన 'పండితారాధ్య చరిత్ర', 'బసవపురాణం' ల్లో శైవమత ప్రచారకులు ఏవిధంగా అన్యమతస్థులను హింసించిందీ స్వోత్కర్షా పూర్వకంగా వర్ణించబడ్డాయి. విశేషం ఏమిటంటే, పై గ్రంధాలు బ్రాహ్మణాధిక్యతను నిరసించాయి. వేదాలను, కర్మసిద్ధాంతాన్ని వ్యతిరేకించాయి. ఉదాహరణకు యీ క్రింది కవితను వినండి.

"వేదభరాక్రాంతులనగబడిన
బ్రాహ్మణ గార్దభంబులతోడ
బ్రతిసేసి యాడిన పాపంబువచ్చు."

అంటే "వేదముల యొక్క బరువును మోయుచున్న గాడిదల వంటి బ్రాహ్మణులతో చర్చించుటే పాపము" అని అర్థం.

అలాగే " కాన దైవంబులు కావు వేదములు" అనీ,

"వేదంబు దైవమేనియును

చెపుమా ఒక

దైత్యునిచే మ్రింగబడునె” అనీ చెప్పసాగారు.

అంటే “వేదాలు దైవం అయితే ఒక రాక్షసుని చేత మ్రింగబడతాయా?” అని అర్ధం.

మరో వికృత విషయం ఏమిటంటే, బసవేశ్వరుని వీరశైవ ప్రచారకులైన జంగములో కొందరు మిండ జంగములుండేవారు. వారు సాధారణ నీతి సూత్రములకు కట్టుబడేవారు కాదు. మత ప్రచారమే వారి లక్ష్యం.

ఇలా కాకతీయుల కాలంలో వీరశైవ ప్రచారమూ, అన్యమత నిందా, పరమత నాశనమూ చాలా పెద్ద ఎత్తున జరిగింది. అంతేకాదు. ఆకాలంలో కొన్ని మతపరమైన భయంకర మూఢనమ్మకాలు ఉండేవి. వీరభద్రుడు, దుర్గ మొదలైన దేవతల తృప్తికోసం భక్తులు తమ తలలను బలియిచ్చే ఆచారం ఉండేది.” అన్నారు మాస్టారు. పిల్లలంతా శ్రద్ధగా వింటున్నారు.

“పిల్లలూ! మరికొన్ని వివరాలు చెబుతాను వినండి”

క్రీ.శ. 1016లో ప్రఖ్యాత వైష్ణవ మత నాయకుడు రామానుజాచార్యులు జన్మించాడు. ఈయన 121 సంవత్సరాలు బ్రతికి క్రీ.శ. 1137లో జీవనం చాలించాడు. ఈయన 8వ శతాబ్ది నాటి మత నాయకుడైన శంకరాచార్యుల అద్వైత సిద్ధాంతాన్ని తిరస్కరించి, విశిష్టాద్వైతాన్ని ప్రతిపాదించాడు. దాని ప్రకారం జీవాత్మ, పరమాత్మ వేర్వేరే గాని జీవాత్మ పరమాత్మలో కలుస్తుంది. ఒక ఉదాహరణగా చెప్పాలంటే జీవయ్య, పరమయ్య వేర్వేరేగాని జీవయ్య పరమయ్యలో కలుస్తాడు. శంకరాచార్యులు జీవయ్య, పరమయ్య ఒకరే అని చెప్పాడని ఇంతకు ముందు క్లాసులో చెప్పానుగదా?”

పిల్లలూ! ఆ కాలంలోనే, జైనమతాన్ని నాశనంచేసి, వీరశైవ మతాన్ని ప్రచారం చేసిన మల్లిఖార్జున పండితారాధ్యుడు క్రీ.శ. 1100లో జన్మించి

1170 వరకు జీవించాడు. ఈయన శివతత్వసారము అనే గ్రంధాన్ని రచించాడు. దానిలో శివనింద చేసేవారిని చంపమని ఉద్భోదించాడు. దానికి సంబంధించిన ఒక పద్యాన్ని వివరిస్తాను వినండి.

పద్యం : శివనిందా విషయంబగు

నవమానము చెప్పునట్టి యప్పుస్తకముల్

అవిచారంబుగ కాల్పగ

నవు చెప్పెడివానిజంపనగు నీశానా!

అంటే "శివుని నిందించే విషయాలు వ్రాయబడినట్టి పుస్తకములను కాల్చివేయవలెను. అలా చెప్పెడి వానిని చంపవచ్చును" అని ఆ పద్యం యొక్క తాత్పర్యం. అలా ఉండేవి ఆకాలంనాటి మత విద్వేషాలు.

అలాగే వేంగీ చాళుక్య రాజైన రాజరాజనరేంద్రుడు కూడ వీరశైవాన్నే ఆదరించాడనీ, వేంగీ నుండి వరంగల్ పారిపోయివచ్చిన జైనులను ఊచకోత కోశాడనీ ఓరుగల్లు కైఫీయతు తెలియజేస్తోందని ప్రొ॥ బి. ఎస్.ఎల్. హనుమంతరావు తెలిపారు.

పిల్లలూ! మధ్యయుగాల మొదట్లో, మన తెలుగువారందరూ తెలుసుకోవలసిన, గుణపాఠం తీసుకోవలసిన ఒక గొప్ప యుద్ధం జరిగింది. అదేమిటో తెలుసా?" అడిగారు మాస్టారు.

క్లాసంతా మౌనం. ఒక నిమిషం తర్వాత ప్రవీణ్ చేయెత్తాడు. చెప్పమన్నట్లుగా మాస్టారు సైగ చేశారు.

"పల్నాటియుద్ధం మాస్టారూ!" అన్నాడు ప్రవీణ్.

"అవును ప్రవీణ్! పిల్లలూ! ఇప్పుడు మీకు పల్నాటి యుద్ధాన్ని గూర్చి వివరిస్తాను వినండి.

క్రీ.శ. 1170 ప్రాంతంలో గురజాలను రాజధానిగా చేసుకొని పరిపాలించిన నలగామరాజుకు, అతని సవతి తమ్ముడైన మలిదేవరాజుకు రాజ్యాధికారం కోసం కలహం ప్రారంభమైంది. నలగామరాజు మంత్రి బ్రహ్మనాయుడు మలిదేవరాజు పక్షం వహించి, మాచెర్ల రాజ్యాన్ని వారికి ఇప్పించి, తనుకూడా వారితోబాటు మాచర్లకు వెళ్ళిపోయాడు. రాజు మలిదేవరాజైనా, పెత్తనం అంతా బ్రహ్మనాయుడిదే.

బ్రహ్మనాయుడు వెళ్ళిపోయిన తర్వాత, నలగామరాజు నాగమ్మ అనే స్త్రీని మంత్రిణిగా నియమించుకున్నాడు.

బ్రహ్మనాయుడు వైష్ణవమతాభిమాని. కులభేదాలను పాటించక సహపంక్తి భోజనాలను ఏర్పాటుచేశాడు. దళిత కులస్థుడైన కన్నమనీడును ప్రధాన సేనానిని చేశాడు. బ్రాహ్మణ సేనాని అనపోతుతో సహా పల్నాటి వీరులు 'చాపకూడు' భోంచేశారు. ప్రజలలో  బ్రహ్మనాయుడు పై అభిమానం పెరగసాగింది.

నాగమ్మ శైవమతాభిమాని. ఈమెను నాయకురాలు నాగమ్మ అని పిలిచేవారు. ప్రజలలో వైష్ణవుడైన బ్రహ్మనాయుడుపై అభిమానం పెరగడాన్ని నాగమ్మ సహించలేకపోయింది. బ్రహ్మనాయుడినీ, అతని వర్గాన్నీ కష్టాలపాలు చేయాలనే ఉద్దేశ్యంతో కోడిపందాలు ఏర్పాటుచేసి, వాటిలో మోసం ద్వారా జయించింది. ఒప్పందం ప్రకారం బ్రహ్మనాయుడు, మలిదేవరాజు తమ పరివారంతో కృష్ణను దాటి, అరణ్యప్రాంతంలో వీరమేడపి అనే గ్రామం నిర్మించుకొని, 7 సంవత్సరాలు గడిపారు. గడువు ముగిసినప్పటికీ, మాచెర్ల రాజ్యాన్ని  ఇవ్వడానికి నాయకురాలు నాగమ్మ, నలగామరాజులు నిరాకరించడంవల్ల, ఉభయ సైన్యాలకు కారంపూడిలో క్రీ.శ. 1192లో ఘోర యుద్ధం జరిగింది. విజయం బ్రహ్మనాయుడుకే లభించింది కాని అతని బంధువులు, అనుచరులు, మలిదేవరాజుతో సహా అందరూ మరణించారు. దానితో బ్రహ్మనాయుడు విరక్తిచెంది, రాజ్యం మొత్తాన్ని తిరిగి నాయకురాలికే

వదలివేసి, అడవులలోకి వెళ్ళిపోయాడు.” అని ముగించారు మాస్టారు.

“మధ్య యుగాల ప్రారంభంలో, దక్షిణ భారతదేశాన్ని పాలించిన పాలకులను గూర్చి మరికొన్ని వివరాలు చెప్పండి మాస్టారూ!” అడిగాడు కార్తీక్.

“మధ్య యుగాల ప్రారంభంలో, దక్షిణ భారతదేశాన్ని పాలించిన వారిలో ప్రముఖులను గూర్చి ముచ్చటిస్తాను. చోళరాజులైన రాజరాజచోళుడు క్రీ.శ. 985 నుండి 1014 వరకు, అతని కుమారుడు ఒకటవ రాజేంద్రుడు 1014 నుండి 1044 వరకు పాలించారు. రాజరాజనరేంద్రుడనే వేంగి చాళుక్యరాజు క్రీ.శ. 1022 నుండి 1070 వరకు పాలించాడు.

పిల్లలూ! ఇవీ కాకతీయుల కాలంనాటి దక్షిణ భారతదేశ పరిస్థితులు. అంటే మధ్యయుగాల నాటి తొలినాళ్ళ విశేషాలు. వచ్చే క్లాసులో, దక్షిణ భారతదేశ చరిత్రలో మరో ముఖ్య ఘట్టమైన విజయనగర సామ్రాజ్య వివరాలు చెబుతాను.” అంటూ ముగించి లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టార్ని అనుసరించారు.



# 14వ భాగం. విజయనగర సామ్రాజ్యం

"పిల్లలూ! దక్షిణ భారతదేశ చరిత్రలోని అతి ముఖ్య ఘట్టమైన విజయనగర రాజ్య పరిపాలనా, ఆకాలంనాటి ఆర్థిక, సామాజిక, మతపరమైన పరిస్థితులను గూర్చి యీ రోజు తెలుసుకుందాం" అంటూ మొదలెట్టారు మాస్టారు.

"తెలుగునాడును 300 సంవత్సరాలు పాటు ఏలిన విజయనగర సామ్రాజ్యం 1336లో స్థాపించబడింది. ఈ సామ్రాజ్యాన్ని హరిహరరాయులు, బుక్కరాయులు అనే సోదరులు స్థాపించారు." అన్నారు మాస్టారు.

"విజయనగర సామ్రాజ్య పరిపాలకులను గూర్చి చెప్పండి మాస్టారూ!" అడిగాడు వెంకయ్య.

విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన రాజులలో శ్రీకృష్ణదేవరాయులు ప్రముఖుడు. ఈయన 1509 నుండి 1530 వరకు ఈ సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. ఈయన గొప్ప సేనాని; బహుభాషా కోవిదుడు; కవి; రాజ్యతంత్రజ్ఞుడు. పరిపాలనలో ప్రజానుకూలమైన అనేక సంస్కరణలు చేపట్టాడు. 'ఆముక్తమాల్యద' అనే గ్రంధాన్ని రచించాడు. శ్రీకృష్ణదేవరాయులు అనేక దండయాత్రలు చేసి తన సామ్రాజ్యాన్ని చాలా విస్తరించాడు. ఈయన సామ్రాజ్యం దక్షిణాన శ్రీరంగపట్నం, తంజావూరు, మధురై, జింజి వరకూ, ఉత్తరాన సింహాచలం, కటక్ వరకూ విస్తరించింది. ఈ దండయాత్రలలో శ్రీకృష్ణదేవరాయులు కటకాన్ని పూర్తిగా ధ్వంసంచేసి, కటకాధిపతి కూతురును వివాహం చేసుకున్నాడు.

పిల్లలూ! ఇక్కడ ప్రస్తావన చేయవలసిన మరో ముఖ్య విషయం ఏమిటంటే, విజయనగర సామ్రాజ్యం స్థాపించబడిన తర్వాత కొద్ది సంవత్సరాలలో, అంటే 1347లో ఈ సామ్రాజ్యానికి ఉత్తరాన, అల్లాఉద్దీన్

హసన్ బహమన్‌షా అనే వ్యక్తి బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. ఈయననే హసన్‌గంగూ అని చరిత్రకారులు పిలిచారు.

ఈ బహమనీ రాజ్యంతో విజయనగర రాజ్యం కొంతకాలం స్నేహం, మరికొంతకాలం వైరం కలిగి ఉంది. కృష్ణదేవరాయుల కాలం నాటికి బహమనీ రాజ్యం బీజాపూర్, అహ్మద్‌నగర్, బీదర్, బీరార్, గోల్కొండ అని ఐదు రాజ్యాలుగా చీలిపోయింది. చీలిపోకముందు బహమనీ సుల్తానులు, పద్మనాయకులు కలిసి అనేక పర్యాయాలు విజయనగర రాజుల మీద, కొండవీటి రెడ్డి రాజుల మీద దండయాత్రలు చేశారు. ఆ కాలంలో దండయాత్రలకు మతం కారణం కాదనేందుకు ఇదో రుజువు. మరో రుజువు ఏమిటంటే విజయనగర రాజులలో దేవరాయ-1 తన సైన్యంలో 10,000 మంది ముస్లిములను కలిగి ఉండేవారనీ, దేవరాయ-2 తన సైన్యంలోకి 2,000 మంది ముస్లిములను చేర్చుకున్నాడనీ ప్రొ॥ రొమిల్లాథాపర్ పేర్కొన్నారు. అలాగే ప్రశాంత పరిపాలనకు కూడా మతం అవరోధం కాలేదు. బహమనీ రాజులలో ఒకడైన ఫిలోజ్‌షా బహమనీ, పరిపాలన కొరకు అనేకమంది బ్రాహ్మణులను నియమించాడు. ముఖ్యంగా రెవిన్యూ పరిపాలనలో బ్రాహ్మణులదే పైచేయిగా ఉండేదని ప్రొ॥ రొమిల్లాథాపర్ తెలియజేశారు. ఐతే బహమనీ రాజ్యాల మధ్య కృష్ణదేవరాయల కాలం నాటికి ఉన్న అంతఃకలహాలు కూడ రాయల సామ్రాజ్య విస్తరణకు అనుకూల పరిస్థితులను కల్పించాయి. కృష్ణదేవరాయుల అనంతరం, అళియ రామరాయల హయాంలో, 1565లో, బహమనీ రాజ్యాలన్నీ ఏకమై, విజయనగర సామ్రాజ్యంతో జరిగిన తళ్ళికోట యుద్ధంలో, రామరాయలు వధించబడి, విజయనగర సైన్యాలు ఓడిపోవడంతో, విజయనగర సామ్రాజ్య వైభవం అంతరించింది. క్రమంగా క్షీణించి 1675లో ఈ సామ్రాజ్యం అంతమైంది". అని చెప్పారు మాస్టారు.

"విజయనగర రాజుల కాలం నాటి ఆర్థిక, సామాజిక, మతపరమైన పరిస్థితులు వివరించండి మాస్టారూ!" అడిగాడు డేనియల్.

"విజయనగర రాజులు వ్యవసాయాభివృద్ధి కోసం అనేక చెరువులు తవ్వించారు. బుక్కరాయ చెరువు, నాగవ్వ చెరువు, బిచ్చపు చెరువు, మొదలైన రాయలసీమ చెరువులు ఆకాలంలో త్రవ్వబడినవే. తుంగభద్రానదిపై విజయనగరానికి 18 కి.మీ. దూరంలో మొదటి దేవరాయులు ఒక ఆనకట్టనూ, కొర్రగల్లు వద్ద కృష్ణదేవరాయులు మరొక ఆనకట్టనూ కట్టించారు. కొర్రగల్లు ఆనకట్ట నిర్మాణానికి పోర్చుగీసు ఇంజనీర్లు తోడ్పడ్డారు. విదేశీ యాత్రీకులైన పేస్, న్యూనిజ్ ల ప్రకారం కృష్ణదేవరాయల వద్ద పది లక్షల మంది సైనికులున్నారు. వీరి పోషణకోసం ప్రజలపై పన్నుల భారం ఎక్కువగా ఉండేది. భూమి శిస్తుకు అదనంగా ఇతర పన్నులు కూడా ఉండేవి. ఆస్తిపన్ను, అమ్మకం పన్ను, వృత్తి పన్ను, సైనిక విరాళం (యుద్ధ సమయాలలో), వివాహ పన్ను, ఇలా వివిధరకాల పన్నులుండేవి. సామాన్య రైతులు చాలా కష్టాలు పడేవారు. అయినా వర్తకులు బాగా ధనవంతులుగా ఉండేవారు. వారు నివాసముండే వీధులలో కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు కుప్పలుగా పోసి అమ్మేవారు. నికితిన్ అనే విదేశీ యాత్రికుడు ఇలా వ్రాశాడు: "విజయనగర సామ్రాజ్యంలో భూమి అంతా ప్రజలతో నిండిపోయి ఉంది. అయితే గ్రామీణులు సాధారణ జీవితాన్ని గడుపుతుండగా, నగరాల్లో నివసించే ఉన్నతాధికారులు, సంపన్నులు కావడంచేత విలాసాల్లో మునిగితేలుతున్నారు." ఇదీ విదేశీయాత్రీకుల ద్వారా మనకు తెలిసిన ఆనాటి ఆర్థిక పరిస్థితి. సాంఘిక విషయాలలో ముఖ్యమైన విషయం ఆనాడు పురుషులలో బహు భార్యాత్వం ఉండేది.

ఇక మతపరమైన విషయాలకు వస్తే, విజయనగర రాజులు మతసహనం పాటించేవారు. విజయనగర రాజులలో రెండవ వాడైన బుక్కరాయల కాలంలో కొందరు వైష్ణవులు శ్రావణబెళగళ లోని గోమతేశ్వరుడి దేవాలయాన్ని ధ్వంసంచేయగా, బుక్కరాయలు వైష్ణవుడైనప్పటికీ, ఆ జైనాలయాన్ని వైష్ణవులే

తిరిగి కట్టించిఇచ్చునట్లు తీర్పు ఇచ్చాడు.

మొత్తంమీద విజయనగర రాజుల కాలంలో రాజులు అహంభావ పూరితులనీ, వారిసేవ ప్రాణహానికరమనీ ప్రజలు భావించేవారు. అందుకే ఆకాలంనాటి మహాకవి ధూర్జటి 'రాజుల్మత్తులు, వారిసేవ నరకప్రాయంబు' అనీ, 'నరనాథాశ్రయము ప్రాణహానిదాయకమ'నీ వ్రాశాడు.

ఇక ప్రజల విషయానికి వస్తే, ప్రజలలో మూఢనమ్మకాలు బాగా ఉండేవి. వారిలో ముష్టి,మైలారు వీరభటులు అనే సాహసికులు ఉండేవారనీ, దేవుని రథం నడుస్తుంటే, ఆ రథచక్రాల క్రిందబడి, నలిగి చనిపోవడం మోక్షదాయకంగా వీరు భావించేవారనీ, విజయనగరంలో తాను ఇలాంటి సంఘటనను స్వయంగా చూచాననీ, నికోలో డికాంటీ అనే విదేశీయాత్రికుడు వ్రాశాడు. ఇవీ పిల్లలూ! విజయనగర రాజుల కాలంనాటి విశేషాలు." అన్నారు మాస్టారు.

"విజయనగర రాజ్య స్థాపన హిందూ ధర్మరక్షణ కోసమని అంటారు నిజమేనా మాస్టారూ?" అడిగాడు సుఖదేవ్.

"ఆ విషయాన్ని వచ్చే క్లాసులో వివరిస్తాను సుఖదేవ్!" అని క్లాసు ముగించారు మాస్టారు.



# 15వ భాగం. విజయనగర సామ్రాజ్య స్థాపన హిందూ ధర్మరక్షణ కొరకేనా?

"సుఖదేవ్! విజయనగర సామ్రాజ్య స్థాపన హిందూ ధర్మ రక్షణ కొరకేనా? అని అడిగావు కదా? సమాధానం చెబుతాను విను" అంటూ క్లాసు మొదలెట్టారు విశ్వం మాస్టారు.

"ముఖ్యమైన విషయం ఏమిటంటే, 10-15 శతాబ్దాల కాలంలో హిందూమతమనేదే లేదు. బౌద్ధం, జైనం, శైవం, వీరశైవం, వైష్ణవం, శాక్తేయం, వైదిక మతం అనే మతాలే ఉండేవి. వీరందరీ కలిపి, తరువాతి చరిత్రకారులు 'హిందూ మతస్థులు' అని పిలిచారు. ఈ మతాల అనుయాయులు నిరంతరం కలహించుకొంటుండేవాళ్ళు. జైనులనూ, బౌద్ధులనూ వీరశైవులు హింసించేవారు. వారి దేవాలయాలనూ, ఆరామాలనూ నాశనం చేసేవారు. అలాగే శైవులకూ, వైష్ణవులకూ నిరంతర కలహాలు ఉండేవి. వీటికి సంబంధించి అనేక ఉదాహరణలిస్తాను. ప్రాచీన కాలంలో అనేక జైన గ్రంథాలు రచించబడ్డాయి. అవి సంస్కృత గ్రంథాలకు అనువాదాలు కావు. స్వతంత్ర రచనలు. కాని అవన్నీ 10,11 శతాబ్దాలలో వీరశైవం జరిపిన మతహింసలో భాగంగా కాలి బూడిద అయ్యాయని ప్రఖ్యాత చరిత్రకారుడు ప్రొ॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు పేర్కొన్నారు. అలాగే మధ్యయుగాలకు చెందిన మాధవాచార్యులు రచించిన 'శంకర దిగ్విజయం' లో బౌద్ధంపై శంకరాచార్యుల భౌతిక దాడులను గురించిన వివరాలు లభిస్తాయి. వీటికి సంబంధించి మరికొన్ని ఉదాహరణలిస్తాను. నాటి పంచారామాలైన అమరారామం, కొమరారామం, క్షీరారామం, ద్రాక్షారామం, భీమారామాలే నేటి అమరావతి, సామర్లకోట, పాలకొల్లు, ద్రాక్షారామం, భీమవరాలు. ఈ పంచారామాలలోని శివాలయాలలో, ఆలయ నిర్మాణం ఒకే పద్ధతిలో ఉంటుంది. అవి రెండంతస్తుల ఆలయాలు. క్రింది అంతస్థును రాళ్ళతో

శాశ్వతంగా మూసివేశారు. వీటిలోని లింగాలు చాలా పొడవుగా, శిరస్సుపై పెద్ద రంధ్రంతో ఉంటాయి. అందుచేత యీ ఆలయాలను బౌద్ధ స్థూపాలపై నిర్మించారా? ఇందులోని లింగాలు స్థూప ఉపరితల భాగంలోని ఛత్రయష్టులా? అనే అనుమానం కలగడం సహజమేనని ప్రొ॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు 'ఆంధ్రదేశంలో జైన, బౌద్ధమతాలు' అనే గ్రంథంలో పేర్కొన్నారు.(పేజి74). అంతేకాదు. గుంటూరు జిల్లాలో, చేజెర్లలోని కపోతేశ్వరాలయం బౌద్ధ విహారానికి చెందిన చైత్యాలయమని చాలామంది పురాతత్వ పరిశోధకుల అభిప్రాయమనీ, ఆ ఆలయానికి చెందిన స్థల పురాణం 'శిబి జాతక కథ' పై ఆధారపడి ఉండటం గమనార్హమనీ ప్రొ॥ హనుమంతరావు వివరించారు. అలాగే గుంటూరు జిల్లా కైఫీయతులు, త్రిలోచన పల్లవుడు అనేక జైన వసదులను నిర్మూలించినట్లు పేర్కొంటున్నాయి. తెనాలి కైఫీయతును అనుసరించి, తెనాలిలో జైన వసది నిర్మూలించబడి, ఆ ప్రదేశంలో ముక్కంటి రామలింగేశ్వర ఆలయం నిర్మించబడింది. నేటి రామలింగేశ్వర ఆలయ ప్రాంగణంలో వర్ధమాన మహావీరుని ప్రతిమ దొరకడం, కైఫీయతులోని అంశాన్ని బలపరుస్తున్నదని ప్రొ॥ హనుమంతరావు వ్రాశారు.

జైన హింసను గూర్చి 'పండితారాధ్య చరిత్ర' విపులంగా వర్ణించింది. వాదనలో ఓడిపోయిన జైనులకు శైవమత స్వీకారమో, లేదా మరణమో తప్ప మూడో మార్గంలేదు. దేవర దాసయ్య అనే శివభక్తుడు పొట్ల చెరువు అంటే హైదరాబాద్‌లోని నేటి పటాన్‌చెరులో ఉన్న 500 జైన వసదులను నిర్మూలించి అక్కడ ఉత్తరేశ్వరుడనే పేర శివుని ప్రతిష్ఠించినట్లు 'పండితారాధ్య చరిత్ర' చెబుతున్నది. గోవూరు లోని జైన వసదులు గోవూరు బ్రహ్మయ్య కోపానికి నాశనమయ్యాయి. వేంగిలో జైనమత నిర్మూలనోద్యమానికి నాయకుడు అడపా రాజయ్య. పశ్చిమాంధ్ర, కర్నాటక ప్రాంతాలలో కాలచురి సేనాపతులు జైన విధ్వంసానికి పూనుకున్నారు. ఆనంపూర్ లాంటి ప్రదేశాలలో జైన మునులను విరూపాక్షుడనే సేనాని హతమార్చాడు. కందూరు చోడుల రాజధాని పానగల్లు

లోని జైనులు మల్లిఖార్జున పండితుని ఆగ్రహానికి బలి అయ్యారు. పై విషయాలన్నిటినీ, ప్రొ॥ హనుమంతరావు "ఆంధ్రదేశంలో జైన, బౌద్ధమతాలు" అనే గ్రంథంలో వివరించారు.

అలాగే కాకతీయ గణపతిదేవుని ఆస్థానంలో తిక్కన సోమయాజికీ, జైనమునులకూ సిద్ధాంత చర్చ జరిగి, అందులో జైనులు పరాజయం పొందారనీ, ఆ తర్వాత గణపతిదేవుడు జైనులను చిత్రహింసకు గురిచేశాడనీ కాసె సర్వప్ప రచించిన 'సిద్ధేశ్వర చరిత్ర' లో నమోదయింది. అంతేకాదు. తెలంగాణలో జైన మతానికి పట్టుకొమ్మ అయిన కొలనుపాక నగరాన్ని క్రీ.శ. 1007లో రాజేంద్రచోళుడు, ఆ తర్వాత అతని కుమారుడు రాజాధిరాజు ధ్వంసం చేశారని శాసన సాక్ష్యం లభిస్తున్నదని ప్రొ॥ హనుమంతరావు వివరించారు. చివరిగా ఇంకో విషయం చెబుతాను. ఆంజనేయుడు లంకాపురిని ధ్వంసం చేసినట్లుగా, జైనమతాన్ని ఆదరించిన వర్ధమానపురాన్ని, కాకతిరుద్రుడు దగ్ధం చేశాడని హనుమకొండ శాసనం తెలియజేస్తున్నది. ఇక కులోత్తుంగచోళుడనే వీరశైవ మతాభిమానియైన రాజు, శ్రీరంగపట్నంలోని అనంత పద్మనాభుని విగ్రహంతో బాటు ఆ ఆలయం పూజారిని సముద్రంలోకి తోయించాడనీ, వైష్ణవమతనాయకుడైన రామానుజాచార్యులను చంపబోతే ఆయన ఆ రాజ్యం నుండి పారిపోయినాడనీ ఆయన శిష్యుడి కి కళ్ళు పీకించాడనీ చరిత్రకారులు తెలియజేస్తున్నారు. ఇక పల్నాడులో, నాయకురాలు నాగమ్మ, బ్రహ్మనాయుడులు ఉభయులూ సర్వనాశమైంది, వారిద్దరి మధ్యా నెలకొన్న వీరశైవ, వీరవైష్ణవ మత దురభిమానాలవల్లేగదా?

ఇలా విజయనగర సామ్రాజ్య స్థాపన కాలానికి జైన-శైవ, శైవ-వైష్ణవ మతాల మధ్య భయంకర పరస్పర వినాశన కార్యక్రమం సాగిపోతున్నదని మీకు అర్థమైందికదా?

మరో ప్రమాదకరమైన అంశం ఏమిటంటే, ఆ కాలంలో మతం కంటే

కులానికి ప్రాధాన్యత నీయడం, కులద్వేషాలు తీవ్రంగా ఉండి ఒక మతం వారే ఒకరినొకరు పరస్పర వినాశనానికి ఒడిగట్టడం జరిగింది. కాకతీయ సామ్రాజ్యంలో ప్రధానంగా వెలమ, రెడ్డి, నాయుడు, కమ్మ కులాల వారు ఆస్థానంలో పెద్దరికం కోసం తీవ్ర ప్రయత్నాలు చేసేవారు. దానితో వారిలో అసూయాద్వేషాలు బాగా పెరిగాయి. అందులోనూ వెలమలకూ, రెడ్లకూ మధ్య అంతరాలు ఎంతగా పెరిగాయంటే, అవి కాకతీయ సామ్రాజ్యాన్నే కూల్చేశాయని స్థానిక శాసనాలు తెలియజేస్తున్నాయని 'కాకతీయ సంచిక' లో ప్రఖ్యాత చరిత్రకారుడు మారేమండ రామారావు వెల్లడించారు. ఆ కుల విద్వేషాలు ఎంతగా పెరిగాయంటే, కాకతీయ అనంతర చరిత్ర అంతా వెలమ–నాయక, వెలమ–క్షత్రియ, వెలమ–రెడ్డిల మధ్య జరిగిన యుద్ధాలతో చీకటిమయం అయిందని ఎమ్. సోమశేఖరశర్మ తన 'ఎ ఫర్గాటెన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్ర హిస్టరీ అండ్ ది రెడ్డి కింగ్డమ్స్' అనే గ్రంథంలో వివరించారు.

అలాంటి చారిత్రక పరిస్థితుల్లో, ఒక రాజ్యాన్ని హిందూమత రక్షణ కొరకు స్థాపించారని చెప్పడం చరిత్రను వక్రీకరించడమే". అని వివరించారు మాస్టారు.

"విజయనగర రాజ్యాన్ని హరిహరరాయలు, బుక్కరాయలు తమ గురువు విద్యారణ్యస్వామి ప్రోత్సాహంతో స్థాపించారని మా తాతయ్య చెప్పాడు. అది నిజం కాదా మాస్టారూ?" అడిగాడు రామశర్మ.

"ఆ విషయం కూడా కల్పనే రామశర్మా! విద్యారణ్యస్వామి ప్రోద్బలంతో విజయనగర సామ్రాజ్యం నిర్మించారనడానికి ఏ విధమైన సాక్ష్యాలు లేవని "సోషియో కల్చరల్ హిస్టరీ ఆఫ్ ఏన్షియంట్ అండ్ మీడియవల్ ఆంధ్ర" అనే గ్రంథంలో ప్రొ॥ హనుమంతరావు వివరంగా చెప్పారు. హిందూ ధర్మ రక్షణ కోసం విజయనగర సామ్రాజ్య స్థాపన జరిగి, దానిలో విద్యారణ్యులు ప్రధాన పాత్ర పోషించి ఉంటే, మధురైని ఆనాడు పరిపాలిస్తున్న ముస్లిం పాలకులపై

విజయనగర రాజ్య విజయాన్ని కీర్తిస్తూ 'మధుర విజయం' అనే గ్రంథాన్ని వ్రాసిన గంగాదేవి, తన కృతి ఆరంభంలో వందనాలు అర్పించిన మహనీయుల జాబితాలో విద్యారణ్యుల పేరు ఎందుకు చేర్చలేదని ప్రొ॥ హనుమంతరావు ప్రశ్నించారు. ఆ గ్రంథాన్ని గంగాదేవి విజయనగర రాజ్య స్థాపన అనంతరం 50 ఏళ్ళలోపే రచించడం గమనార్హమని ఆయన పేర్కొన్నారు. విద్యారణ్యుల ప్రోద్బలం, ప్రోత్సాహం అనే కట్టుకథ శృంగేరీ ఆచార్యులచే సృష్టించబడి, సంగమ వంశానికి చెందిన విజయనగర పాలకులచే ప్రచారంలో పెట్టబడిందని "ది బిగినింగ్స్ ఆఫ్ విజయనగర హిస్టరీ" అనే గ్రంథంలో హెరాస్ అనే చరిత్రకారుడు వివరించగా, పి.బి. దేశాయ్, షడ్దర్శనం సోమసుందరశర్మ, జె. హనుమచ్ఛాస్త్రి మొదలైన వారు అనేకులు ఆ అంశాన్ని బలపరచారు.

ఇదీ పిల్లలూ! విజయనగర సామ్రాజ్య స్థాపన వెనుకనున్న చరిత్ర. వచ్చే క్లాసులో మధ్య యుగాలలోని ఉత్తర భారతదేశ చరిత్రను గూర్చి తెలుసుకుందాం" అంటూ మాస్టారు లేచారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 16వ భాగం. మధ్యయుగాల భారతదేశం - 11, 12 శతాబ్దాలు

"పిల్లలూ! మధ్యయుగాల భారతదేశ చరిత్రలోని దక్షిణ భారతదేశ చరిత్రను గూర్చి తెలుసుకున్నారు గదా? ఇప్పుడు మధ్య యుగాలలోని ఉత్తర భారతదేశ చరిత్రను గూర్చి తెలుసుకుందాం." అంటూ వివరించడం మొదలుపెట్టారు.

"ఘజ్నీ అనే ప్రాంతం ఆఫ్ఘనిస్తాన్‌లోని ఒక చిన్న భూభాగం. ఆ రాజ్యానికి క్రీ.శ. 998లో మహమ్మద్ అనే వ్యక్తి రాజయ్యాడు.అందువలన అతనిని ఘజనీమహమ్మద్ అని చరిత్రకారులు పిలిచారు. అతడు తాను ఒక విశాల సామ్రాజ్యాన్ని పరిపాలించాలని సంకల్పించాడు. మధ్య ఆసియాకు చక్రవర్తి నౌదామని కలలుగన్నాడు. భారతదేశం సిరిసంపదలతో తులతూగుతున్నదని విని, భారతదేశం నుండి సంపదలను కొల్లగొట్టి, ఆ ధనంతో తన సైన్యాన్ని పెంచి, పెద్ద సామ్రాజ్యాన్ని ఏర్పాటుచేయాలనుకున్నాడు. అందువలన భారతదేశంపై 17 సార్లు దండయాత్రలు చేశాడు. ఈ దేశంలో దేవాలయాలలో దాచిన అపారమైన ధనరాశులను దోచుకున్నాడు. వాటిలో గుజరాత్‌లోని సోమనాథ్ దేవాలయం ఒకటి. ఈ దేవాలయంలోని స్వయంభూలింగంగా పేరుబడ్డ విగ్రహాన్ని గూర్చి హెచ్.ఎమ్. ఇలియట్ మరియు డౌసన్‌లు "ది హిస్టరీ ఆఫ్ ఇండియా యాజ్ టోల్డ్ బై ఇట్స్ ఓన్ హిస్టారియన్స్"లో ఏం చెప్పారో తెలుసుకుందాం.

"సోమనాథ్‌లో విగ్రహం క్రిందనుంచిగానీ, పైనుంచిగానీ ఏ ఆధారం లేకుండా మధ్యలో ఉంది. ఈ విగ్రహాన్ని ఎవరూ ఏమీ చేయలేరనే నమ్మకంతో హిందువులు ఉండేవారు. క్రీ.శ. 1025 సంవత్సరం డిసెంబరు నెలలో సుల్తాన్ (ఘజనీమహమ్మద్) అక్కడికి చేరాడు. దాదాపు నిరాయుధులుగా ఉన్న అక్కడివారందరినీ వధించి బంగారం, రత్నాలు, వెండి విగ్రహాలు, పాత్రలను

దోచుకున్నాడు. విగ్రహం ఏ ఆధారం లేకుండా గర్భగుడి మధ్యలో ఎలా నిలబడగలిగిందని సుల్తాన్ ప్రశ్నించగా, అక్కడున్నవారిలో ఒకడు మంటపంను సూదంటురాయితో నిర్మించారనీ, గాలిలో నిలబడగలిగిందనీ చెప్పాడు. సుల్తాన్ ఆజ్ఞతో మంటపంపై నుండి రెండు రాళ్ళు తీయగా, విగ్రహం కొంచెం క్రిందికి ఒరిగింది. మరికొన్ని రాళ్ళు తీయగా, ఇంకా క్రిందికి ఒరిగి, చివరకు నేలమీద నిలబడింది.(పేజి.97)

అయితే, ఈ దాడిపై సమకాలీన సమాజం ఏరకమైనా స్పందనా, విమర్శ లేకుండా ఉన్నదనీ, దీనిపై మొదటిసారిగా 1843లో బ్రిటీష్ పార్లమెంటు సభ్యులు, ఈ సంఘటనను లేవనెత్తి, దాని ఫలితంగా హిందువుల మనస్సు 1000 సంవత్సరాలుగా గాయపడిందని పేర్కొన్నారని ప్రముఖ చరిత్రకారిణి ప్రొ॥ రొమిల్లాథాపర్ వివరించారు. ఇది బ్రిటిష్ వాళ్ళ 'విభజించు-పాలించు' సూత్రానికి అనుగుణంగా చేయబడ్డ ప్రకటన అని అర్థంకావడంలేదా?" అని ముగించాడు మాస్టారు.

"మాస్టారూ! సోమనాథ్ దేవాలయాన్ని ఘజనీమహమ్మద్ కొల్లగొడితే, సమకాలీన సమాజపు ప్రజలనుండి ఎలాంటి స్పందనా, విమర్శాలేదని చెప్పారు. వారిలో ఎందుకని స్పందనలేదు?" అడిగింది అమంద.

"చెబుతానమ్మా! ఆనాటి సమాజంలో మెజారిటీగా ఉన్నవాళ్ళు రైతులు, కూలీలు, దళితులు. వీళ్ళు పొలాల్లో కష్టపడి పనిచేయడమే కాకుండా, ప్రభువులకు నానారకాల వెట్టిచాకిరీ చేసిపెట్టేవారు.నీటి పారుదలకు, రోడ్లు, దేవాలయాల నిర్మాణానికి, ఇంకా చిల్లరమల్లర పనులకు రైతులనుంచి అదనంగా పన్నులను ప్రభువులు గుంజేవారు. దళితుల చేత ఇంకా హీనమైన పనులు చేయించారు. యుద్ధాల సమయంలో, రైతుల పంట పొలాలను రాజపుత్ర సైన్యాలు నాశనం చేసేవి. మీకు పృథ్వీరాజ్ చౌహాన్ పాఠాన్ని వచ్చే క్లాసులో వివరిస్తాను. ఆయన సైన్యాలు చందేలా రాజ్యంపై దండెత్తినప్పుడు, ఆ రాజ్యంలోని నివాస

భూభాగాలను, పంటపొలాలను నాశనంచేశామని పృధ్వీరాజ్ ప్రకటించాడనీ, అలాంటి పరిస్థితుల్లో రాజ్యమేలేవాడు రాజపుత్రుడా, తురుష్కుడా అనిగానీ, ఏరాజు ఏ దేవాలయాన్ని నిర్మించాడో, ఎవరు దోపిడీచేశారో అనిగానీ రైతులు పట్టించుకునే పరిస్థితుల్లో లేరనీ ప్రొ॥ రొమిల్లాథాపర్ 'తరతరాల భారతచరిత్ర' అనే గ్రంథంలో వివరించారు." అని సమాధానమిచ్చారు మాస్టారు.

"మాస్టారూ! ఘజనీమహమ్మద్ 17సార్లు దండెత్తినా, ఎప్పుడూ అతనే ఎందుకు విజయం సాధించాడు? కారణమేమిటి?" అడిగాడు మణి.

"దానికి ప్రధాన కారణం ఆనాడు ఉత్తర భారతదేశాన్ని పరిపాలిస్తున్న రాజపుత్రులలోని అనైక్యత. వారు ఒకరినొకరు నాశనం చేసుకోవడానికే ప్రాధాన్యమిచ్చారుగాని, దండయాత్రీకులను ఎదిరించడం కోసం అందరూ ఐక్యమవ్వాలనే అంశాన్ని బాగా నిర్లక్ష్యం చేశారు. ఉదాహరణకు ఒక పర్యాయం ఘజనీమహమ్మద్ కనోజ్‌పై దండయాత్రచేసి, అక్కడి దేవాలయాలలోని ఆస్తిని దోచుకుంటున్నప్పుడు, కనోజ్‌రాజు రాజ్యపాలునికి సాటి హిందూరాజులెవరూ సాయం చేయలేదు. అందువలన అతను పారిపోయాడు. ఘజనీమహమ్మద్ తిరిగి వెళ్ళేవరకు ఊరుకొని, చండేలా రాజు విధ్యాధరుడు, కనోజ్‌రాజు రాజ్యపాలునిపై దాడిచేసి, అతనిని వధించాడు. ఇది విన్న ఘజనీ విధ్యాధరునిపై దాడిచేశాడు. విధ్యాధరుడు యుద్ధం చేయకుండానే పారిపోయాడు. ఇలా రాజపుత్ర రాజులలోని అనైక్యత దండయాత్రీకునికి లాభించింది" అని వివరించారు మాస్టారు.

"ఘజనీ మహమ్మద్ దండయాత్ర తర్వాత భారతదేశ చరిత్రలోని విశేషాలేమిటి మాస్టారూ" అడిగాడు శ్రీను.

"ఘజనీమహమ్మద్ దాడుల తర్వాత దాదాపు ఒకటిన్నర శతాబ్దంపాటు భారతదేశంపైకి శతృదాడులేమీ లేవు. ఉత్తర భారతదేశాన్ని రాజపుత్ర రాజులే పరిపాలించారు. అయితే, వారిలో నిరంతర కలహాలు కొనసాగుతూనే

ఉన్నాయి. ఈ పరిస్థితుల్లో, ముయిజుద్దీన్ మహమ్మద్ అనే ఆఫ్ఘన్ ప్రాంత పాలకుడు 1191లో భారతదేశంపై దండెత్తాడు. ఇతనినే చరిత్రకారులు మహమ్మద్ ఘోరి అని పిలిచారు. ఇతనిని అజ్మీర్ పాలకుడైన పృధ్వీరాజ్ అనే రాజపుత్రుడు ఎదిరించాడు. తరాయి వద్ద జరిగిన యుద్ధంలో పృధ్వీరాజు మహమ్మద్‌ఘోరీని ఓడించాడు. కాని మరుసటి ఏడు అంటే 1192లో ఘోరీ మరల భారత్‌పై దండెత్తాడు. పృధ్వీరాజు సైన్యాలు, ఘోరీ సైన్యాలు తరాయి వద్ద ఢీకొన్నాయి. భారతీయ సైన్యాలు సంఖ్యరీత్యా ఘోరీ సేనల కంటె ఎక్కువే ఉన్నాయి. పృధ్వీరాజుకు అనేకమంది రాజులు సహాయం అందించలేదు. జయచంద్రుడి కుమార్తె, మరియు తన ప్రేయసి అయిన సంయుక్తను పృధ్వీరాజు అపహరించుకు వెళ్ళాడనీ, అందువల్ల జయచంద్రుడు సహాయపడలేదనీ ఒక తప్పుడు కథ ప్రచారంలో ఉంది. ఆ ప్రేమ కథను చాలాకాలం తర్వాత చంద్‌బద్దాయి అనే కవి వ్రాశాడు. అందులో పలు అసంబద్ధ సంఘటనలు ఉన్నాయి. అప్పటికే రెండు రాజ్యాల మధ్య శతృత్వం ఉన్నందువల్లనే జయచంద్రుడు సహాయపడలేదని ప్రొ॥ సతీష్‌చంద్ర పేర్కొన్నారు.

భారతీయ సైన్యాలు సంఖ్యలో ఎక్కువగా ఉన్నప్పటికీ, ఘోరీ సైన్యాలే గెలిచాయి. అయితే మహమ్మద్ ఘోరీ పృధ్వీరాజును తనకు సామంతరాజుగా ఉండటానికి అంగీకరించి, అతనిని అజ్మీరును పాలించడానికి అనుమతించాడు. అందువల్లనే, ఆనాటి నాణేలపై తేదీతోబాటు, ఒకవైపు పృధ్వీరాజు బొమ్మ, మరోవైపు 'శ్రీ మహమ్మద్ సమ్' అనే పదాలు ఉన్నాయి. అయితే కొంకాలం తర్వాత కుట్ర పన్నాడనే ఆరోపణతో పృధ్వీరాజుకు మరణశిక్ష విధించడంతో, అతని కుమారుడు రాజయ్యాడు.

1194లో ఘోరీ కనోజ్‌పై దండయాత్రకు వచ్చాడు. ఘోరీ, జయచంద్రుల మధ్య భారీ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో జయచంద్రుడు మరణించాడు. అతని సైన్యం ఓడిపోయింది. ఆ విధంగా ఘోరీ ఆఫ్ఘనిస్తాన్ నుండి కనౌజ్ వరకుగల విశాల సామ్రాజ్యానికి రాజైనాడు.

"మహమ్మద్ ఘోరీ 1206లో చనిపోయాడు" అని ముగించారు మాస్టారు.

"ఆ కాలంనాటి ప్రజల సామాజిక పరిస్థితిని గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగాడు రోహిత్.

"కల్హణుడు అనే రచయిత 12వ శతాబ్దంలో 'రాజతరంగిణి' అనే గ్రంధాన్ని రచించాడు. ఆల్ బెరూనీ అనే విదేశీ యాత్రికుడు క్రీ.శ. 1030 ప్రాంతంలో భారతదేశాన్ని సందర్శించాడు. ఆ విదేశీయాత్రీకుని యాత్రా విశేషాలు, ఇతరుల గ్రంధాలు, ఆ కాలంనాటి స్మృతులూ, ఆ కాలంలోని సామాజిక స్థితిని తెలియజేస్తున్నాయి.

రైతులు రెవెన్యూ పన్నుగా పంటలో ఆరవ భాగాన్ని రాజులకు చెల్లించేవారు. ఇవిగాక రాజపుత్ర రాజులు అమానుషమైన అనేక పన్నులను వసూలు చేసేవారు. భూమిశిస్తుతో బాటు పుశువుల గడ్డిపన్ను, చెరువుల పన్నువంటి అనేక ఇతర పన్నులను వారు వసూలు చేసేవారు. ఒక రాజపుత్రరాజు పిచ్చుకలు, చచ్చిన పక్షులు, పందిపేడ, శవంపై కప్పిన వస్త్రాలపైన కూడా పన్నులు వసూలుచేసేవాడని ప్రొ॥ సతీష్‌చంద్ర అనే చరిత్రకారుడు పేర్కొన్నారు. ఆ కాలంలో వ్రాయబడ్డ స్మృతులు బ్రాహ్మణుల హోదాను ఉచ్ఛస్థాయికి తీసుకుపోయాయి. శూద్రుల సామాజిక, మతస్థాయిని తగ్గించడంలో ఆనాటి స్మృతికర్తలు గతకాలపు స్మృతికర్తలను మించిపోయారని కూడా ప్రొ॥ సతీష్‌చంద్ర వ్రాశారు. శూద్రుని ఆహారం తిన్నా, అతడితో ఒకే ఆసనంపై కూర్చున్నా, పాఠాలు నేర్చుకున్నా, ఎంతటి ఉన్నతుడైనా అధమస్థాయికి చేరుకుంటాడని పరాశర స్మృతికర్త పేర్కొన్నాడు. ఇంకా దారుణమయిన విషయం ఏమిటంటే, దళితుడి నీడ కాలుష్యకారకమా? కాదా? అనే చర్చకూడా ఆనాటి సాహిత్యంలో కనిపిస్తుంది. మరో విశేషం ఏమిటంటే, కులాలనుబట్టి వడ్డీరేట్ల నిర్ణయం క్రమబద్ధీరించబడింది. బ్రాహ్మణుల కిచ్చిన అప్పుపై రెండు శాతం వడ్డీ, ఇతరుల కిచ్చినదానిపై అయిదు శాతం వడ్డీగా ఆకాలంలో

నిర్ణయించబడింది. అంతేకాదు. పశ్చిమ భారతదేశంలోని సముద్రతీరంలో దొరికిన శాసనం, వర్తకం నిమిత్తం సరుకులతో వచ్చిన ప్రతి ఓడ అక్కడున్న ప్రతి ఆలయానికి, పురోహితులకు ఒక బంగారు నాణాన్ని పన్నుగా ఇవ్వాలని పేర్కొంటోంది. చివరిగా ఒక విషయం చెబుతాను. కొన్ని రాజపుత్ర రాజ్యాలలో బ్రాహ్మణులకు భూమిశిస్తు తక్కువగా విధించడం అనేది ఆ రాజ్యాలు స్వతంత్ర భారతదేశంలో విలీనం అయ్యేవరకు సాగింది." అని వివరించారు మాస్టారు.

"ఆ కాలంలో కూడ పేద, ధనిక అంతరాలు ఉండేవా మాస్టారు?" అడిగింది సమత.

"ఉన్నాయమ్మా! ఆ కాలంనాటి పరిస్థితిని గూర్చి కల్హణుడు ఏమని వ్రాశాడంటే "రాజోద్యోగులు, ధనికులు రుచికరమైన మాంసం, పుష్పసౌరభంతో కూడిన చల్లని మద్యం ఆరగిస్తుంటే, మరోవైపు పేదలు అన్నం, చేదుకూరలతో సరిపెట్టుకోవలసివచ్చేది." అని వ్రాశాడు. ఇదీ ఆనాటి ధనికులు, పేదల పరిస్థితి." అంటూ ఉత్తర భారతదేశ చరిత్రలో 11,12 శతాబ్దాలనాటి పరిస్థితులను గూర్చి చెప్పడం ముగించి లేచారు మాస్టారు.

పిల్లలు గూడ మాస్టారిని అనుసరించారు.



# 17వ భాగం. మధ్యయుగాల భారతదేశం - ఢిల్లీ సుల్తానులు

"పిల్లలూ! ఇప్పుడు భారతదేశ చరిత్రలోని ఢిల్లీ సుల్తానుల పాలనా కాలాన్ని గూర్చి వివరిస్తాను." అంటూ మొదలెట్టారు విశ్వం మాస్టారు.

"మహమ్మద్ ఘోరీ 1206లో చనిపోయాడు అని చెప్పానుగదా? అతని తర్వాత, ఘోరీ సామ్రాజ్యంలోని భారతదేశ ప్రాంతానికి కుతుబుద్దీన్ ఐబక్ అనే ఒక బానిస, రాజయ్యాడు. అప్పటి నుండి ఉత్తర భారతదేశానికి సుల్తానుల పరిపాలన ప్రారంభమయింది. ఐబక్ 1210లో చనిపోగా, అతని అల్లుడు ఇల్‌తుత్‌మిష్ ఢిల్లీ సుల్తానయ్యాడు. అతని పరిపాలనాకాలంలో బెంగాల్, బీహార్ ప్రాంతాల రాజైన ఇవాజ్ అనే వ్యక్తి సుల్తాన్ గియాజుద్దీన్ అనే బిరుదు వహించి స్వతంత్రం ప్రకటించుకున్నాడు. 1227లో లఖనౌతీ వద్ద జరిగిన ఒక యుద్ధంలో ఇవాజ్‌ను ఇల్‌తుత్‌మిష్ కుమారుడు ఓడించి హతమార్చాడు. ఇల్‌తుత్‌మిష్ తన వారసురాలిగా తన కుమార్తె రజియాను ప్రకటించాడు. ఈమె 1236 నుండి 1239 వరకు మూడేళ్ళు పరిపాలించింది. తర్వాత 26 ఏళ్ళు రాచరికానికీ, తురుష్క సామంతులకూ మధ్య ఘర్షణ కొనసాగి చివరకు ఉలూఘ్‌ఖాన్ అనే సామంతుడు బలపడి 1265లో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడే చరిత్రలో బాల్బన్ అనే పేరుతో ప్రసిద్ధిపొందాడు. ఇతడు 1286 వరకు పరిపాలించాడు. బాల్బన్ మరణం తర్వాత నాలుగేళ్ళ పాటు వారసత్వం కోసం పెనుగులాట జరిగింది. చివరకు 1290లో ఢిల్లీ సింహాసనం ఖిల్జీ వంశస్థులకు చిక్కింది. ఖిల్జీ వంశస్థులలో అల్లావుద్దీన్ ఖిల్జీ ప్రసిద్ధుడైనాడు. ఇతడు 1296–1316 మధ్య ఢిల్లీ సుల్తాన్‌గా పరిపాలన సాగించాడు. అతని తర్వాత నాలుగేళ్ళపాటు స్థిరంలేని పాలన. ఆ తర్వాత 1320లో తుగ్లక్ వంశం అధికారంలోకి వచ్చింది. ఈ వంశీయులలో మహమ్మద్ బిన్ తుగ్లక్ ప్రసిద్ధుడు. ఇతడు 1324–1351 మధ్య ఢిల్లీ సుల్తానుగా పరిపాలన చేశాడు. ఈ వంశపాలన

1412 వరకు సాగింది. తుగ్లక్‌ల పాలనా కాలంలోనే 1398లో చెంఘీజ్‌ఖాన్ వంశీయుడైన తైమూర్ భారతదేశంపై దండెత్తి ఢిల్లీతో సహా అనేక పట్టణాలను దోచుకున్నాడు. నిర్ధాక్షిణ్యంగా మహిళలు, పిల్లలతో సహా భారీసంఖ్యలో హిందూ, ముస్లింలకు చెందిన ప్రజలను హతమార్చాడు. తుగ్లక్‌ల వంశపాలన తర్వాత సయ్యద్‌వంశం 1414-1451 ల మధ్య పాలించింది. వారి తర్వాత 1451-1526 ల మధ్య లోఢీ వంశం పాలించింది. వీరిలో చివరివాడు ఇబ్రహీంలోడి. లోడీల పాలనాకాలంలోనే రాణా కుంభ అనే రాజపుత్ర వీరుడు మేవార్‌ను ఒక ప్రబలమైన శక్తిగా తీర్చిదిద్దాడు. కుంభ సోదరుడు మోకల్, కుంభకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయగా మాల్వా పాలకుడు మహమ్మద్ ఖిల్జీ, మోకల్‌కు సహకరించాడు. మార్వార్‌కు చెందిన రాథోడ్లతో కూడా రాణా వైరం పెంచుకొని వారితో నిరంతరం పోరాటం సల్పాడు. కుంభ చివరిదశలో గద్దెకోసం, అతనిని, అతని కుమారుడు ఉదాయే హతమార్చాడు. ఆ తర్వాత మేవార్ సింహాసనం కోసం ఉదా కుమారుల మధ్య సుదీర్ఘ ఘర్షణ జరిగింది. ఆ ఘర్షణలో చివరికి 1508లో, రాణా సంఘ మేవార్ గద్దెనెక్కాడు. అదే సమయంలో మాల్వాలో గద్దెకోసం జరిగిన ఘర్షణలో మెహమూద్-2 కు, మేదినీరాయ్ అనే రాజపుత్ర సామంతుడు సహకారం అందించాడు. ఇవీ ఢిల్లీ సుల్తానుల పాలనా కాలంనాటి చివరిరోజుల పరిస్థితులు. ఈ పరిస్థితుల్లో బాబరు భారతదేశంపై దండెత్తి, ఇబ్రహీంలోడీని జయించి, ఢిల్లీ పాలకుడయ్యాడు. అప్పటినుండి మొగలుల పాలన భారతదేశంలో మొదలయింది. దాని విశేషాలు వచ్చే క్లాసులో చెబుతాను" అన్నారు మాస్టారు.

"మాస్టారూ! ఢిల్లీ సుల్తానుల పరిపాలన, దండయాత్రల విశేషాలు చెప్పండి." అడిగాడు మనోహర్.

"ఆ కాలంలో ఢిల్లీ సుల్తానుల్లోగానీ, రాజపుత్రుల్లో గానీ మతపరమైన దురభిమానాలు లేవు. ఉదాహరణకు అల్లావుద్దీన్ 1299లో, 12వ శతాబ్దంలో

పునర్నిర్మించబడ్డ సోమనాథ్ దేవాలయాన్ని దోచుకొని, అదే దాడిలో, కాంబేలోని సంపన్న ముస్లిం వర్తకులను కూడా దోచుకున్నాడని ప్రొ॥ సతీష్‌చంద్ర వ్రాశారు. అలాగే బాల్బన్ తూర్పు రాజస్థాన్ ప్రాంతం మొత్తాన్ని తన ఆధీనంలో ఉంచుకోవడానికి కారణం రాజపుత్రులు నిరంతరం తమలో తాము కలహించుకోడమేనని కూడా ప్రొ॥ సతీష్‌చంద్ర వ్రాశారు. రాజపుత్ర రాజ్యాలలో కలహాలు ఎంత తీవ్రంగా ఉండేవంటే, ఇల్‌తుల్‌మిష్ సైన్యాలు గుజరాత్‌లోని రాజపుత్ర రాజుపై దాడిచేసినప్పుడు, మాల్వా, దేవగిరిలను పాలించే రాజపుత్రరాజులు గుజరాత్‌పై దక్షిణం నుండి దాడిచేశాయి. సుల్తానులు తమ సేనానులను నియమించుకొనేటప్పుడు మత దురభిమానం చూపించేవారు కాదు. ఉదాహరణకు తుగ్లక్ కొందరు హిందువులను సేనానులుగా నియమించాడు. సుల్తాన్ల పరమత సహనం ఎంతబాగా ఉండేదంటే, వారు ముఖ్యులైన బ్రాహ్మల్ని గౌరవించి భూదానాలతో ఘనంగా సత్కరించారనీ, గ్రామాల్లో పంచాయితీలు చేసేటప్పుడు హిందువులకు తమ మత ఆచారాల ప్రకారం శిక్షలను అమలు చేసేవారనీ చరిత్రకారులు పేర్కొన్నారు. ఇల్తుత్‌మిష్ తన రాజ్యంలో పౌరులందరికీ షరియాను అంటే ఇస్లాం మత చట్టాన్ని అమలు చేయడం అసాధ్యమని ముస్లిం మత పెద్దలకు తేల్చిచెప్పాడు. ఆ కాలంలో ముస్లింలలో జాతి విభేదాలు ఎంత తీవ్రంగా ఉండేవంటే, తురుష్కులు, ఇరానీయులు, ఆఫ్ఘన్లు, భారతీయ ముస్లింలు ఒకరినొకరు పెండ్లాడే వారు కాదు.

ఇక వారి పరిపాలనా విశేషాలు చెబుతాను. అల్లాఉద్దీన్ ఖిల్జీ తన రాజ్య ఆదాయం పెంచడానికీ, ప్రజాశ్రేయస్సుకూ అనేక చర్యలు చేపట్టాడు. గంగా, యమునా నదుల మధ్య సారవంతమైన భూముల్ని సాగుచేసే సంపన్న భూస్వాముల భూమిశిస్తు పెంచాడు. సర్దార్లు వసూలు చేసుకొని అనుభవించే రాబడిలో తమ వంతుకి ముట్టవలసిన సొమ్ముకన్నా పైసా ఎక్కువ కూడబెట్టడానికి

వీలులేకుండా కట్టుదిట్టం చేశాడు. అన్నిటికంటె ముఖ్యంగా వస్తువుల ధరలు అదుపులో పెట్టి, అక్రమ లాభార్జనని అరికట్టాడు. సాగులో ఉన్న మొత్తం భూమిని కొలిపించి, దానిమీద ఎంత ఆదాయం వచ్చేదీ లెక్కలు కట్టించాడు. ఈ కొత్త మదింపు ద్వారా వివిధ ఉద్యోగులు వసూలు చేసే మొత్తాన్ని అంచనా వెయ్యడానికీ, ఆ మొత్తాన్ని కంట్రోలులో ఉంచుకోవడానికీ వీలయింది.

ఇక మహమ్మద్ బీన్ తుగ్లక్ పరిపాలనా విధానాన్ని వివరిస్తాను. ఇతని పరిపాలనా కాలాన్ని వివరించే సమాచార గ్రంధాలు, ఆధారాలు లెక్కలేనన్ని ఉన్నాయి. తుగ్లక్ ఆదర్శవాది–హేతుబద్ధమైన సూత్రాల వెలుగులో పరిపాలన సాగించాలని శాయశక్తులా ప్రయత్నించినవాడు. ఒక గణిత శాస్త్రజ్ఞుడినీ, ఒక తర్క కోవిదుణ్ణీ తన సలహాదార్లుగా నియమించుకున్నాడు. అతని ఆలోచనలు చాలవరకు అర్ధవంతమైనవీ, సహేతుకమైనవీను. కాని అవి ఆచరణలో విఫలమయ్యాయి. కారణం, సక్రమ కార్యాచరణలో తుగ్లక్, అతని అనుచరులు విఫలం కావడమే.

తుగ్లక్ తన రాజ్య ఆదాయం పెంచుకోవడానికి గంగా–యమునా నదుల మధ్య ప్రాంతంలో రైతుల మీద పన్నులు పెంచాడు. ఆ సమయంలో అక్కడ కరువు విలయతాండవం చేస్తోంది. సహజంగా ప్రజలు అదనపు పన్నులు చెల్లించడానికి నిరాకరించి, సుల్తాను మీద తిరగబడ్డారు. చివరికి, తుగ్లక్ తను పెంచిన శిస్తుని ఉపసంహరించుకోవలసి వచ్చింది. ఇది తుగ్లక్ యొక్క విధానాల మొదటి పరాజయం.

తుగ్లక్ తలపెట్టిన రెండవ మార్పు రాజధానిని ఢిల్లీ నుండి దేవగిరి (దౌలతాబాద్)కు మార్చాడు. విశాలమైన దక్కను పీఠభూమిని చెప్పుచేతల్లో ఉంచుకోవడానికి దేవగిరి చాలా అనువైన స్థలంగా అతడు భావించాడు. కాని యీ మార్పు అభాసుపాలయింది. దేవగిరి ఉత్తర భారతదేశానికి చాలా దూరంలో ఉంది. ఉత్తర సరిహద్దుల్ని కాపాడటం సుల్తానుకు కష్టమయింది. అందువలన

రాజధానిని దేవగిరి నుంచి ఢిల్లీకి మరల తుగ్లక్ మార్చాడు. దీనివలన దక్కను వ్యవహారాల్లో ఢిల్లీ సుల్తానుల ప్రాబల్యం నశించింది.

తుగ్లక్ నాణేల విషయంలో చేసిన ప్రయోగం కూడా విఫలమైంది. అతడు వెండి నాణేలకు బదులు ఇత్తడి, రాగి నాణేలు చెలామణిలోకి తెచ్చాడు. ఈ నాణేలు ప్రభుత్వ టంకసాల మాత్రమే ముద్రించే కట్టుదిట్టాలు చేసిఉంటే, అతని ప్రయత్నాలు ఫలించి ఉండేవి. కాని, దేశంలో అనేక మంది ఈ ఇత్తడి, రాగి నాణేలు తయారుచేయడం మొదలెట్టారు. సుల్తానుకు తన ఖజానా మీద అదుపు తప్పిపోయింది. చివరకు తుగ్లక్ ఇత్తడి, రాగి నాణేలను చలామణి నుంచి ఉపసంహరించాడు.

తన ప్రయోగాల వైఫల్యం కారణంగా, మహమ్మద్ బీన్ తుగ్లక్ చరిత్రకారులచే 'పిచ్చి తుగ్లక్' గా వర్ణించబడ్డాడు. వాస్తవంగా తుగ్లక్ మతగ్రంథాలనూ, తత్వశాస్త్రాన్ని బాగా చదివిన పండితుడు" అని ముగించారు మాస్టారు.

"మాస్టారూ! అల్లావుద్దీన్ ఖిల్జీ – పద్మనిల కథ చెప్పరా?" అడిగింది సాయిలక్ష్మి.

"అది వట్టి కథేనమ్మా! రాణీపద్మిని మేవార్ రాజు రతన్‌సింగ్ భార్యఅనీ, ఆమె సింహాళద్వీప రాకుమారి అనీ, రతన్‌సింగ్ ఎన్నో సాహసాలు చేసి ఆమెను భార్యగా తెచ్చుకున్నాడనీ, ఆమె అందంపై మనసుపడి అల్లావుద్దీన్ దాడి చేశాడనేది వట్టికథ మాత్రమే. మోవార్ రాజధాని చితోడ్ పై అల్లావుద్దీన్ దాడి చేసిన వంద సంవత్సరాల తర్వాతనే యీ కథ వ్రాయబడిందని ఆధునిక చరిత్రకారులు చెబుతున్నారు. ఐతే, 1303లో అల్లావుద్దీన్ చితోడ్ కోటను ఛేదించి లోనికి ప్రవేశించిన వెంటనే, రాణిపద్మిని, కోటలోని రాజపుత్ర స్త్రీలు సతీసహగమనానికి పాల్పడ్డారనేది చారిత్రక వాస్తవం" అన్నారు మాస్టారు.

"ఉత్తర భారతదేశంలో ఆ కాలంనాటి మతపరమైన విశేషాలేమిటి మాస్టారూ?" అడిగాడు జహంగీర్.

"సుల్తాన్లతో బాటు భారతదేశంలోకి ఇస్లాం కూడా ప్రవేశించింది. దానివలన కలిగిన ఆసక్తికరమైన ఫలితమేమంటే, హిందూ , ముస్లిములు ఉభయులూ పరస్పరం మతసంబంధమైన భావనలు అరువు తీసుకున్నారు. ఇది జనరంజకమైన రెండు మత ఉద్యమాలకు దారి తీసింది. ఒకటి సూఫీ ఉద్యమం, రెండు భక్తి ఉద్యమం. సూఫీలు పర్షియా నుంచీ, ఇంకా ఇతర ఆసియా సీమల నుంచీ 11వ శతాబ్దంలో భారతదేశంలో అడుగుపెట్టిన ముస్లిం భక్తిపరులు. భారతదేశంలోని భక్తి ఉద్యమ ప్రబోధకుల లాగే వీరుకూడా ప్రేమ, భక్తి భావాల్ని ప్రచారంచేశారు. వీరిలో మొయినుద్దీన్ చిష్టి, షేక్ షిహాబ్ఉద్దీన్ సుహ్రావర్దీ, షాఆలం బుఖారీ ముఖ్యులు. భక్తి ఉద్యమ ప్రబోధకుల్లో నాందేవ్, సంత్రవిదాస్, కబీర్ ముఖ్యులు. కబీరు అప్పటికి ఉన్న సామాజిక వ్యవస్థను వ్యతిరేకించి, హిందు-ముస్లిం ఐక్యతను ప్రబోధించాడు. విగ్రహారాధనను వ్యతిరేకించాడు. ఈయన ఒక కవితలో

"పాహన్ పూజై హరీ మిలీతో మై పూజు పహాడ్

తాతే యా చాకీభలీ పీస్ ఖాయ్ సంసార్"

అని అంటాడు. అంటే రాతిని పూజిస్తే, అన్నీ దొరికేటట్లయితే, నేను కొండనే పూజిస్తాను. రాతి తిరగలిని పూజిస్తే తిండి అయినా దొరుకుతుంది" అని అర్ధం.

మరో ఆనందకరమైన విషయం ఏమిటంటే ఆకాలంలోని కవులు దేశభక్తి భావనను కూడ ప్రచారం చేశారు. ఆ కాలంనాటి ప్రముఖ కవి అమీర్ ఖుస్రో రచించిన దేశభక్తి ప్రచార కవితను వినండి.

"నేను భారతదేశాన్ని రెండు కారణాలవల్ల పొగిడాను. మొదటిది భారత్

నా మాతృభూమి. రెండవది దేశాభిమానం మన ముఖ్యమైన కర్తవ్యం. హిందుస్తాన్ ఒక స్వర్గం లాంటిది. సంవత్సరం పొడవునా ఈదేశం పచ్చగా, పూలతో కళకళలాడుతూ ఉంటుంది. ఇక్కడి బ్రాహ్మణులు అరిస్టాటిల్ అంతటి మేధావులు. వివిధ రంగాల్లో అనేక మంది పండితులు ఉన్నారు" అని ఖుస్రో అన్నారు.

పిల్లలూ! ఇలా మధ్యయుగాలలోని తొలినాళ్ళలోనే హిందూ–ముస్లిం సమైక్య భావనలు, భక్తి భావనలు, దేశభక్తి భావనలు, ప్రగతిశీలక భావనలు వెల్లివిరిశాయి. ఇవీ మధ్యయుగాలలో ఢిల్లీ సుల్తానుల పాలనా కాలంనాటి విశేషాలు. వచ్చే క్లాసులో బాబరు దండయాత్ర, మొగలుల పాలనా కాలంనాటి విశేషాలు చెబుతాను." అంటూ ముగించారు మాస్టారు.



# 18వ భాగం. మొగలుల కాలం
# (బాబరు, హుమాయూన్, షేర్‌షా)

"పిల్లలూ! ఇప్పుడు భారతదేశ చరిత్రలో మొగలుల కాలంనాటి విశేషాలు తెలుసుకుందాం.

మొగలు సామ్రాజ్య స్థాపకుడు బాబర్. ఈయన 1494లో తన 12వ ఏట ఆక్సియానాలోని చిన్న రాష్ట్రమైన ఫర్గన గద్దెపై ఎక్కాడు. 1525 ప్రాంతంలో ఢిల్లీ సామ్రాజ్యాన్ని లోడీ వంశం వాడైన ఇబ్రహీంలోడీ పాలిస్తున్నాడు. అప్పుడు ఆ సామ్రాజ్యానికి పంజాబ్ ప్రాంతానికి గవర్నర్‌గా దౌలత్‌ఖాన్ ఉండేవాడు. ఇబ్రహీంలోడీ రాష్ట్రాల అధికారాలు తగ్గించి, కేంద్ర ప్రభుత్వ అధికారాలు పెంచే ప్రయత్నాలు మొదలెట్టాడు. ఆ ప్రయత్నం దౌలత్‌ఖాన్‌లో అసంతృప్తిని కలిగించింది. అందువలన అతడు ఫర్గన పాలకుడైన బాబర్‌ను భారతదేశం మీదికి దండయాత్రకు రావలసిందిగా ఆహ్వానించాడు. అదే సమయంలో మేవార్‌కు చెందిన రాజపుత్ర రాజు రాణా సంఘూ కూడా బాబర్‌ను భారత్ పైకి దండెత్తి రావలసిందిగా ఆహ్వానించాడు. రాణా బాబర్‌ను ఎందుకు ఆహ్వానించాడనే ప్రశ్నకు చరిత్రకారులు ఏమని ఊహిస్తున్నారో తెలుసా? బాబర్ మంగోలియా నియంతయైన తైమూర్ వంశంవాడనీ, తైమూర్ లాగా బాబర్ కూడా ఢిల్లీని దోచుకొని వెళ్ళిపోగానే, బలహీనమైపోయిన లోడీ ప్రభుత్వం తననేమీ చేయలేదనీ, తాను కనీసం ఈశాన్య రాజస్థాన్, మాల్వా రాజ్యాలనైనా సునాయాసంగా జయించగలననీ అనుకున్నాడు. అందుకే బాబరును ఆహ్వానించాడు. బాబరు సైన్యాలకూ, లోడీ సైన్యాలకూ మధ్య 20-4-1526న పానిపట్టు వద్ద యుద్ధం జరిగింది. దానిలో దౌలత్‌ఖాన్ బాబరుతో కలిసి పోరాడాడుగాని, సంఘూ, బాబరు సహాయానికి రాలేదు. చరిత్రకారులిచ్చిన వివరాల ప్రకారం బాబరు సైన్యం 12,000 మాత్రమే. ఇబ్రహీంలోడీ సైన్యం

ఒక లక్షమంది. అయినా బాబరు గెలుపొందాడు. కారణం లోడీ సైన్యంలోని అనైక్యత మరియు లోడీ సైన్యంలో పరిచారకుల సంఖ్య ఎక్కువగా ఉండటం అని చరిత్రకారులంటారు. ఆ యుద్ధంలో ఇబ్రహీంలోడీ చనిపోయాడు. బాబరుకు ఆగ్రావరకు ఉన్న ప్రాంతమే కాకుండా, ఆగ్రాలో లోఢీ దాచిపెట్టిన సంపద అంతావశమైంది.

దోచుకొని వెళ్ళిపోతాడనుకున్న బాబరు వెళ్ళకపోవడంతో రాణా సంఘూ బాబరుతో యుద్ధానికి సిద్ధమయ్యాడు. సంఘూకు ఇబ్రహీంలోడీ సోదరుడు మహమూద్‌లోడీ సంఘీభావం తెలియజేశాడు. యుద్ధంలో సంఘా గెలిస్తే తాను ఢిల్లీ గద్దెను తిరిగి స్వాధీనం చేసుకోవచ్చునని అతని ఆలోచన. అనేకమంది రాజపుత్ర రాజులుకూడ సంఘూకు మద్దతు తెలియజేశారు. మేవాత్ పాలకుడు హసన్‌ఖాన్ మేవతి కూడ సంఘూకు మద్దతుగా సైన్యాన్ని పంపాడు. బాబరు, రాణా సంఘూల మధ్య 1527లో ఖాన్వా అనే ప్రదేశంలో యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో వేలాదిమంది రాణా సైనికులు ఊచకోత కోయబడ్డారు. రాణా సంఘూ సైన్యం ఓడిపోయింది గాని రాణా తప్పించుకున్నాడు. అయితే రాణా మరల బాబరుతో యుద్ధం చేయాలని ఆలోచన చేశాడు కాని అలాంటి ఆలోచన ఆత్మహత్యలాంటిదీ, అత్యంత ప్రమాదకరమైనదీ అని భావించిన సంఘూ ఆస్థాన ప్రముఖులు మరో యుద్ధాన్ని నివారించడానికై సంఘూకు విషమిచ్చి చంపివేశారు. దానితో ఆగ్రావరకు గల సరిహద్దుతో విశాల రాజస్థాన్ ను ఏర్పాటుచేయాలన్న సంఘూ లక్ష్యం నీరుగారిపోయింది. బాబరు ఉత్తర భారతదేశానికి తిరుగులేని చక్రవర్తి అయ్యాడు.

బాబరు మరణానంతరం అతని కుమారుడు హుమాయూన్ 1530లో ఢిల్లీ చక్రవర్తి అయ్యాడు. అతడు మొదట ఈశాన్యంలోని తిరుగుబాటుదారులైన ఆఫ్ఘన్‌లపై దాడిచేశాడు. దౌరాహ్ అనే చోట వారిని ఓడించాడు. ఆ తర్వాత ఈశాన్య ప్రాంతంలోని కీలకమైన కోట చునార్‌కోటను ముట్టడించాడు. ఆకోట

అప్పటికి ఆఫ్ఘన్ సర్దార్ షేర్‌ఖాన్ ఆధీనంలో ఉండేది. నాలుగు నెలల సైనిక దిగ్బంధం తర్వాత చునార్ కోటను కాపాడుకొనేందుకు షేర్‌ఖాన్ హుమాయూన్‌తో ఒక ఒప్పందానికి వచ్చాడు. కోట పాలనా బాధ్యతను తనకే వదలివేయాలనీ, అందుకు ప్రతిఫలంగా తాను మొగల్ సామ్రాజ్యానికి విధేయుడనై ఉంటాననీ, హామీగా తన కుమారుడిని ఆగ్రాకు పంపిస్తాననీ విజ్ఞప్తిచేశాడు. హుమాయూన్ అందుకు అంగీకరించి ఆగ్రాకు వెళ్ళిపోయాడు.

ఇబ్రహీంలోడీ దగ్గర బంధువైన తాతర్‌ఖాన్ హుమాయూన్ పై దాడికి సంకల్పించాడు. అయితే హుమాయూన్ అతనిపై ముందే దాడిచేశాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో తాతర్‌ఖాన్ చనిపోయాడు. అతని సైనికులు చెల్లాచెదరయ్యారు.

అదే సమయంలో గుజరాత్ పాలకుడైన బహదూర్ షా పక్క రాజ్యాలను ఆక్రమించుకుంటూ ఈశాన్య రాజస్థాన్ వరకూ వచ్చాడు. అతడి సమస్యను శాశ్వతంగా పరిష్కరించాలని నిర్ణయించిన హుమాయూన్, బహదూర్‌షా ఆక్రమించిన మాల్వాపై దాడిచేశాడు. షా కథియవార్‌కు పారిపోయాడు. హుమాయూన్‌కు మాల్వా, గుజరాత్ రాజ్యాలు, షా తమ సంపదను భద్రపరచిన మాండూ, చంపానేర్ కోటలు వశమయ్యాయి. బహదూర్‌షా సమస్య మొగలులకు తీరింది.

ఈలోగా బీహార్, బెంగాల్‌లలో షేర్‌ఖాన్ బలపడ్డాడు. షేర్‌ఖాన్‌పై దాడికి హూమాయూన్ బయలుదేరాడు. చౌసా వద్ద 1539లో హుమాయూన్‌కూ, షేర్‌ఖాన్‌కు మధ్య జరిగిన భీకరయుద్ధంలో ఏడువేల మంది మొగల్ సైనికులు హతులయ్యారు. మొగలులు ఓడిపోయారు. హుమాయూన్ యుద్ధభూమి నుండి ఒక నీటిని అందించే పరిచారకుని సహాయంతో ప్రాణాలు దక్కించుకొని పారిపోయాడు. షేర్‌ఖాన్ చేతికి అపారమైన ధనసంపద చిక్కింది.

హుమాయూన్ మరల సైన్యాన్ని సమీకరించి, షేర్‌ఖాన్‌పై

దాడిచేశాడు. 1540లో కనౌజ్ వద్ద జరిగిన భీకరయుద్ధంలో హుమాయున్ ఓడిపోయి పారిపోయాడు. అప్పుడు అతను రాజ్యంలేని రాజయినాడు. వివిధ ప్రాంతాలు తిరిగి తిరిగి పర్షియా సుల్తాను ఆశ్రయం పొందాడు. ఆ సుల్తాను సహాయాన్ని కోరాడు. పర్షియా సుల్తాను సాయంచేస్తానన్నాడు గాని యుమాయూన్‌ను సున్నీతెగ నుండి షియాగా మారమని షరతు విధించాడు. హుమాయూన్ దానికి అంగీకరించి షియాగా మారాడు.

ఈలోగా ఉత్తర భారతదేశంలో అనేక పరిణామాలు సంభవించాయి. మార్వార్ పాలకుడు మాల్దేవ్ రాజస్థాన్‌లోని అనేక రాజ్యాలను జయించి, తన రాజ్యాన్ని విస్తరించాడు. దీనితో మేవార్ పాలకునితో సహా అనేకమంది రాజపుత్ర రాజులకు మాల్దేవ్ విరోధి అయ్యాడు. మాల్దేవ్ బికానేర్ పై జరిపిన దాడిలో బికనీర్ పాలకుడు చనిపోయాడు. అతని కుమారులు కళ్యాణ్‌దాస్, బీమ్‌లు షేర్‌షా కొలువులో ఆశ్రయం పొందారు. మాల్దేవ్ వల్ల రాజ్యాలు కోల్పోయిన ఇతర రాజపుత్ర రాజులు కూడ షేర్‌షా కొలువులో చేరారు. వారిలో మాల్దేవ్ సమీప బంధువు మేర్తాకు చెందిన బైరమ్‌దేవ్ కూడా ఉన్నాడు. మాల్దేవ్, షేర్‌షాల మధ్య యుద్ధం అనివార్యమయింది. 1544లో అజ్మీర్–జోధ్‌పూర్‌ల మధ్యలోని సామెల్ వద్ద వారిద్దరికీ మధ్య జరిగిన యుద్ధంలో షేర్‌షా విజయంపొందాడు. ఆ తర్వాత 10 నెలల పాటు యుద్ధాలుచేసి రాజస్థాన్ ప్రాంతమంతటినీ షేర్‌షా తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. చివరికి 1545లో జరిగిన యుద్ధంలో షేర్‌షా తీవ్రంగా గాయపడి మరణించాడు. షేర్‌షా వారసునిగా అతడి రెండవ కుమారుడు ఇస్లాంషా ఢిల్లీ సింహాసనమెక్కాడు. 1553లో అతడు చనిపోగా, మహమ్మద్ ఆదిల్‌షా పాదుషా అయ్యాడు. కాని సింహాసనం కోసం అతని బంధువులతో అంతర్యుద్ధం మొదలైంది. దానితో షేర్‌షా స్థాపించిన సుర్ సామ్రాజ్యం బలహీనమయింది. ఆ సమయంలో హుమాయూన్ పర్షియా సుల్తాను సాయంతో షేర్‌షా వారసులతో రెండు భీకర

యుద్ధాలుచేసి, ఢిల్లీ సింహాసనాన్ని 1555లో తిరిగి స్వాధీనం చేసుకున్నాడు" అన్నారు మాస్టారు.

"షేర్‌షా తో జరిగిన చివరి రెండు యుద్ధాలలలోనూ హుమాయూన్ ఓడిపోవడానికి ప్రత్యేక కారణాలేమైనా ఉన్నాయా మాస్టారూ?" అడిగాడు అభినవ్.

"చరిత్రకారులు కొన్ని కారణాలు చెబుతారు అభినవ్. హుమాయూన్ త్వరగా నిర్ణయాలు తీసుకొనేవాడు కాదు. రెండవ కారణం అతడు జ్యోతిష్యాన్ని విపరీతంగా నమ్మేవాడు. తన ఆస్థాన జ్యోతిష్యుల సలహాలేనిదే రాజ్య వ్యవహారాలలో అడుగు ముందుకేసేవాడు కాదు. దానితో నిర్ణయాలు ఆలస్యంగా జరిగేవి". అవి అతని ఓటములకు కారణమయ్యాయని "ఇండియా సిన్స్ 1526" అనే గ్రంథంలో వి.డి. మహాజన్ అనే చరిత్రకారుడు పేర్కొన్నాడు" అన్నాడు మాస్టారు.

"బాబర్, హుమాయూన్, షేర్‌షాల కాలంలోని పరిపాలనా పద్ధతులు, వాణిజ్యాభివృద్ధి మొదలైన అంశాలను వివరించండి మాస్టారూ?" అడిగింది విప్లవ.

"బాబరు, హుమాయూన్‌ల కాలమంతా యుద్ధాలతోనే గడిచిందమ్మా. అందువలన వాళ్ళ పరిపాలనా కాలాలలో చెప్పుకోదగిన సంస్కరణలు జరగలేదు. షేర్‌షా కాలంలోనే అనేక సంస్కరణలు జరిగాయి. వాటిని గూర్చి వచ్చే క్లాసులో వివరిస్తాను" అంటూ క్లాసు ముగించి లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 19వ భాగం. షేర్‌షా సంస్కరణలు

"పిల్లలూ! షేర్‌షా 1540 నుండి 1545 వరకు 5 ఏళ్ళు మాత్రమే పాలించాడు. అయినా అతని పరిపాలనా కాలంలో యుద్ధాలు లేనందువలన శాంతిభద్రతల మీదా, పెద్దపెద్ద రహదారుల మీదా, వాణిజ్యాభివృద్ధి మీదా దృష్టిపెట్టి చిరస్మరణీయమైన ఫలితాలు సాధించగలిగాడు. వాటిని వివరిస్తాను.

భారతదేశానికి షేర్‌షా అందించిన సేవల్లో ముఖ్యమైనది విస్తారమైన తన సామ్రాజ్యంలో శాంతిభద్రతలను పునరుద్ధరించడం. దోపిడీదారులు, గజదొంగలపట్ల అతడు కఠినంగా వ్యవహరించాడు. భూమిశిస్తు ను కేంద్ర ఖజానాకు జమచేయని జమీందార్లను, ప్రభుత్వ ఆజ్ఞలను పాటించని అధికారులను కూడ కఠినంగా శిక్షించాడు. షేర్‌షా కాలంనాటి చరిత్రకారుడు అబ్బాస్‌ఖాన్ సర్వాణి రాతల ప్రకారం జమీందారులు షేర్‌షా అంటే ఎంతో భయపడేవారు. తిరుగుబాటు చేసేందుకు సాహసించేవారు కాదు. అలాగే తమ ప్రాంతాల గుండా ప్రయాణించే వ్యాపారులను దోచుకొనేవారు కాదు. ఆనాటి శాంతి భద్రతల పరిస్థితిని గూర్చి అబ్బాస్‌ఖాన్ మాటల్లోనే చెప్పాలంటే "ఒక వృద్ధ మహిళ తన తలపై బంగారు ఆభరణాలతో నిండిన బుట్టను పెట్టుకొని ఎలాంటి చీకూ, చింతా లేకుండా రహదారుల వెంట నడిచివెళ్ళవచ్చు. దొంగలుగాని, దోపిడీ ముఠాలు గాని ఆమెను సమీపించే సాహసం కూడా చేసేవారు కాదు. షేర్‌షా అమలుచేసే కఠినమైన శిక్షకు భయపడి ఎవరూ దుస్సాహసానికి పాల్పడేవారు కారు".

"ఆ కఠిన శిక్ష ఎలా ఉండేది మాస్టారూ?" అడిగాడు జాన్.

"ఎవరైనా వస్తువుల దొంగతనానికి గురైతే గ్రామపెద్ద లేదా జమీందారు దొంగలను పట్టుకొని వారినుండి చోరీకి గురైన వస్తువులను స్వాధీనం చేసుకొని వాటి యజమానులకు అప్పజెప్పాల్సి ఉంటుంది. లేదా గ్రామపెద్ద లేదా జమీందారే వాటి ఖరీదును నిర్ణయించి, ఆ మొత్తం సొమ్మును యజమానికి ఇవ్వాల్సిఉంటుంది. రహదారులపై హత్యలు జరిగినా గ్రామపెద్ద లేక జమీందారు లే హంతకులను పట్టుకొని శిక్షించాలి. లేక హత్యకు బాధ్యులుగా ప్రభుత్వం

వారినే చేసి శిక్షిస్తుంది. ఈ శిక్షకు భయపడి ఒక్కోసారి గ్రామపెద్దలు అమాయకులను పట్టుకొని శిక్షించడం జరిగినా, మొత్తం మీద ఈ శిక్షల పద్ధతివలన శాంతి భద్రతలు బాగా మెరుగయ్యాయి.

షేర్‌షా చేసిన మరో గొప్ప సంస్కరణ రవాణా వ్యవస్థను బాగా అభివృద్ధి చేయడం. అతడు అప్పటికి ఎంతో ప్రాచీనమైనదైన రోడ్డు మార్గాన్ని పునరుద్ధరించాడు. అది పశ్చిమంలో సింధూనది నుండి ఈశాన్యంలో బెంగాల్‌లోని సోనార్‌గావ్ వరకు విస్తరించి ఉండేది. దానిని ప్రస్తుతం 'గ్రాండ్ ట్రంక్ రోడ్' అని పిలుస్తున్నాం. అలాగే ఆగ్రా నుండి జోధ్‌పూర్, చిత్తోర్‌ల మీదుగా గుజరాత్ ఓడరేవులను అనుసంధానం చేస్తూ మరో రవాణా మార్గాన్నీ, లాహోర్ నుండి ముల్తాన్ వరకూ మూడో రహదారినీ నూతనంగా నిర్మించాడు. పశ్చిమ, మధ్య ఆసియాలకు సరుకులు రవాణా చేసేందుకు ముల్తాను ఆకాలంలో వ్యాపారులు తొలి విడిదిగా వినియోగించుకొనేవారు." అన్నారు మాస్టారు.

"మరి ఆ రహదారులలో బాటసారుల, వ్యాపారుల సౌకర్యం కొరకు షేర్‌షా ఏమీ చేయలేదా మాస్టారూ?" అడిగింది సాయిజ్యోతి.

"చేయకేమమ్మా! చాలా చేశాడు. ముఖ్యంగా రహదారుల వెంబడి ప్రతి 8 కి.మీ. కు ఒకటి చొప్పున షేర్‌షా మొత్తం 1700 సరాయిలను అంటే సత్రాలను నిర్మించాడు. వాటిలో ప్రయాణికులు రాత్రిపూట విశ్రాంతి తీసుకోవడానికీ, తమ వస్తువులు భద్రపరచుకోవడానికీ తగిన ఏర్పాట్లుచేశాడు. ఈ సరాయిలలో హిందువులు, ముస్లింలకు విడివిడిగా గదులు కేటాయించేవారు. హిందూ ప్రయాణీకులకు భోజనవసతి కల్పించేందుకు బ్రాహ్మణులు ఉండేవారు. గుర్రాలకు మేతకూడా అందుబాటులో ఉంచేవారు. "ఈ సరాయిలలో ఎవరు అడుగుపెట్టినా వారి హోదా ప్రకారం భోజనం, పశువులకు మేత ప్రభుత్వమే ఉచితంగా అందించడం అనేది ఒక నియమంగా ఉండేది" అని చరిత్రకారుడు అబ్బాస్‌ఖాన్ పేర్కొన్నాడు. సరాయిల చుట్టూ గ్రామాలను ఏర్పరచి వాటిని మార్కెట్ కేంద్రాలుగా అభివృద్ధిచేశారు. దానివలన వ్యాపారాభివృద్ధి జరిగింది. ప్రభుత్వానికి రాబడి పెరిగింది. ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఆ సరాయిలలో కొన్ని ఇప్పటికీ ఉన్నాయి. అంటే ఆనాడు వాటి నిర్మాణం ఎంత పటిష్టంగా

జరిగిందో దీనిని బట్టి తెలుస్తోంది.” అన్నారు మాస్టారు.

“షేర్‌షా కూడ అశోక చక్రవర్తి లాగ రోడ్ల ప్రక్కన చెట్లను నాటించాడా మాస్టారూ? అడిగింది శాంతి.

“అవునమ్మా! షేర్‌షా కూడ రోడ్ల కిరుప్రక్కలా ప్రజల సౌకర్యార్ధం చెట్లను నాటించాడు.” అన్నారు మాస్టారు.

“వాణిజ్యాభివృద్ధికి షేర్‌షా ఏమైనై చేశాడా మాస్టారూ?” అడిగాడు కిరణ్.

“చేశాడు కిరణ్. అవన్నీ చెబుతాను. చాలా సరాయిలు మార్కెట్ కేంద్రాలుగా అభివృద్ధి అయినాయని చెప్పానుగదా? వాటిని కస్బాలు అని పిలిచేవారు. కస్బాలకు రైతులు తమ పంట దిగుబడులను తీసుకువచ్చేట్లుగా ప్రభుత్వం ప్రోత్సహించింది. అక్కడ రైతులు తమ దిగుబడులను అమ్ముకునేవారు. వాణిజ్యాన్ని అభివృద్ధి చేయడం కోసం షేర్‌షా పన్నులను రెండుచోట్ల మాత్రమే వసూలు చేసే నిబంధన విధించాడు. ఒకటి రాజ్య సరిహద్దులవద్ద, రెండవది విక్రయాల సమయంలో. అలాగే వ్యాపారులను జాగ్రత్తగా చూసుకోవాలని, వారికి గాని, వారి ఉత్పత్తులకుగాని రవాణా సమయంలో ఎలాంటి హాని జరగకుండా చూసే బాధ్యత ప్రాంతీయ పాలకులు, స్థానికాధికారులదే అని షేర్‌షా స్పష్టమైన ఆదేశాలు జారీచేశాడు. “ప్రయాణంలో వ్యాపారి మరణిస్తే, అతడి వస్తువులను ఎవరూ స్వాధీనం చేసుకోకూడదు.” అని ఆజ్ఞాపించాడు. అంతేకాదు. ప్రయాణంలో వ్యాపారి నష్టాలపాలైతే స్థానిక పరిపాలనాధికారి (గ్రామపెద్ద లేక జమీందారు) బాధ్యత వహించాలని షేర్‌షా స్పష్టంచేశాడు. అంతేకాదు. ద్రవ్య వ్యవస్థకు సంబంధించి అప్పటి వరకు అమలు ఉన్న మిశ్రమ లోహ నాణాలకు స్వస్తిచెప్పి వెండి రూపాయిని అమలులోకి తెచ్చాడు. అతడి మరణం తర్వాత కూడ శతాబ్దాల తరబడి వెండి రూపాయి చెలామణిలో ఉండేది. ఈ చర్యల కారణంగా సామ్రాజ్యమంతటా వ్యాపార, వాణిజ్యాభివృద్ధి మరింత వేగం పుంజుకుంది.” అన్నారు మాస్టారు.

“రైతాంగ సంస్కరణలేవైనా షేర్‌షా చేశాడా మాస్టారూ?” అడిగాడు శ్రీను.

“రైతులపట్ల షా ఎంతో ఉదారంగా వ్యవహరించేవాడు శ్రీనూ! ఓ

సందర్భంలో 'రైతులు నిర్దోషులు. అధికారంలో ఉన్నవారికి దాసోహం అంటారు. నేను వారిని అణచివేయడానికి ప్రయత్నిస్తే వారు గ్రామాలు వదిలి పారిపోతారు. అప్పుడు గ్రామసీమలు నిర్జీవంగా, ఎడారిగా తయారవుతాయి. అవి మళ్ళీ పచ్చగా కళకళలాడాలంటే చాలా సమయం పడుతుంది' అని షేర్‌షా వ్యాఖ్యానించాడు. ఆ రోజుల్లో సాగుకు భూమి విస్తారంగా లభిస్తుండటంతో రైతులు ప్రభుత్వ దమనకాండను తప్పించుకోవడానికి గ్రామాలు ఖాళీచేసే ప్రమాదం ఎక్కువగా ఉండేది. కాబట్టి స్థానిక పాలకులు రైతులను దోచుకోకుండా షేర్‌షా వారిపై పరిమితులు విధించాడు. అంతేకాదు. రైతుల సాగులో ఉన్న భూమిని ఖచ్చితంగా కొలతలు వేయించి, దిగుబడిలో ప్రభుత్వ వాటాను నిర్ధారించాడు. భూములను సారవంతమైనవి, సాధారణమైనవి, నిరుపయోగమైనవి అని మూడు రకాలుగా వర్గీకరించి, ఒక్కొక్క రకం భూమి యొక్క సగటు ఉత్పత్తిని లెక్కించి ప్రభుత్వ వాటాను నిర్ణయించాడు. ఇలా భూమిపై వచ్చే ప్రభుత్వ ఆదాయాన్ని లెక్కించడం జరిగింది. ప్రభుత్వ వాటా కంటే అధికంగా వసూలు చేయడానికి జమీందార్లకు కూడా హక్కు లేకుండా చేశాడు. రైతు సంస్కరణలు చక్కని ఫలితాలనిచ్చాయి.

పిల్లలూ! న్యాయపరమైన చట్టాల విషయం చెప్పి ఈ క్లాసు ముగిస్తాను. న్యాయ చట్టాలను షేర్‌షా ఏమీ మార్చలేకపోయాడు. కాని అతని వారసుడు ఇస్లాంషా పెద్ద ముందడుగు వేసి, చట్టాలను క్రోడీకరించాడు. అప్పటి వరకు ఇస్లాం న్యాయ సూత్రాలైన షరియా సూత్రాలను విద్వాంసులు అనుభవ పూర్వకంగా మేళవించి తీర్పులు చెప్పేవారు. కాని ఇస్లాంషా న్యాయ చట్టాలను క్రోడీకరించడం వలన ఆ విద్వాంసుల అవసరం తీరిపోయింది. న్యాయాధిపతులు చట్టాలను అనుసరించి తీర్పులు చెప్పడం మొదలయింది. ఆ కారణంగా ప్రజలు తీర్పుల విషయంలో పక్షపాతాలకు బలిఅయ్యే ప్రమాదం తప్పింది.

ఇవీ షేర్‌షా కాలంనాటి పరిపాలనా సంస్కరణల విశేషాలు. వచ్చే క్లాసులో అక్బరుపాలన, ఇతర విశేషాలు చెప్పుకుందాం" అంటూ లేచాడు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 20వ భాగం. అక్బరు కాలం

"పిల్లలూ! ఈ రోజు అక్బరు గూర్చీ, ఆయన కాలం నాటి విశేషాలను గూర్చి చెబుతాను. కనౌజ్ యుద్ధంలో ఓడిపోయి, పారిపోతున్న హుమాయూన్‌కు మొదట్లో అమర్‌కోట్ రాణా ఆశ్రయమిచ్చాడు. అమర్‌కోట్ లోనే 1542లో హుమాయూన్ కుమారుడు అక్బర్ జన్మించాడు. అక్కడి నుండి హుమాయూన్ పర్షియా పారిపోయినప్పుడు అక్బర్, వాళ్ళ చిన్నాన్న కమ్రాన్ వద్దనే ఉండి పెరిగాడు. 1555 లో హుమాయూన్ పర్షియా రాజు సాయంతో షేర్‌షా వారసుల నుండి ఢిల్లీని హస్తగతం చేసుకోగలిగాడు. అయితే 1556 లో హుమాయూన్ ఒక ప్రమాదంలో మరణించగా వెంటనే ఆ సమయంలో కలనౌర్ అనే ప్రాంతంలో ఉన్న అక్బరును, అక్కడే, అక్కడ ఉన్న సైనికాధికార్లు సింహాసనమెక్కించారు. అప్పటికి అక్బరు వయస్సు 13 ఏళ్ళు మాత్రమే.

మొగలుల పాలనకు ప్రధానమైన సవాలు ఆదిల్‌షా నుండి వచ్చింది. అతడు అప్పటికి బెంగాల్ నుండి చునార్ వరకు ఉన్న ప్రాంతంపై పాలకుడుగా ఉన్నాడు. ఆదిల్‌షా హేము అనే హిందూ సైన్యాధికారికి 'విక్రమజీత్' అనే బిరుదునిచ్చి, ప్రధానిగా నియమించి అక్బర్‌ను దేశంనుండి తరిమివేసే బాధ్యతను అప్పగించాడు. అక్బరు కు సంరక్షకుడుగా ఉన్న బైరాంఖాన్ నాయకత్వంలోని మొగల్ సేనలకూ, హేము సైన్యానికీ మధ్య యుద్ధం 5-11-1556 న పానిపట్ అనేచోట జరిగింది. ఆ యుద్ధంలో మొగల్ సైన్యం గెలిచింది. దానితో ఉత్తర భారతదేశంలో అక్బర్ పాలన స్థిరపడింది.

తర్వాత తైమూరిద్ వంశానికి చెందిన మీర్జాలు తిరుగుబాటు చేయగా అక్బరు దానిని అణచివేశాడు. తిరగుబాటు నాయకులనందరినీ హతమార్చాడు.

తర్వాత అక్బరు ఆదేశంపై, అతని పెంపుడుతల్లి మహం అనగ కుమారుడు ఆదంఖాన్ మాల్వాపై దాడిచేసి, ఆ రాజ్యపాలకుడు బజ్ బహదూర్ ను ఓడించి

మాల్వాను స్వాధీనం చేసుకున్నాడు. అయితే ఆదంఖాన్ చేసిన ప్రజా పీడనను భరించలేక, ప్రజలు తిరుగుబాటుచేసి, మరల బజ్ బహదూర్ ను అధికారంలోకి తీసుకువచ్చారు. అయితే త్వరలోనే అక్బర్ బజ్ బహదూర్‌ను ఓడించి, మాల్వాను స్వాధీనం చేసుకున్నాడు. బజ్ బహదూర్ పారిపోయి కొంతకాలం మేవార్ రాణా కొలువులో ఆశ్రయం పొందాడు. అయితే ఆ తర్వాత కొంత కాలానికి మరల అక్బర్ ఆ స్థానానికి బజ్ బహదూర్ వెళ్ళి, అతనికి లొంగిపోయాడు. అక్బర్ అతనిని క్షమించి మొగల్ సైన్యంలో మున్సబుదారుగా నియమించాడు. దానితో మాల్వా రాజ్య సమస్య పరిష్కారమైంది.

ఈలోగా ఘట్ కటంగా రాజ్యాన్ని పాలిస్తున్న రాణీ దుర్గావతిని అక్బరు సామంతుడైన అలహాబాద్ గవర్నర్ అసఫ్ఖాన్ జయించి రాజధాని చౌరాఘడ్‌లోని అపారమైన సంపదను చేజిక్కించుకున్నాడు. అయితే అందులో అతి కొద్ది భాగన్నే అక్బరుకు పంపి, లూఠీ ధనంలో అధిక భాగాన్ని తన వద్దనే ఉంచుకున్నాడు. కాని అక్బర్ అసఫ్ఖాన్ పై సైనిక ఒత్తిడిని పెంచి ఆ ధనాన్ని కేంద్ర ఖజానాకు సమర్పించుకొనేలా చాశాడు. అంతేకాదు. ఘట్‌కటంగా రాజ్యాన్ని పూర్వ పాలకుడు సంగ్రామ్‌షా కుమారుడు చంద్రషాకు కట్టబెట్టారు.

తర్వాత పదేళ్ళకు రాజస్థాన్‌లోని ప్రధాన భాగాన్ని అక్బర్ తన నియంత్రణలోకి తెచ్చుకున్నాడు. గుజరాత్, బెంగాల్ లను కూడా స్వాధీనం చేసుకున్నాడు. బెంగాల్ నియంత్రణ కొరకు జరిగిన యుద్ధంలో అక్కడి పాలకుడు దౌద్‌ఖాన్ ను మొగల్ సైన్యాలు యుద్ధరంగంలోనే చంపివేసి, బెంగాల్‌ను జయించాయి. అక్బర్ సాధించిన విజయాలలో చిత్తోడ్‌కోటను వశం చేసుకోవడం ముఖ్యమైనది. 1568లో 6 నెలల ముట్టడి తర్వాత అక్బర్ చిత్తోడ్ కోటను ఆక్రమించుకున్నాడు. చిత్తోడ్ రాణా ఉదయసింగ్ మంత్రుల సలహాపై ప్రక్కనే ఉన్న కొండ ప్రాంతానికి వెళ్ళి తలదాచుకున్నాడు. ఆ దాడిలో వీరోచితంగా ప్రతిఘటించి, మరణించిన జైమల్, పట్టాలకు గౌరవ సూచకంగా

ఏనుగులపై కూర్చున్న వారి రాతి విగ్రహాలను ఆగ్రా కోట మహాద్వారం ఇరువైపులా అక్బర్ ప్రతిష్టింపజేశాడు. ఆ తర్వాత క్రమంగా అనేకమంది రాజపుత్ర రాజులు మొగలు లకు లొంగిపోయారు. మేవాడ్ లోని అధిక భాగం, చిత్తోడ్ కోటతో సహా అక్బర్ వశమైనా, ఉదయపూర్, దాని పరిసర కొండ ప్రాంతాలు రాణా ఉదయసింగ్ ఆధీనంలోనే ఉన్నాయి." అన్నారు మాస్టారు.

"మాస్టారూ! అక్బర్‌ను రాణా ప్రతాప్ తీవ్రంగా ప్రతిఘటించాడని చెబుతారు గదా? ఆ మహావీరుని గూర్చి చెప్పరా?" అడిగాడు మనోహర్.

"చెబుతాను మనోహర్! 1572 లో రాణా ఉదయ్‌సింగ్ వారసుడుగా ఆయన కుమారుడు రాణా ప్రతాప్ గద్దెనెక్కాడు. మొగల్ ఆధిపత్యాన్ని అంగీకరించి, చక్రవర్తికి వ్యక్తిగత నమస్కారం అర్పించవలసిందిగా కోరుతూ రాణా ప్రతాప్ కు అక్బర్ ఎన్నో రాయబారాలను పంపాడు. మాన్‌సింగ్ నాయకత్వంలో ఒక బృందాన్నీ, అలాగే ఇతర రాయబార బృందాలనూ రాణా ప్రతాప్ సాదరంగా ఆహ్వానించాడు. మాన్‌సింగ్ ను రాణా అవమానించాడన్న కథనం ఒకటి ప్రచారంలో ఉంది. ఆ కథనం చారిత్రక వాస్తవం కాదనీ, శతృవులను సైతం గౌరవించే రాణా ప్రతాప్ వ్యక్తిత్వాన్ని కించబరిచే విధంగా ఉన్నదనీ చరిత్రకారులు పేర్కొన్నారు. మాన్‌సింగ్ తర్వాత అక్బర్ పంపిన భగవాన్ దాస్. రాజా తోడర్‌మల్ ల నాయకత్వంలో మరో రెండు రాయబార బృందాలు కూడా రాణాను కలిసి చర్చలు జరిపాయి. ఈ చర్చల పర్యవసానంగా ఒక రాజీ ఒప్పందానికి రాణా ప్రతాప్ సిద్ధమయ్యాడు. అక్బర్ పంపిన సామ్రాజ్యవాద సూచక దుస్తులను కూడా ధరించాడు. తన కుమారుడు అమర్‌సింగ్ ను భగవాన్ దాస్ తో బాటు అక్బర్ ఆస్థానానికి పంపాడు. వ్యక్తిగత నమస్కారం అర్పించడంతో బాటు మొగల్ సామ్రాజ్య సేవకు అమర్‌సింగ్ ను అంకితం చేశాడు. అయితే తానే అక్బర్ వద్దకు వెళ్ళి వ్యక్తిగత నమస్కారం అర్పించాలన్న అక్బర్ కోర్కెను రాణా ప్రతాప్ తిరస్కరించాడు. అలాగే చిత్తోడ్ ను తన

ఆధీనంలోనే పెట్టుకోవాలన్న మొగల్ పాలకుని నిర్ణయానికి కూడా రాణా సమ్మతించలేదు. దానితో అక్బర్ రాజా మాన్‌సింగ్ నేతృత్వంలో ఒక సైన్యాన్ని రాణాపై పోరాడేందుకు పంపాడు. మొగల్ సేనల రాకను వేగుల ద్వారా తెలుసుకున్న రాణా ప్రతాప్, వారు వచ్చే మార్గంలోని పంటపొలాలను నాశనం చేయించాడు. మొగల్ సేనలకు ఎలాంటి ఆహారం, పశుగ్రాసం లేకుండా చేశాడు. రెండు సేనలూ హల్దీఘాట్ వద్ద తలపడ్డాయి. రాణా ప్రతాప్ సేనలకు హకీంఖాన్ నాయకత్వం వహించాడు. కనుక హల్దీఘాట్ యుద్ధాన్ని హిందూ ముస్లిం పోరుగా పరిగణించలేమని ప్రఖ్యాత చరిత్రకారుడు ప్రొ॥ సతీష్‌చంద్ర వ్యాఖ్యానించాడు. యుద్ధంలో మొగల్ సేనలు పైచేయి సాధించిన పరిస్థితుల్లో రాణా ప్రతాప్ యుద్ధభూమి నుండి తప్పించుకున్నాడు. తర్వాత, గెరిల్లా పద్ధతుల్లో దాడులు కొనసాగించాడు. కొండల్లో, అడవుల్లో బిజ్ తెగల మద్ధతుతో ప్రతిఘటన తీవ్రం చేశాడు. అయితే 1579 తర్వాత మొగల్ సేనల ఒత్తిడి ఆగిపోయింది. బెంగాల్, బీహార్, పంజాబ్ లలో తిరుగుబాట్లు జరగడంతో అక్బర్ దృష్టి ఆ ప్రాంతాలవైపు మళ్ళింది. 1585లో అక్బర్ లాహోర్ కు వెళ్ళి, అక్కడే 12 ఏళ్ళపాటు మకాం వేశాడు. 1585 నుండి రాణా ప్రతాప్ పైకి మొగల్ సైనికులను అక్బర్ పంపలేదు. ఈ పరిస్థితిని రాణా తన కనుకూలంగా మార్చుకొని, తన రాజ్యంలోని చాలా ప్రాంతాలను తిరిగి కైవసం చేసుకున్నాడు. కంభాల్‌గఢ్ ను తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. అయితే చిత్తోడ్ కోటను గెలవలేకపోయాడు. తన 51వ ఏట 1597లో బాణం గాయంతో రాణా ప్రతాప్ కన్నుమూశాడు. రాణా ప్రతాప్ వారసునిగా అమర్‌సింగ్ మేవాడ్ గద్దెను అధిష్టించాడు.” అన్నారు మాస్టారు.

“బెంగాల్, బీహార్, పంజాబ్‌లలో తిరుగుబాట్లు ఎందుకు జరిగాయి మాస్టారూ?” అడిగాడు జహంగీర్.

" ఆ తిరుగుబాట్లకు కారణం ఆ ప్రాంత పాలకులలో తాము స్వతంత్రంగా పాలించాలనే తీవ్రమైన కాంక్ష జహంగీర్! అక్బర్ సోదరుడు మీర్జాహకీం కాబూల్ ను పాలిస్తూనే, పంజాబ్ ప్రాంతంలో తిరుగుబాటును ప్రోత్సహించాడు. అలాగే బెంగల్, బీహార్‌లలోని చాలా ప్రాంతాలు తిరుగుబాటుదారుల వశమయ్యాయి. వారు మీర్జాహకీంను తమ నాయకునిగా ఎన్నుకున్నారు. అక్బర్ కు వ్యతిరేకంగా పోరాడాల్సిందిగా ముస్లింలకు పిలుపునిస్తూ మతపెద్దల ద్వారా ఫత్వా కూడా జారీ చేయించారు. అక్బర్ ఒక పెద్ద సైనిక బలగాన్ని తోడర్‌మల్, భగవాన్‌దాస్‌ల నాయకత్వంలో బీహార్, బెంగాల్ ప్రాంతాలకు పంపాడు. అలాగే మీర్జాహకీం పైకి రాజా మాన్‌సింగ్ నాయకత్వంలో మరో సైన్యాన్ని పంపాడు. ఆ తిరుగుబాట్లు అణచివేయబడ్డాయి. అలాగే ఖైబర్ మార్గాన్ని ఆక్రమించిన తిరుగుబాటుదారులపైకి రాజా బీర్బల్ నాయకత్వంలో సైన్యం వెళ్ళింది. తిరుగుబాటుదారులు అణచివేయబడ్డారు గాని, ఆ యుద్ధంలో బీర్బల్ ప్రాణాలు కోల్పోయాడు.

పిల్లలూ! అక్బర్ పాలనకు సంబంధించి మరికొన్ని అంశాలు వచ్చే క్లాసులో తెలుసుకుందాం." అంటూ లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 21వ భాగం. అక్బర్ పాలన - మరికొన్ని విశేషాలు

"పిల్లలూ! అక్బర్ పాలనలోని మరికొన్ని అంశాలు తెలుసుకుందాం. అతను దక్కను మీదకూడా ఆధిపత్యం సాధించదలచుకున్నాడు. అందువలన 1591లో తన అధిపత్యాన్ని అంగీకరించవలసిందిగా కోరుతూ దక్కను పాలకులకు రాయబారం పంపాడు. కాని రాణా ప్రతాప్ వలె తాము కూడా సర్వతంత్ర స్వతంత్ర పాలకులుగా ఉండాలని వాంఛిస్తున్న దక్కను రాజ్యాలు ఆ ప్రతిపాదనను తిరస్కరించాయి. వారు తాము అక్బర్‌తో ఇరుగు పొరుగు రాజ్యాలుగా ఉండటానికి అభ్యంతరం లేదనీ, అయితే అక్బర్ ఆధిపత్యాన్ని అంగీకరించే ప్రశ్నేలేదని తేల్చిచెప్పారు. అహ్మద్‌నగర్ పాలకుడు బుర్హాన్ మరో ముందడుగువేసి, మొగల్ రాయబారిని అవమానించాడు. అక్బర్ తగిన సమయం కోసం వేచిఉండి, బుర్హాన్ మరణానంతరం అతని వారసులు అంతఃకలహాలలో మునిగి ఉండగా, అహ్మద్‌నగర్ పై దాడిచేశాడు. చాలా నెలలపాటు అహ్మద్‌నగర్ కోట ముట్టడి తర్వాత చివరకు 1596 లో ఒక రాజీ కుదిరింది. దాని ప్రకారం అహ్మద్‌నగర్ పాలకుడూ, బాలుడూ, తన మేనల్లుడూ అయిన బహదూర్ తరఫున బహదూర్ మేనత్త చాంద్‌బీబీ, మొగలుల ఆధిపత్యాన్ని అంగీకరించింది. దానికి ప్రతిగా బహదూర్ ను అహ్మద్‌నగర్ రాజుగా మొగల్ పాలకులు గుర్తించారు. చాంద్‌బీబీ బేరర్ ప్రాంతాన్ని మొగలులకు ధారాదత్తం చేసింది. రాజీకి అంగీకరించినా, అహ్మద్‌నగర్ స్వతంత్ర రాజ్యంగా ఉండాలన్న కాంక్ష చాంద్‌బీబీలో చావలేదు. ఆమె బీజపూర్, గోల్కొండ కోటలతో కలిసి సంయుక్తంగా మొగల్ సైన్యంపై దాడిచేసింది. కాని ఆ యుద్ధంలో మొగల్ సైన్యమే విజయం సాధించింది. దానితో మరల చర్చలకు దిగిన చాంద్‌బీబీని కోటలోని ఆమె వైరివర్గం వారు హత్యచేశారు. బహదూర్‌ను గ్వాలియర్ కోటకు తరలించారు.

అదే సమయంలో మాలిక్ అంబర్ అనే సైనికాధికారి నిజాంషాహి రాజవంశానికి చెందిన ఒక రాకుమారుడికి ముర్తాజా నిజాంషా-2 అనే బిరుదునిచ్చి అహ్మద్‌నగర్ గద్దెపై కూర్చోబెట్టాడు. తాను పేష్వా పదవిని

స్వీకరించాడు. తర్వాత అక్బర్ చిన్నకుమారుడు డానియల్, ముర్తాజా నిజాంషా-2 తో ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. దాని ప్రకారం అహ్మద్‌నగర్ రాజ్యంలోని కొన్ని భాగాలు మొగలులకు యీయడం జరిగింది. నిజాంషా-2 మొగలుల ఆధిపత్యాన్ని అంగీకరించాడు. కాని ముర్తాజా యొక్క పేష్వా మాలిక్ అంబర్ అహ్మద్‌నగర్ సామంతరాజ్యంగా ఉండటాన్ని ఇష్టపడలేదు. దానిని ఒక స్వతంత్ర రాజ్యంగా నిలబెట్టాలనుకున్నాడు. అతడు, తాను నేర్చుకున్న మరాఠా సైనికుల సహాయంతో మొగలులపై గెరిల్లా యుద్ధం చేశాడు. మొగలులను చికాకు పరచాడు. అయితే నాందేడ్ వద్ద జరిగిన ప్రత్యక్ష యుద్ధంలో మొగల్ సైన్యాలు మాలిక్ సైన్యాలను ఓడించాయి. కాని మొగల్ సైనికాధికారి మాలిక్ అంబర్ సమర్థతను గమనించి అతనితో చేతులు కలిపాడు. ఈలోగా 1605లో అక్బర్ మరణించడంతో దక్కను రాజ్యాలతో మొగలుల యుద్ధానికి తాత్కాలికంగా తెరపడింది.

పిల్లలూ! అక్బర్ పాలనా కాలంలో జరిగిన అనేక యుద్ధాలను గూర్చి ఇంత వివరంగా ఎందుకు చెప్పానో తెలుసా?" చరిత్ర చెప్పడం ఆపి మాస్టారు ప్రశ్నించారు.

క్లాసంతా మౌనం.

మరల మాస్టారే కొనసాగించారు.

"చరిత్రలో అన్ని కాలాలలోనూ, ప్రతిరాజు లోనూ, అతడు హిందువు అయినా, ముస్లిం అయినా తాను సర్వతంత్ర స్వతంత్రంగా పరిపాలించాలనే కాంక్ష ఉంటుంది. అందుకే ఆదిల్‌షా గాని, తైమూరిద్ వంశానికి చెందిన మీర్జాలు గాని, దక్కను పాలకులు గానీ అక్బర్ పాలనను వ్యతిరేకించి తన స్వాతంత్ర్య కాంక్షను వెలిబుచ్చారు. కాని కొందరు చరిత్రను వక్రీకరించి స్వాతంత్ర్య కాంక్ష రాణా ప్రతాప్ వంటి ఏ ఒకరిద్దరికో ఉన్నదని చెప్పి, చరిత్ర గంథ్రాలు నింపుతున్నారు. భారతదేశ వాస్తవ చరిత్రను వివరంగా చెప్పింది అందుకే." అన్నారు మాస్టారు.

"అర్ధమయింది మాస్టారూ! ఇప్పుడు అక్బరు కాలంనాటి పాలనా సంస్కరణలు చెప్పరా?" అడిగింది సాయిలక్ష్మి

"చెబుతానమ్మా! అక్బర్ రెవెన్యూ పన్నుల వ్యవస్థను షేర్‌షా ఏర్పరచిన పద్ధతిలోనే, దానిని మరింత మెరుగుపరచి అమలుచేశాడు. ఈ వ్యవస్థలో రైతులు స్థానిక ఉత్పత్తి, స్థానిక ధరల ఆధారంగా తమ వాటాను ప్రభుత్వానికి చెల్లించేవారు. దీనివల్ల ఎన్నో ప్రయోజనాలు ఉండేవి. సాగులో ఉన్న భూమిని కొలతలు వేసిన తర్వాత రాజ్యానికీ, రైతులకూ పంటలో తమ వాటా ఎంత వస్తుందనే విషయం స్పష్టమయ్యేది. కరువు లేదా వరదల వల్ల పంట నష్టం సంభవిస్తే, రైతులను పన్ను నుండి మినహాయించేవారు. అలాగే రైతులకు విత్తనాలు, వ్యవసాయ ఉపకరణాలు, పశువుల కొనుగోలుకు రుణాలు అందించి, ఆ తర్వాత వంతుల వారీగా వసూలు చేసేవారు. కొలతల వ్యవస్థ, దాని ఆధారంగా చేసే అంచనాను జబ్తీ వ్యవస్థ అని పిలిచేవారు. ఈ జబ్తీ వ్యవస్థను రాజా తోడర్‌మల్ రూపొందించారు. తోడర్‌మల్ అంతకు ముందు షేర్‌షా కొలువులో పనిచేశాడు. ఇక సైనిక విషయాల కొస్తే, సంస్థానాదీశుల బలగం మిశ్ర జాతులతో, అంటే మొగల్, రాజపుత్ మిశ్రమంగా ఉండేలా సైనికబలగాల్లో స్థానం కల్పించేవారు. ఆవిధంగా, ప్రాంతీయ, మత శక్తులను బలహీనం చేసేందుకు అక్బర్ ప్రయత్నించాడు. అంతకు ముందు మొగల్, రాజపుత్ సంస్థానాధీశులు తమ వర్గం వారినే తమ బలగాల్లోకి తీసుకొనేవారు. తుపాకుల తయారీని అక్బర్ ప్రోత్సహించి, ఏనుగు లేదా ఒంటె పై తీసుకెళ్ళడానికి వీలుపడే తుపాకులను రూపొందింపజేశాడు. అక్బరు అనేక సాంఘిక సంస్కరణలు కూడా చేశాడు. వాటిలో సతీసహగమనాన్ని నిషేధించడం, విధవా పునర్వివాహాన్ని చట్టబద్ధం చేయడం ముఖ్యమైనవి.

విద్యా వ్యవస్థను గూడా అక్బర్ సంస్కరించాడు. పాఠ్యాంశాలలో నైతిక విద్యతో బాటు, గణితం, వ్యవసాయం, ఖగోళశాస్త్రం, పరిపాలనా శాస్త్రం, తత్వశాస్త్రం, చరిత్ర మొదలైన వాటికి అధిక ప్రాధాన్యత ఇప్పించాడు.

పాలనకు సంబంధించిన మరో ముఖ్య విషయం చెబుతాను. తెల్లవారు తమ ప్రాబల్యాన్ని భారతదేశంలో పెంపొందించుకోవడానికి అక్బరు కాలం నుండీ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. అయితే మొగల్ సామ్రాజ్యం బలంగా ఉండటంతో ఆనాడు వారి ఆటలు సాగలేదు. అక్బరు పాలనను చికాకు పెట్టే ప్రయత్నాలు పోర్చుగీసు వారు ఆరంభించారు. మక్కాకు తీర్థయాత్రపై వెళుతున్న యాత్రీకులను పోర్చుగీసు నావికాదళం అడ్డుకునేది. రాచరిక కుటుంబానికి చెందిన మహిళలను గూడా వారు వేధించేవారు. తమకు ఆధిపత్యం ఉన్న ప్రాంతాలలో పోర్చుగీసు సైనికులు కిరాతక చర్యలకు పాల్పడటం అక్బర్ కు ఆగ్రహాన్ని తెప్పించింది. సకాంలో ఒక మొగల్ సైనికాధికారిని పంపి పోర్చుగీసు సైన్యాన్ని వెనుకకు నెట్టివేయించాడు. దానితో పోర్చుగీసు వారు కొంతకాలం తమ చర్యలను వ్యాపారానికే పరిమితం చేశారు." అన్నారు మాస్టారు.

"అక్బరు మత విధానం ఎలా ఉండేది మాస్టారూ?" అడిగాడు డేనియల్.

"అక్బరు తన తండ్రి, తాతలు అవలంభించిన పరమత సహనం అనే ఉదారవాద విధానాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళాడు డేనియల్ ! సర్వాధికారాలు, తన సంరక్షకుడు గా ఉంటున్న బైరాంఖాన్ నుండి తన చేతుల్లోకి తీసుకున్న తర్వాత అక్బర్ తీసుకున్న విధానపరమైన మొట్టమొదటి నిర్ణయం ముస్లిమేతరులపై విధించబడిన జిజ్యాను రద్దు చేయడం. అంతేకాక, ప్రయాగ, వారణాసి లాంటి తీర్థయాత్రా స్థలాల్లో పుణ్యస్నానాలు ఆచరించే వారిపై విధించే పన్నును కూడా అక్బర్ రద్దు చేశాడు. రాజపుత్రులతో వివాహ సంబంధాలు కలుపుకొని హిందూ-ముస్లిం ఐక్యతకు కృషి చేశాడు. అంబర్ పాలకుడు భారామల్ కుమార్తె హర్కాబాయిని వివాహం చేసుకున్నాడు. ఇంకా జై సల్మేర్, బికనేర్ పాలకులతో కూడ అక్బర్ బంధుత్వం ఏర్పరచుకొన్నాడు. జోధ్‌పూర్ రాణా ఉదయ్‌సింగ్ కుమార్తె జగత్‌గోసెన్ (జోధాబాయి) తో తన పెద్దకుమారుడు సలీంకు వివాహం జరిపించాడు. అలాగే తన కొత్త రాజధాని ఫతేహ్‌పూర్

సిక్రీ లో అక్బర్ ఇబాదత్‌ఖానా (ప్రార్ధనా మందిరం) ను నిర్మింపజేశాడు. దానిలో మత చర్చలు ప్రారంభించాడు. ఆ ప్రార్ధనా మందిరానికి అక్బర్ మత ప్రబోధకులు, సూఫీబాబాలు, విద్వాంసులు, మేధావులు, ఉన్నతాధికారులను పిలిపించేవారు. వారితో మతపరమైన, ఆధ్యాత్మిక అంశాలను ఆయన చర్చించేవారు. "నా ఏకైక లక్ష్యం సత్యాన్వేషణ. నిజమైన మతసారాన్ని, సూక్తులను అన్వేషించి, వాటిని ప్రచారం చేయడం" అని అక్బర్ వారితో అనేవాడు. ఇబాదత్‌ఖానాలోకి క్రైస్తవులు, జోరాస్ట్రియన్లు, హిందువులు, జైనులు, బౌద్ధులు చివరకు నాస్తికులను గూడా పిలిపించి, వారి మత సూక్తులు ఆయన అడిగి తెలుసుకొనేవారు. అంతేకాదు. దీనితో అక్బర్ ను మతద్రోహి గా నిందిస్తూ అనేక ఫత్వాలను ఖాజీలు జారీచేశారు. అక్బర్ ఆ మతపెద్దలను కఠినంగా శిక్షించాడు.

మతపరమైన చర్చల పర్యవసానంగా, అక్బర్ అన్ని మతాల్లోనూ మానవులకు ఉపయోగపడే అంశాలున్నాయనీ, ఉమ్మడి అంశాలపై దృష్టి పెడితే సమాజంలో శాంతి, సద్భావనను పెంపొందించవచ్చుననీ, ఫలితంగా దేశం బాగుపడుతుందనీ భావించాడు. "ప్రతి మతంలోనూ వివేచనగల వ్యక్తులున్నప్పుడు, ప్రతి మతంలోనూ జ్ఞానం ఉన్నప్పుడు, సత్యాన్ని ఒక్క మతానికే ఎందుకు పరిమితం చేయాలి?" అని అక్బర్ భావించాడని అక్బర్ సమకాలీకుడైన చరిత్రకారుడు బదౌనీ రాశాడు. చివరకు అక్బర్ ఒక కొత్త మతాన్ని స్థాపించాడు. దానిని బదౌనీ 'తాహీద్–ఎ–ఇలాహీ' అని పిలిచాడు. దానిని తర్వాత చరిత్రకారులు 'దీన్–ఇలాహీ' అని పిలిచారు. విశేషం ఏమిటంటే, అక్బర్ తన మతంలో చేరమని ఎవరినీ ఒత్తిడి చేయలేదు. అందువలన ఆయన మతంలో 5,6 గురు మాత్రమే చేరారు. అక్బర్ మరణం తోనే దీన్–ఇలాహీ అంతరించింది.

ఇవీ పిల్లలూ! అక్బర్ పాలన, ఆయన కాలం నాటి విశేషాలు. వచ్చే క్లాసులో జహంగర్, షాజహాన్ ల కాలం నాటి విశేషాలు తెలుసుకుందాం." అంటూ లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 22వ భాగం. జహంగీర్, షాజహాన్ ల కాలం

“పిల్లలూ! అక్బర్ మరణంతో 1605 లో జహంగీర్ మొగల్ పాదుషా అయ్యాడు. జహంగీర్ సాధించిన యుద్ధ విజయాల్లో ప్రధానమైనది మేవాడ్ వివాదాన్ని పరిష్కరించడం. రాణా ప్రతాప్ వారసునిగా గద్దెనెక్కిన అమర్‌సింగ్ పై అనేక సార్లు పెద్ద పెద్ద సైనిక బలగాలను జహంగీర్ పంపాడు. పర్వత ప్రాంతాలలో జరిగిన యుద్ధాలతో విసిగిపోయిన రాజపుత్ర సర్దార్లు చాలామంది మొగల్ శిబిరంలో చేరిపోయారు. మిగిలిన వారు శాంతి ఒప్పందం కుదుర్చుకోవలసిందిగా రాణా అమర్‌సింగ్ పై తీవ్రమైన ఒత్తిడి తీసుకువచ్చారు. అదీగాక రాణా ప్రతాప్ కాలం నుండి వ్యవసాయ భూములను బీడు పెట్టడంతో వ్యవసాయ సరఫరాలు బాగా తగ్గిపోయాయి. దానితో అమర్‌సింగ్, జహంగీర్ తో శాంతి ఒప్పందం చేసుకున్నాడు. దాని ప్రకారం తన కుమారుడు కరణ్‌సింగ్ ని జహంగీర్ ఆస్థానానికి పంపాడు. కరణ్‌సింగ్ ని జహంగీర్ సాదరంగా ఆహ్వానించాడు. అతనికి తన సైన్యంలో ఒక ఉన్నతమైన హోదాను కల్పించాడు. అదేమిటంటే మొగల్ సామ్రాజ్యానికి 1500 మంది అశ్వికులతో సేవలందించే బాధ్యతను కరణ్‌సింగ్ పై ఉంచాడు. అయితే రాణా అమర్‌సింగ్ ప్రతిష్టకు భంగం వాటిల్లకుండా చూసేందుకుగాను అతని వ్యక్తిగత నివాళిని జహంగీర్ కోరలేదు. చిత్తోడ్ తో సహా మేవాడ్ రాజ్యానికి సంబంధించిన ప్రాంతాలన్నీ, తిరిగి అమర్‌సింగ్ వశమయ్యాయి. అయితే చిత్తోడ్ కు వ్యూహాత్మక స్థావరంగా గుర్తింపు ఉండటంతో, ఆ కోటను బలోపేతం చేసే ఎలాంటి చర్యలకు పాల్పడరాదని అమర్‌సింగ్ కు జహంగీర్ షరతు విధించాడు. ఆ విధంగా మేవాడ్ సమస్యను జహంగీర్ పరిష్కరించడమేగాక, రాజపుత్రులతో సంబంధాలను మరింత పటిష్టంచేశాడు. దానికోసం కచ్‌వాహా, జోధ్‌పూర్, సల్మేర్, బికనేర్ రాజపుత్రికలను జహంగీర్ వివాహమాడాడు. పై రాజవంశాలకు తన సామ్రాజ్యంలో ఉన్నత పదవులు కట్టబెట్టి, వారికి ఎనలేని గౌరవప్రతిష్టలను కల్పించాడు.

ఈలోగా దక్కన్‌లో అహ్మద్‌నగర్ పేష్వా మాలిక్ అంబర్ ప్లేటు ఫిరాయించి, బీజపూర్ సైన్యం, మరాఠాల మద్దతుతో మొగల్ సైనికాధికారి అబ్దుల్ రహీం

పై దాడిచేశాడు. అబ్దుల్ రహీం వెనుకడుగు వేశాడు. తర్వాత జహంగీర్ మరో పెద్ద సైన్యాన్ని పంపినా, వారు కూడా అంబర్‌ను ఎదుర్కోలేకపోయారు. మాలిక్ అంబర్ విధించిన షరతులకు అంగీకరించి, మొగలులు శాంతి ఒప్పందాన్ని కుదుర్చుకొని అహ్మద్‌నగర్‌ను వదిలేసి వెనుదిరగవలసివచ్చింది. అహ్మద్‌నగర్ సర్వతంత్ర స్వతంత్ర రాజ్యంగా ఉండాలన్న మాలిక్ అంబర్ కలలు నిజమయ్యాయి. అయితే అతను కలలుగన్న స్వతంత్ర రాజ్యం ఎక్కువ కాలం నిలువలేదు. తర్వాత కొంత కాలానికి అబ్దుల్ రహీం, జగ్దేవ్‌రాయ్, బాబూజీకాటే, ఉదాజీరామ్, మొదలైన మరాఠా వీరులను మెల్లగా తన వైపుకు తిప్పుకున్నాడు. వారి సాయంతో 1616 లో బీజాపూర్, అహ్మద్‌నగర్, గోల్కొండల సంకీర్ణ సైన్యాన్ని కోలుకోలేని విధంగా అబ్దుల్ రహీం దెబ్బతీశాడు. పరాజయంతో దక్కన్ రాజ్యాల మధ్య పాతకక్షలు భగ్గుమన్నాయి. అహ్మద్‌నగర్, బీజాపూర్ రాజ్యాల మధ్య ఘర్షణలు పెరిగాయి. ఈ అంతర్గత పోరాటాలు 1628 లో మొగల్ సింహాసనాన్నధిష్టించిన షాజహాన్ కాలంలో కూడా కొనసాగాయి. వారిపై మొగలుల దాడులు కూడా ముమ్మరంగా పెరిగాయి. చివరకు అహ్మద్‌నగర్ మొగలుల వశమైంది. గోల్కొండ కూడా మొగలుల సంరక్షణలోకి వచ్చింది. బీజాపూర్ పాలకుడు కూడా మొగలులకు కప్పం చెల్లించడానికి ఒప్పుకున్నాడు. ఆ విధంగా షాజహాన్ దక్కను రాజ్యాల సమస్యను పరిష్కరించాడు.” అన్నారు మాస్టారు.

“దక్కను రాజ్యాల అంతర్గత కలహాలు, మొగలులతో వారి పోరాటాల ప్రధాన ఫలితమేమిటి మాస్టారూ?” అడిగాడు తేజ.

“చెబుతాను తేజా! ఈ కలహాలలో మరాఠాలు ఏదో ఒకవైపు నిలబడి, ధైర్యంగా పోరాడారు. వారు అనేకసార్లు తమ విధేయయతను మార్చుకున్నారు. ఉదాహరణకు శివాజీ తండ్రి షాజీభోంస్లే, మొదట్లో బీజాపూర్ సంస్థానసేవలో ఉండేవాడు. తర్వాత అతడు మొగల్ సేనలో చేరాడు. తర్వాత అతడు అహ్మద్‌నగర్ రాజ్యసేనలో చేరాడు. ఏ పాలకుడి సైన్యంలో చేరినా మరాఠాలు నిజాయితీగా, క్రమశిక్షణతో పోరాడారు. విజయాలు సాధించిపెట్టారు. ఆ విజయాలు మరాఠాలలో నైతిక స్థైర్యాన్ని పెంపొందించాయి. రాజ్య వ్యవహారాలలో తాము స్వతంత్రంగా నిలబడి విజయాలు సాధించగలమనే ఆత్మ విశ్వాసాన్ని పెంచాయి.

ఈ పరిస్థితే తరువాత కాలంలో శివాజీలో మరాఠా స్వతంత్ర రాజ్యంగా స్థాపించాలనే కోరికకు బీజాలు వేసింది. దక్కను రాజ్యాలు అంతర్గత కలహాలతో బలహీనమైన కారణంగా గోల్కొండకు చెందిన మీర్‌జుమ్లాలు లేదా వజీర్లలో కూడా స్వతంత్ర కాంక్ష పెరిగి, వారు తమ స్వంత రాజ్యాలను ఏర్పాటుచేసుకున్నారు.” అన్నారు మాస్టారు.

“మొగలుల పాలనలోకి వెళ్ళేవరకు దక్కను రాజ్యాల పాలనకు సంబంధించిన ముఖ్య విశేషాలేమిటి మాస్టారూ?” అడిగాడు సుఖదేవ్.

“సుఖదేవ్! పరిపాలనకు సంబంధించి నంతవరకు దక్కను రాజ్యాల పాలకులు హిందువులకు మంచి పదవులిచ్చి, వారి సేవలను వినియోగించుకోవడం ఒక ముఖ్య విశేషం. బీజాపూర్ పాలకుడు ఆదిల్‌షా తన విశాలమైన గ్రంథాలయానికి అధికారిగా వామన్ పండిట్ అనే సంస్కృత పండితుని నియమించాడు. అతని వారసుడు ఆదిల్‌షా-2 పేదవర్గాలపై ఎక్కువ దయ చూపేవాడు. అందుకే అతనికి అబ్లా బాబా అంటే పేదల మిత్రుడు అనే బిరుదు వచ్చింది. అతడు స్వయంగా సరస్వతీదేవిని స్తుతిస్తూ పాటలు వ్రాశాడు. పంధార్‌పూర్ లోని వితోబా దేవాలయానికి జాగీరును మంజూరుచేశాడు. అహ్మద్‌నగర్ పాలకుడైన ఇబ్రహీం కుతుబ్‌షా పాలనలో మురహరిరావు పేష్వా స్థాయికి ఎదిగాడు. అలాగే 1672 నుండి, గోల్కొండ మొగలుల నియంత్రణలోకి వెళ్ళేవరకు అంటే 1687 వరకు, గోల్కొండ రాజ్య పరిపాలనా, సైనిక వ్యవహారాలను మాదన్న, అక్కన్న సోదరులే నియంత్రించారు.

ఇక ప్రాంతీయ భాషాభివృద్ధికి సంబంధించినంతవరకు, దక్కన్ రాజ్యాల్లో, 17వ శతాబ్దిలో ఆ రాజ్యాలు పతనమయ్యే వరకు, అధికారిక నివేదికలను పార్శీతో బాటు, ప్రాంతీయ భాషల్లో కూడా రూపొందించేవారు.

పిల్లలూ! ఇవీ జహంగీర్, షాజహాన్‌ల కాలంనాటి రాజ్య విస్తరణ విశేషాలు, దక్కను రాజుల పరిపాలనా విశేషాలు. వచ్చే క్లాసులో ఔరంగజేబు కాలంనాటి విశేషాలు చెప్పుకుందాం” అంటూ లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 23వ భాగం. ఔరంగజేబు కాలం

"పిల్లలూ! ఈరోజు ఔరంగజేబు కాలం నాటి విశేషాలు తెలుసుకుందాం. షాజహాన్ పాలన చివరిరోజుల్లో అతడి కుమారుల మధ్య తీవ్రస్థాయిలో వారసత్వ పోరు జరిగింది. మధ్య యుగాలలో వారసత్వ న్యాయ సూత్రాలు స్పష్టంగా లేనందువలన హిందూ, ముస్లిం మతాలకు చెందిన రాకుమారులకు వారసత్వ యుద్ధాలు అనివార్యమయ్యాయి. ఉదాహరణకు, రాణా సంఘా సింహాసనంపై తన హక్కును పూర్తిగా చాటుకోవడానికి తన సోదరులతో సుదీర్ఘమైన పోరు జరపాల్సి వచ్చింది. షాజహాన్ కుమారుల మధ్య జరిగిన వారసత్వ పోరులో ఔరంగజేబు గెలిచి 1659లో ఢిల్లీ సింహాసనమెక్కాడు. అతడు సుమారు 50 ఏళ్ళపాటు పాలించాడు. అతడి పాలనలో మొగల్ సామ్రాజ్యం ఎంతో విస్తరించింది. ఉత్తరాన కాశ్మీర్ నుండి దక్షిణాన జింజీ వరకు, పశ్చిమాన హిందూకుష్ పర్వతాల నుండి ఈశాన్యాన చిట్టగాంగ్ వరకు ఔరంగజేబు పాలన క్రిందకు వచ్చింది.

వారసత్వ పోరు ముగిసి, ఔరంగజేబు సింహాసనంపై స్థిరపడిన తర్వాత చేసిన తొలి కార్యక్రమం ఏమిటంటే, వారసత్వ పోరు సమయంలో మొగలులు కోల్పోయిన ప్రాంతాలను తిరిగి స్వాధీనం చేసుకోవడం. ఆ తర్వాత ఔరంగజేబు అస్సాం పాలకులైన అహోంలతో సుదీర్ఘ యుద్ధం చేయవలసివచ్చింది. గౌహతి నుండి మొగలులను తరిమి వేయడానికి అహోంలు ప్రయత్నించడంతో, వారిద్దరి మధ్యా యుద్ధం మొదలైంది. అహోంలతో సుమారు 15 ఏళ్ళ పాటు పోరాడిన మొగలులు చివరికి గౌహతిని కూడా వదులుకున్నారు. ఈ కాలంలో మొగల్ సైన్యాలకు అంబర్ పాలకుడు రాజా రాంసింగ్ నాయకత్వం వహించాడు. అతడు అహోంలను లొంగతీయలేక, గౌహతికి పశ్చిమాన మొగల్ సరిహద్దును నిర్ణయించి యుద్ధాన్ని ముగించాడు.

ఈ లోపల తన సామ్రాజ్యంలో జాట్‌లు, ఆఫ్ఘన్లు, సిక్కులు, రాజపుత్రులు, మరాఠాల నుండి ఔరంగజేబు రాజకీయ ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చింది. వాటిని ఒక్కొక్కటీ పరిశీలిద్దాం.

మొదటగా జాట్‌ల ప్రతిఘటనను పరిశీలిద్దాం. మొగలుల పాలనలో జాట్‌లు పొలాలను సాగుచేసే రైతులుగా ఉండేవారు. భూమి శిస్తును వసూలు చేసే జమీందార్లుగా రాజ్‌పుత్‌లు ఉండేవారు. ఇది వారిద్దరి మధ్య వివాదంగా మారి, అది చివికి చివికి గాలివానగా మారి, రాజ్‌పుత్‌ల తరఫున మొగల్ సైన్యం జోక్యం చేసుకోవలసి వచ్చింది. జాట్‌లు మొగల్ సైన్యాన్ని ప్రతిఘటించడం మొదలెట్టారు. వారు ప్రధానంగా గెరిల్లా యుద్ధ పద్ధతిని అనుసరించారు. ఈ పోరాటంలో స్థానిక హిందూ జమీందార్లందరూ మొగలులకు మద్దతుగా పోరాడారు. జాట్ల తిరుగుబాటు 1691 నాటికి అణచివేయబడింది.

ఇక ఆఫ్ఘన్ల ప్రతిఘటనను పరిశీలిద్దాం. విశేషం ఏమిటంటే, ఆఫ్ఘన్లు ముస్లింలే అయినా మొగలుల పాలన నుండి స్వాతంత్ర్యం కోసం పోరాడారు. 1667లో ఆఫ్ఘన్లు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని, మహమ్మద్‌షా అనే వ్యక్తిని రాజుగా ఎంపిక చేసుకున్నారు. ఆ స్వతంత్ర రాజ్యాన్ని అణచడానికి ఔరంగజేబు తన ప్రధాన బక్షీ అమీర్‌ఖాన్ ను, అతని వెంట రాజపుత్ర సైన్యాన్ని పంపాడు. మొగలుల వరుస దాడులతో ఆఫ్ఘన్ల ప్రతిఘటన కూలిపోయి, వారి లొంగిపోయారు. ఆఫ్ఘన్‌లలో స్వాతంత్ర్య కాంక్షను పూర్తిగా అణచివేసేందుకోసం, ఔరంగజేబు 1671 లో మార్వార్ పాలకుడు మహారాజా జస్వంత్‌సింగ్ ను జమ్రూద్ థానేదారు గా నియమించాడు.

అయినా, 1672 లో ఆఫ్ఘన్లు మరోసారి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొని, తమ నాయకునిగా అక్మల్‌ఖాన్ ను ఎంపిక చేసుకున్నారు. అక్మల్‌ఖాన్ తనను తానే రాజుగా ప్రకటించుకొని తన పేరు మీద మసీదుల్లో ప్రార్థనలు చేయించాడు; నాణేల ముద్రణ ప్రారంభించాడు. మొగల్ పాలనకు వ్యతిరేకంగా యుద్ధాన్ని

ప్రకటించాడు. క్రమంగా ఇతర ఆఫ్ఘన్ సమూహాలు కూడా అక్మల్‌ఖాన్ తో చేతులు కలిపాయి. యుద్ధం 2,3 ఏళ్ళపాటు సాగింది. ఒక దశలో మొగల్ సంస్థానాధీశుడు షుజాత్‌ఖాన్ ప్రాణాపాయంలో పడితే, జస్వంత్‌సింగ్ పంపిన రాథోర్ వీరుల సైన్యం షుజాత్‌ను కాపాడింది. చివరకు ఔరంగజేబు దౌత్యనీతితో ఆఫ్ఘన్ల ఐక్యకూటమిని విచ్ఛిన్నంజేసి వారిని 1675 నాటికి అణచివేయగలిగాడు." అన్నారు మాస్టారు.

"ఇక సిక్కుల విషయం చెప్పండి మాస్టారూ!" అడిగింది విప్లవ.

"చెబుతానమ్మా! సిక్కులకూ, మొగలులకూ మధ్య 1675 వరకూ సంబంధాలు బాగుండేవి. గురు హరికిషన్ కుమారుల్లో ఒకడు ఔరంగజేబు ఆస్థానంలో కొంతకాలంపాటు ఉన్నాడు. గురు తేజ్ బహదూర్ గురువుగా బాధ్యతలు చేపట్టిన తరువాత, అంబర్ పాలకుడు రాజా రాంసింగ్‌తో బాటు కొన్నాళ్ళు మొగల్ సామ్రాజ్యానికి సేవలు అందించాడు. అయితే 1675లో గురు తేజ్ బహదూర్ ను ఔరంగజేబు అదుపులోకి తీసుకొని, హత్య చేయడంతో, సిక్కుల ప్రతిఘటన ఆరంభమయింది. ఔరంగజేబు ఈ చర్యను శాంతిభద్రతల పరిరక్షణ అంశంగా ప్రకటించినా, ఆ చర్య, సిక్కులలో స్నేహ, సోదర భావాలను పెంపొందించింది. తేజ్ బహదూర్ తర్వాత సిక్కు గురువైన గురుగోవింద్‌సింగ్ 1699 లో ఖాల్సాను స్థాపించి, సిక్కులను బలమైన సైనిక వీరులుగా తయారుచేశాడు. మొదట్లో స్థానిక హిందూ పాలకులు తమ అంతర్గత సమస్యలను పరిష్కరించేందుకు గురును, ఆయన అనుచరులను వాడుకున్నా, క్రమంగా గురు వాళ్ళపైనే కయ్యానికి కాలుదువ్వాడు. చివరకు 1704 లో హిందూ రాజ్యాలకూ, గురు గోవిందసింగ్ కూ మధ్య ప్రత్యక్ష యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో గురు గెలుపొందడంతో హిందూ రాజులు వెనక్కి తగ్గి, గురుకు వ్యతిరేకంగా తమ పక్షాన జోక్యం చేసుకోవలసిందిగా ఔరంగజేబును ఆహ్వానించారు. అప్పుడు ఔరంగజేబు, గురు కు వ్యతిరేకంగా పోరాడుతున్న

స్థానిక రాజులకు సహాయం చేయమని తన ఫౌజ్‌దార్ (సేనాని) ని ఆదేశించాడు. మొగలులకు, గురు గోవిందసింగ్ కు మధ్య జరిగిన యుద్ధంలో గురు కుమారుల్లో ఇద్దరు మరణించారు. మరో ఇద్దరిని మొగలు సైన్యం బంధీలుగా పట్టుకొని, వారిని ఇస్లాం మతం స్వీకరించవలసిందిగా ఒత్తిడి చేసింది. వారు నిరాకరించడంతో, వారిని మొగల్ సైనికులు హత్య చేశారు. తర్వాత గురు తల్వండీకి పోయి, అక్కడ స్థిరపడిపోయాడు. అక్కడ అతనిపై మొగల్ సైనికులు దాడి చేయలేదు." అని ఒక్క నిముషం ఆగారు మాస్టారు.

" తర్వాత ఏం జరిగింది మాస్టారూ?' అసక్తిగా అడిగాడు అభినంద్.

"చెప్తాను అభినంద్! ఔరంగజేబు లాహోర్ సుబేదారు కు లేఖ రాసి, గురుతో శాంతి ప్రక్రియను మొదలు పెట్టాల్సిందిగా ఆదేశించాడు. జరిగిన పరిణామాలను వివరిస్తూ, గురు ఔరంగజేబు కు లేఖ రాశాడు. ఆ సమయంలో ఔరంగజేబు దక్కనులో ఉన్నాడు. తన వద్దకు వచ్చి సంప్రదింపులు జరపవలసిందిగా ఔరంగజేబు గురు గోవిందసింగ్ ను ఆహ్వానించాడు. ఔరంగజేబు ను కలుసుకొనేందుకు గురు దక్కనుకు బయలుదేరాడు. అయితే, మార్గమధ్యంలోనే ఔరంగజేబు మరణవార్తను గురు అందుకొని వెనుదిరిగాడు. ఔరంగజేబు మరణం తర్వాత సిక్కుల ప్రత్యేక రాజ్య కాంక్ష మరింత బలం పుంజుకుంది" అన్నారు మాస్టారు.

"రాజపుత్రులతో ఔరంగజేబు సంబంధాలు ఎలా ఉండేవో వివరిస్తారా మాస్టారూ?" అడిగాడు జాన్.

"తప్పకుండా చెబుతాను జాన్! రాజపుత్రులతో మంచి సంబంధాలు కొనసాగించాలని ఔరంగజేబు కోరుకున్నాడు. మేవాడ్ మహారాణా మున్సబ్ హోదాను పెంచాడు. వారసత్వ యుద్ధంలో జస్వంత్‌సింగ్ తన అన్న దారాకు ఆశ్రయం ఇచ్చాడని తెలిసినప్పటికీ, జస్వంత్‌సింగ్‌కు మునపటి మున్సబ్ హోదాను పునరుద్ధరించాడు. అతనికి గుజరాత్ సుబేదారీ బాధ్యతను

అప్పజెప్పాడు. అలాగే ఔరంగజేబు మరణించే వరకు, రాజా జయసింగ్ అతనికి అత్యంత ఆప్తునిగా ఉండేవాడు. జస్వంత్‌సింగ్ మరణానంతరం ఆయన అన్న మనుమడు ఇందర్‌సింగ్ కు జోధ్‌పూర్ సింహాసనాన్ని అప్పగించాడు. అంతేకాని, ఆ రాజ్యాన్ని జస్వంత్‌సింగ్ మైనర్ కుమారులలో, ఎవరో ఒకరికి ఇవ్వడానికి ఇష్టపడలేదు. అయితే దుర్గాదాస్ అనే రాథోర్ వీరుని నాయకత్వంలో రాథోర్ సర్దార్లు ఔరంగజేబు చేసిన పనిని వ్యతిరేకించారు. వారు జోధ్‌పూర్‌లో ఒక మైనర్ రాకుమారుని సింహాసనం పై ప్రతిష్టించారు. దుర్గాదాస్ కు మేవార్ రాణా కూడా తోడు నిలిచాడు. వారికీ, ఔరంగజేబుకూ మధ్య ప్రత్యక్ష యుద్ధం ప్రారంభమయింది. అదే సమయంలో ఔరంగజేబు పెద్ద కుమారుడు అక్బర్ తిరుగుబాటు చేశాడు. అక్బరు కు సాయంగా దుర్గాదాస్ నిలబడ్డాడు. ఐతే ఔరంగజేబు భేదోపాయాన్ని ప్రయోగించి, అక్బర్ శిబిరంలో ఉన్న వారిలో ఒకరిపై ఒకరికి అనుమానాలు సృష్టించి, అక్బర్ మహారాష్ట్రకు పారిపోయటట్లు చేశాడు. ఆ దశలో ఔరంగజేబు రాజపుత్రులతో రాజీ ఒప్పందాలు చేసుకున్నాడు గాని ఔరంగజేబు మరణించే వరకు రాజపుత్రులతో సంబంధాలు పూర్తిగా పూర్వపు స్థాయికి రాలేదు. అయితే, ఆ లోపాన్ని ఔరంగజేబు తన పాలకవర్గంలోకి ఎక్కువ సంఖ్యలో మరాఠాలను చేర్చుకోవడం ద్వారా పూరించగల్గాడు.

ఇవీ పిల్లలూ! ఔరంగజేబు కాలంనాటి కొన్ని విశేషాలు. వచ్చే క్లాసులో శివాజీని గూర్చి అనేక విషయాలు తెలుసుకుందాం.” అంటూ మాస్టారు లేచారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 24వ భాగం. శివాజీ జీవితం - పాలనా విశేషాలు

"పిల్లలూ, ఈరోజు ఔరంగజేబును ఎదిరించి నిలిచిన శివాజీ జీవితాన్ని గూర్చి, ఆయన పాలనా విశేషాలూ చెబుతాను" అంటూ మాస్టారు చెప్పడం మొదలెట్టారు.

"శివాజీ పుట్టుక నాటికి దేశంలో ఉన్న రాజకీయ పరిస్థితిని ముందుగా వివరిస్తాను. ఆ కాలంలో దేశంలో అనేక వర్గాలలో ప్రత్యేక రాజ్యకాంక్ష ప్రబలింది. ఆ ప్రత్యేక రాజ్యాన్ని సాధించగలమనే ఆత్మవిశ్వాసం కూడా పెరిగింది. అంతకు ముందే ఆఫ్ఘన్ ముస్లింలలోని స్వాతంత్ర్య కాంక్షను తెలుసుకున్నాం. ఆఫ్ఘన్‌ల లాగే గోల్కొండ సామ్రాజ్యపు మీర్‌జుమ్లా కోరమండల్ తీరంలో ఒక చిన్న రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని ప్రయత్నించాడు. అలాగే పశ్చిమ తీరంలో సిద్దీలు అనబడే అబిసీనియా ముస్లిం నాయకులు ప్రత్యేక రాజ్యాలను ఏర్పరచే ప్రయత్నం చేశారు. అదే సమయంలో మరాఠాలలో పెరిగిన ఆత్మవిశ్వాసం, స్వాతంత్ర్య కాంక్షలే శివాజీని మరాఠా ప్రత్యేక రాజ్యాన్ని స్థాపించాలనే ప్రయత్నాలకు పురిగొల్పాయి.

శివాజీ1627 లో జన్మించాడు. తండ్రి షాజీభోంస్లే, తల్లి జిజీబాయి. చిన్నప్పటినుండి స్వంత సామ్రాజ్య స్థాపన కోరిక శివాజీకి బలీయంగా ఉండేది. తన 18వ ఏటనే, అంటే 1645 లోనే అనేక కొండ బురుజులను కొల్లగొట్టి, 1647 నాటికి రాయ్‌గడ్, కొండానా, తోరణ్‌లను స్వాధీనంచేసుకున్నాడు. 1656 లో మరాఠా నాయకుడు చంద్రరావు మోరే అధీనంలోని జావ్లీ కోటను ఆక్రమించాడు. ఆ కోటను మోసపూరిత పద్ధతుల్లో హస్తగతం చేసుకున్నాడని ప్రఖ్యాత చరిత్రకారుడు ప్రొ॥ సతీష్‌చంద్ర, 'మధ్య యుగాల భారతదేశం' అనే గ్రంథంలో తెలియజేశారు. (326వ పేజి.) ఆ తర్వాత తన మేనమామ శంభాజీ మహితే నుండి సూప దుర్గాన్ని స్వాధీనం

చేసుకున్నాడు. ఈ చర్యలతో బీజపూర్ నవాబు ఆగ్రహించాడు. తన సేనానుల్లో ఒకడైన శివాజీ తండ్రి షాజీపై ఒత్తిడి పెంచడం ద్వారా శివాజీని అదుపులో ఉంచాలని ప్రయత్నించసాగాడు. అయితే 1657 లో బీజాపూర్ ను మొగల్ సైన్యం ఆక్రమించడంతో బీజపూర్ పాలకుని నుండి శివాజీకి ముప్పు తొలగింది. మొదట్లో శివాజీ ఔరంగజేబు తో చర్చలకు దిగాడు. అయితే తర్వాత ప్లేటు ఫిరాయించి మొగల్ ప్రాంతాల్లోకి చొచ్చుకొనిపోయి, దోచుకొని, భారీ సంపదను పోగుచేసుకున్నాడు. అయితే, అదే సమయంలో, ఔరంగజేబు బీజాపూర్ పాలకుడితో ఒక అవగాహనకు వచ్చాడు. దానితో బాటు ఔరంగజేబు శివాజీని కూడా క్షమించాడు. కాని శివాజీ విషయంలో బీజాపూర్ పాలకుడికి ఒక సలహా ఇచ్చాడు. శివాజీ ని తన రాజ్యసేవలో నియమించుకోవద్దనీ, ఒకవేళ నియమించాలనుకుంటే, మొగల్ సరిహద్దులకు దూరంగా, కర్నాటక ప్రాంతంలో నియమించమనేదే ఆ సలహా.

ఆ తర్వాత శివాజీ మరింత విజృంభించి, బీజాపూర్ రాజ్యంలో అనేక కొండ బురుజులను ఆక్రమించాడు. అంతేకాదు, బీజాపూర్‌తో స్నేహంగా ఉంటున్న మొగలుల పాలనలోని నగరమైన జున్నార్‌ను లూఠీ చేశాడు. దానితో ఆగ్రహించిన బీజాపూర్ పాలకుడు శివాజీని అణచడానికి అఫ్‌జల్‌ఖాన్ అనే సేనాని నాయకత్వంలో పెద్ద సైన్యాన్ని పంపాడు. గెరిల్లా యుద్ధ పద్ధతులేగాని, ప్రత్యక్ష యుద్ధాలలో అనుభవం లేని శివాజీ కొంచెం జంకాడు. అప్పుడు బీజాపూర్ పాలకుడి నుండి క్షమాభిక్ష ఇప్పించగలనని హామీ ఇస్తూ, తనను వ్యక్తిగతంగా కలిసేందుకు రావాలని అఫ్జల్‌ఖాన్, మరాఠా బ్రాహ్మణుడైన కృష్ణాజీ భాస్కర్‌ను తన దూతగా శివాజీ వద్దకు పంపాడు. వ్యక్తిగత సమావేశంలో ఒకరినొకరు అంతమొందించాలని అఫ్జల్‌ఖాన్, శివాజీ లిద్దరూ నిర్ణయించుకొని, అందుకు తగిన రహస్య ప్రయత్నాలను చేసుకున్నారు. ఆ ప్రయత్నంలో, చురుకైన వాడైన శివాజీయే విజయం సాధించాడు. తనను కౌగిలించుకున్నట్లుగా నటించి, కౌగిలిలో ఉక్కిరిబిక్కిరి చేసి చంపదలచుకొన్న అఫ్జల్‌ఖాన్‌ను, తన చేతికి

తగిలించుకొన్న పులిగోళ్ళతో చీల్చి చంపివేశాడు. నాయకత్వం కొరవడిన అఫ్జల్‌ఖాన్ సైన్యాన్ని ఓడించి, అపారమైన ఆయుధ సామాగ్రిని స్వాధీనం చేసుకున్నాడు. తర్వాత తన సైనిక శక్తిని పెంచుకున్నాడు. పెరిగిన సైన్యంలో అనేక మంది ముస్లింలు ఉండటం ప్రత్యేక విశేషం. ఉదాహరణకు శివాజీ తన నౌకాదళాధిపతిగా దర్యాసారంగ్ దౌలత్‌ఖాన్ అనే ముస్లింను నియమించాడు. కాజీ హైదర్ అనే ముస్లిం ఆయన దౌత్యాధికారి. నూర్‌ఖాన్‌బేగ్ శివాజీ యొక్క పదాతిదళాధికారి. సిద్దీహిలాల్ ఆయన యొక్క సైన్యాధికారుల్లో ఒకడు. ఇలా శక్తి సామర్థ్యాలు పెంచుకున్న శివాజీని అణచివేయడానికి ఈసారి ఔరంగజేబు తన దక్కను సుబేదారైన షైస్తఖాన్ ను శివాజీ పైకి పంపాడు. షైస్తఖాన్ మొదట పూణేను స్వాధీనం చేసుకొని, దానిని తన ప్రధాన స్థావరంగా మార్చుకున్నాడు. ఆ పరిస్థితుల్లో శివాజీ, పకడ్బందీ వ్యూహంతో, కొద్దిమంది అనుచరులతో, రాత్రిపూట షైస్తఖాన్ స్థావరంపై దాడిచేసి, అతనిని చంపబోయాడు. షైస్తఖాన్ తప్పించుకున్నాడు గాని, ఆ దాడిలో అతని బొటనవ్రేలు తెగిపోయింది. అతనికి పరాభవమే మిగిలింది. ఆ తర్వాత కొంత కాలానికి, 1664 జనవరి 16 నుండి 5 రోజుల పాటు సూరత్ నగరంపై దాడిచేసి, ఆ నగరాన్ని విపరీతంగా దోచుకున్నాడు. ఒక కోటి రూపాయల భారీ ఖజానాతో తిరుగుముఖం పట్టాడు. దోపిడీ సమయాల్లో ఒక్కో సైనికుడూ దోచిన సంపదను శివాజీకి సమర్పించాలి. దానిని ఖచ్చింతంగా లెక్కిస్తారు. దానిలో సైనికులకు కొంత వాటా ఇచ్చి మిగిలినది శివాజీ ఖజానాకు చేరుస్తారు. శివాజీ సైన్యం అంత క్రమశిక్షణగా ఉంటుందని చరిత్రకారులు వ్రాశారు.

తర్వాత కొద్ది కాలానికే ఔరంగజేబు రాజా జయసింగ్ నాయకత్వంలో మరో పెద్ద సైన్యాన్ని పంపాడు. శివాజీ తన కుటుంబాన్నీ సిరిసంపదలనూ భద్రపరచిన పురందర్ కోటను, జయసింగ్ ముట్టడించాడు. శివాజీకి ఏ వైపునుండీ సహాయం అందే స్థితి లేకుండా చేశాడు. పరిస్థితిని అర్థంచేసుకున్న శివాజీ, జయసింగ్ తో రాజీ సంప్రదింపులు మొదలుపెట్టాడు. చివరకు

ఈ క్రింది అంశాలతో ఒప్పందం కుదిరింది.

1) శివాజీ ఆధీనంలో ఉన్న 35 కోటల్లో 23 కోటలను మొగల్ సామ్రాజ్యానికి ఇచ్చివేయాలి. మిగిలిన 12 కోటలను శివాజీ ఉంచుకోవచ్చు.

2) బీజాపూర్ కు చెందిన కొంకణ్ ప్రాంతాన్ని, బాలాఘాట్‌ను శివాజీకి వదలివేయాలి.

3) మొగల్ సింహాసనానికి విధేయుడై, శివాజీ తగిన సేవలు చేయాలి.

తనను ఔరంగజేబు యొక్క వ్యక్తిగత నివాళి నుండి మినహాయించాలని శివాజీ కోరాడు. అందుకు అంగీకరించి, అతనికి బదులుగా శివాజీ మైనర్ కుమారుడు శంభాజీకి, ఔరంగజేబు కు వ్యక్తిగత నివాళి అర్పించే అవకాశమూ, దానికి తగిన హోదా కల్పించారు. అయితే భవిష్యత్తులో మొగలులు దక్కనులో చేపట్టే దండయాత్రల్లో తాను స్వయంగా పాల్గొంటానని శివాజీ హామీ ఇచ్చాడు.

ఔరంగజేబు జన్మదినం సందర్భంగా శివాజీ ఆగ్రా వెళ్ళి, ఔరంగజేబును దర్శించి రావాలని జయసింగ్ శివాజీని కోరాడు. శివాజీ అందుకు అంగీకరించి, ఆగ్రాకు తన కుమారుడు శంభాజీతో వెళ్ళాడు. అయితే అక్కడ శివాజీని కలుసుకోవడానికి కూడా ఔరంగజేబు అంగీకరించలేదు. దానితో శివాజీకి కోపం వచ్చి, ఆ వేడుకలను బహిష్కరించి విడిదికి వెళ్ళిపోయాడు.అక్కడ అతడు గృహనిర్బంధంలో ఉంచబడ్డాడు. అయితే శివాజీ, శంభాజీ లిద్దరూ యుక్తిగా మిఠాయి కావళ్ళలో కూర్చొని రహస్యంగా ఆగ్రానుండి పారిపోయి మరాఠా రాజ్యం చేరారు. ఈ రహస్య కార్యక్రమంలో శివాజీతో పాల్గొన్న అతికొద్దిమందిలో మదారి మెహతర్ అనే ముస్లిం ఉండటం ఆ కాలం నాటి మతసామరస్య వాతావరణాన్ని అద్భుతంగా నిరూపిస్తోంది. ఆ తర్వాత కొంత కాలానికి 1670 అక్టోబరులో శివాజీ సూరత్‌పై రెండవసారి దాడిచేసి, దానిని మరల కొల్లగొట్టి, విపరీతంగా ఆనగరాన్ని దోచుకొని, 66 లక్షల రూపాయల దోపిడీ సొమ్ముతో

వెనుదిరిగాడు. అంతేకాదు, పురందర్ తో సహా , మొగల్ పాలకుల అధీనంలో ఉన్న అనేక కొండ బురుజులను తిరిగి ఆక్రమించుకున్నాడు. వాయువ్య సరిహద్దులో ఆఫ్ఘన్‌ల స్వాతంత్ర్య కాంక్షను అణచివేయడంలో మొగల్ సైన్యం తీరికలేకుండా ఉండటం శివాజీకి లాభించింది అదే సమయంలో అనేక తడవలుగా, కనారా గ్రామీణ ప్రాంతాన్ని శివాజీ దోచుకున్నాడు. చివరకు 1674లో రాయ్‌ఘడ్ లో పట్టాభిషిక్తుడైనాడు. పట్టాభిషేకం జరపడానికి మరాతా బ్రాహ్మణులందరూ తిరస్కరించారు. కారణం శివాజీ క్షత్రియుడు కాదనీ, అతడు శూద్రుడనీ, కాబట్టి అతనికి రాజ్యాధికార అర్హత లేదనీ వారి వాదన. శివాజీ అప్పుడు కాశీనుండి గాగభట్టు అనే పండితుడిని పిలిపించి, ఆయన ద్వారా ప్రత్యేక కార్యక్రమంలో క్షత్రియత్వాన్ని స్వీకరించి, మరాతా సామ్రాజ్యానికి రాజుగా పట్టాభిషిక్తుడైనాడు. ఛత్రపతి అనే బిరుదును స్వీకరించాడు.

ఆ తర్వాత శివాజీ, గోల్కొండ నవాబు కుతుబ్‌షా తో ఒక ఒప్పందం చేసుకొని, బీజాపూర్ ఆధీనంలోని ప్రాంతాలపై దాడిచేశాడు. బాధాకరమైన విషయం ఏమిటంటే, ఈ దాడుల్లో హిందూ జనాభా ఎక్కువ ఉన్న మరాతా ప్రాంతాలను విపరీతంగా దోచుకున్నాడు. దోపిడీ సొమ్మును, ఒప్పందం మేరకు కుతుబ్‌షా తో పంచుకోవడానికి శివాజీ నిరాకరించడంతో, ఇద్దరి మధ్యా సంబంధాలు బెడిసికొట్టాయి.

శివాజీ 1680 లో తుది శ్వాస విడిచాడు. తాను మరణించేనాటికి మరాతాలకు ఒక స్వంత రాజ్యాన్ని, అంతకు మించి ఎంతో ఆత్మవిశ్వాసాన్ని అందించివెళ్ళాడు.” అని శివాజీ జీవిత చరిత్రను ముగించారు మాస్టారు.

“శివాజీ పరిపాలనా విశేషాలు చెప్పరా మాస్టారూ?” అడిగింది సాయిజ్యోతి.

“చెబుతానమ్మా! శివాజీ ఏర్పాటుజేసిన పాలనా వ్యవస్థ, తర్వాత చాలా కాలం వరకు మరాధా రాజ్యంలో అనుసరించబడింది. పరిపాలన అంతా

అష్టప్రధానుల సలహాలతో రాజు చేసేవాడు. వారిలో పేష్వా ముఖ్యమైనవాడు. ఇక సైనిక వ్యవస్థకు సంబంధించి, సైనికులకు వేతనాలను నగదు రూపంలో చెల్లించేవారు. దాడులకు వెళ్ళే సమయంలో, సైనికులకు ఒక ముఖ్య ఆదేశం ఇవ్వబడింది. "సైనికులు ఎవ్వరూ తమ భార్యలను గానీ, ఆడ బానిసలను గానీ, నాట్యకత్తెలను గానీ వెంట తీసుకురారాదు. అలా తీసుకువచ్చిన వారి తల తీసివేయబడుతుంది." అనేదే ఆ ఆదేశం. మొగలులు తమ దండయాత్రా సమయాలలో తమ అంతఃపుర స్త్రీలను, ఆడ బానిసలను తెచ్చుకోవడంతో పోల్చి చూసినప్పుడు, సైనికుల క్రమశిక్షణ విషయంలో శివాజీ ఎంత ఆదర్శప్రాయంగా ఉండేవాడో తెలుస్తోంది. నగరాల దోపిడీల విషయంలో కూడా సైనికులకు శివాజీ స్పష్టమైన ఆదేశమిచ్చాడు. అదేమిటంటే, "ఏదైనా ఒక ప్రదేశాన్ని కొల్లగొట్టినప్పుడు, రాగినాణాలు, రాగి, కంచు పాత్రలు, దోపిడీ చేసిన సైనికుడికే చెందుతాయి. కాని, బంగారం, వెండి వస్తువులు, నాణేలు, రత్నమాణిక్యాలు ఏ మినహాయింపులు లేకుండా సైన్యాధికారికి అందించాలి. అతను శివాజీ ధనాగారానికి అందించాలి. ఆ కాలంలో శత్రుదేశ నగరాల లూటీ సర్వసామాన్యం అయినా, సైన్యంలో క్రమశిక్షణ విషయంలో శివాజీకి ఎవరూ సాటిరారు.

అంతేకాదు. సైనికులు ప్రయాణించేటప్పుడు పంట పొలాలను తొక్కగూడదనీ, ఏవైనా సరుకులు అవసరమైతే, వాటిని అంగళ్ళలో కొనాలనీ, అంతేకాని బలవంతంగా వర్తకుల నుండి స్వాధీనం చేసుకోకూడదనీ ఆదేశించాడు. ఆ రోజుల్లో సైనికులు పంటపొలాలను తొక్కుకుంటూ పోయేవారనీ, సరుకులను వర్తకుల నుండి బలవంతంగా తీసుకొనేవారనీ, వారికి ఏరకమైన నష్టపరిహారంగానీ, వస్తువుల ఖరీదుగానీ ఇచ్చేవారు కాదనీ, అందువలన రైతులు విరక్తి చెంది, తమ రాజు రాజపుత్రుడా, ముస్లిమా అనే విషయం పట్టించుకొనేవారు కాదనీ, అతను ఎవరైనా, తమను బాధించేవాడేగదా? అని ఉదాసీనంగా ఉండేవారనీ, అందువలన రైతులు తమకు కష్టం, నష్టం

కలగకుండా చూస్తున్న శివాజీని తమ రాజుగా భావించుకున్నారనీ 'గోవింద పన్సారే' అనే రచయిత "హూ యీజ్ శివాజీ" అనే గ్రంధంలో పేర్కొన్నారు" అన్నారు మాస్టారు.

"వ్యవసాయాభివృద్ధి కోసం శివాజీ ఏమైనా చేశాడా మాస్టారూ?" అడిగాడు శ్రీకాంత్.

"చేశాడు శ్రీకాంత్! వ్యవసాయదారులకు ప్రభుత్వం, ముందుగా అప్పులివ్వాలనీ, పంట వచ్చిన తర్వాత కొన్ని సంవత్సరాలలో కొన్ని వాయిదాలలో తీర్చుకోవచ్చుననీ, శివాజీ ఆదేశించాడు" అన్నారు మాస్టారు.

"శివాజీ అఖిల భారత హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించాలని కోరుకున్నాడా మాస్టారూ?" అడగింది మహాలక్ష్మి.

"లేదమ్మా. ఈ ప్రశ్నకు ప్రొ॥ వి.డి. మహాజన్ లాంటి చరిత్రకారులు అనేక మంది, కాదనే సమాధానమే చెప్పారు. దానికి రుజువులుగా, శివాజీ ఛత్రసాల్‌బందా అనే హిందూ వీరుని సహకారాన్ని తీసుకోవడానికి తిరస్కరించడాన్నీ, హిందూ వ్యాపారులను పదే పదే దోచుకోవడాన్నీ, వారు చెబుతున్నారు. అందువలన శివాజీ ఒక శక్తివంతమైన మరాఠా రాజ్యాన్ని స్థాపించాడని మాత్రమే మనం అర్ధంచేసుకోవాలి.

పిల్లలూ! ఇవీ శివాజీ జీవితమూ, ఆయన పరిపాలనా విశేషాలు. వచ్చే క్లాసులో ఔరంగజేబు వ్యక్తిత్వమూ, మతం విషయంలో ఆయన విధానమూ తెలుసుకుందాం." అంటూ లేచారు మాస్టారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 25వ భాగం. ఔరంగజేబు వ్యక్తిత్వము - మత విధానము

"పిల్లలూ! ఈ రోజు ఔరంగజేబు వ్యక్తిత్వమూ, మత విషయంలో ఆయన విధానమూ చెబుతానన్నానుగదా?" అన్నారు మాస్టారు.

"అవును మాస్టారూ!" అన్నారు పిల్లలందరూ.

"చెబుతాను వినండి. ఔరంగజేబు జీవితమంతా నిరాడంబరంగా గడిపాడు. విలాసాలకు, భోగభాగ్యాలకూ దూరంగా ఉండేవాడు. చివరకు చక్రవర్తి సింహాసనం గదిని కూడా నిరాడంబరంగా ఉంచాలని ఆదేశించాడు. ఆ గదిని చౌకగా లభించే వస్తువులతో అలంకరించాలనీ, గుమాస్తాలు వెండి సిరా కుండీలకు బదులు, మట్టి సిరా కుండీలు వాడాలనీ ఆదేశించాడు. అంతేకాదు; చక్రవర్తి జన్మదినాన జరిగే ఆడంబరాలు, ఆచారాలను కొనసాగించనీయలేదు. ఆ రోజున బంగారం, వెండితో తులాభారాన్ని తూయడం అనే ఆచారాన్ని అక్బరు, జహంగీర్, షాజహాన్ ల కాలంలో ఉండేది. ఆ ఆచారం సంస్థానాధీశులు, ప్రజలకు భారంగా ఉందని గ్రహించి, ఔరంగజేబు ఆ ఆచారాన్ని నిషేధించాడు.

మతాభిమానం విషయంలో ఔరంగజేబు సనాతనవాది. అయినా అతను తరచు సూఫీ బాబాలను సందర్శించి, వారి ఆశీస్సులను పొందేవాడు. పరిపాలనలో హిందువుల తోడ్పాటు యొక్క అవసరాన్ని గుర్తించాడు. అందువలననే మతం కారణంగా చూపి, ఒక పదవిని కోరుతూ, ఔరంగజేబుకు ఒక వినతిపత్రం సమర్పించబడినప్పుడు, అతడు ఇలా వ్యాఖ్యానించాడు. "మతంతో ప్రాపంచిక విషయాలకు ఉన్న సంబంధమేమిటి? నీవు సూచించిన విధంగా పదవులిస్తే, హిందూ పాలకులను, వారి అనుయాయులను వెలివేసే బాధ్యత నాదే అవుతుంది" అని ప్రఖ్యాత చరిత్రకారుడు ప్రొ॥ సతీష్‌చంద్ర "మధ్యయుగాల భారతదేశం" అనే గ్రంథంలో (పేజీలు 310,311) వెల్లడించాడు.

పిల్లలూ! పరిపాలన విషయంలో అలాంటి స్పష్టమైన అభిప్రాయం ఉండబట్టే, అక్బర్, జహంగీర్, షాజహాన్ ల కాలం కంటే, ఔరంగజేబు పాలనలో హిందూ సంస్థానాధీశుల శాతం బాగా పెరిగింది. అక్బర్ పాలనలో హిందూ సంస్థానాధీశులు 16 శాతం మంది ఉంటే, షాజహాన్ కాలంలో వారు 24 శాతానికి పెరిగి, ఔరంగజేబు కాలం నాటికి వారు 33 శాతానికి పెరిగారు. ఔరంగజేబు యొక్క పాలనాధికారుల్లో, హిందువులను ఒక్కసారి పరిశీలిద్దాం. రాజా జయసింగ్, రాజా జస్వంత్‌సింగ్, ఔరంగజేబు కు అత్యంత ఆప్తులని ఇంతకుముందే తెలుసుకున్నాం. శివాజీ ముఖ్య అనుచరుల్లో ఒకడైన తానాజీ, కొండానా కోటను మెరుపుదాడిలో పట్టుకున్నాడు. ఆ సమయంలో ఆకోట ఉదయభాను అనే ఔరంగజేబు యొక్క హిందూ సేనాని రక్షణలో ఉంది. ఔరంగజేబు మంత్రుల్లో ముఖ్యుడు రఘునాధదాస్ అనే రాజపుత్ర వీరుడు. ఇక ఔరంగజేబు సేనలో వేలాదిమంది జాట్లు, మరాఠాలు, రాజపుత్రులు ఉన్నారని చరిత్రకారులు చెబుతున్నారు.

అయితే రాజకీయ కారణాలతో, హిందూ దేవాలయాలు మొగల్ వ్యతిరేక సాంస్కృతిక కేంద్రాలుగా మారుతున్నాయన్న కారణంతో, ఔరంగజేబు, వారణాసి దేవాలయంతో సహా, అనేక దేవాలయాలలోని విగ్రహాలను పెకలించి వేయించి, వాటిని మూసివేయించినా, చరిత్రకారుల ఇటీవలి పరిశోధనల్లో ఔరంగజేబు అనేక దేవాలయాలకూ, సిక్కు గురుద్వారాలకూ జాగీర్లు రాసి ఇచ్చిన ఫర్మానాలు దొరికాయనే విషయం వెలుగులోకి వచ్చింది.

ఉదాహరణకు, 1948-53 మధ్య అలహాబాద్ నగర మేయర్‌గా పనిచేసిన ప్రముఖ చరిత్రకారుడు డా॥ భీషాంబర్‌నాథ్ పాండే దగ్గరకు ఇద్దరు ఆలయ పురోహితుల మధ్య ఉన్న భూవివాదం పరిష్కారానికై వచ్చింది. వారిద్దరిలో ఒక పురోహితుడు భూమికి సంబంధించిన ఆధారాలను ధాఖలు చేశాడు. అది ఆలయ పోషణ కోసం కొన్ని నగదు బహుమానాలతో బాటు, సదరు

భూమిని ఈనాం గా ఇస్తున్నట్లు, ఔరంగజేబు జారీ చేసిన ఫర్మానా. ఔరంగజేబు మత మౌఢ్యం గురించీ, హిందూ వ్యతిరేకత గురించీ, ఎంతో విని ఉన్న పాండే, ఈ ఫర్మానా నకిలీదై ఉంటుందని అనుమానించాడు. ఆ ఫర్మానా నిజమైనదో, నకిలీదో తేల్చమని, దానిని అరబిక్, పర్షియన్ భాషల్లో పండితుడైన సర్ తేజ్ బహదూర్ సప్రూకు అప్పగించాడు. ఆయన దానిని పరిశీలించి, అది నిజంగా ఔరంగజేబు జారీ చేసిన ఫర్మానాయేనని స్పష్టంచేశాడు.

ఔరంగజేబును గూర్చి మరింత లోతుగా పరిశోధించదలచుకొన్న పాండే, దేశవ్యాప్తంగా ఉన్న ప్రముఖ దేవాలయాలు, జైన మందిరాలు, గురుద్వారాల ప్రధాన అర్చకులకు అందరికీ "ఔరంగజేబు జారీ చేసిన ఫర్మానాలు మీవద్ద ఉంటే, వాటి నకళ్ళను పంపండి. సత్యశోధన కోసం ఈ విషయాన్ని అడుగుతున్నాను." అని లేఖలు వ్రాశాడు. అనూహ్యమైన స్పందన వచ్చింది. అనేక హిందూ, జైన దేవాలయాలు, సిక్కు గురుద్వారాల నుండి పాండేకు లేఖలు వచ్చాయి. అవి అన్నీ 1659-1685 మధ్య ఔరంగజేబు జారీచేసిన ఫర్మానాలు. ఆ ఫర్మానాలలో, ఆలయాలు, గురుద్వారాల పోషణకోసం పెద్ద ఎత్తున పంట భూములను దానం ఇచ్చినట్లు ఉన్నది. ఆ విధంగా పరిశోధన చేసిన డా॥ భీషాంబరనాథ్ పాండే 'ఔరంగజేబు సనాతనవాదియేకాని మతోన్మాదికాడు' అనే విషయాన్ని వెలుగులోకి తెచ్చాడు. ఈ విషయం తీస్త సెతల్వాడ్ రచించిన 'మన పాఠ్యపుస్తకాలు పిల్లలకు ఏం నేర్పిస్తున్నాయి" అనే పుస్తకం 32,33 పేజీల్లో ఉంది. అంతేకాదు; మరో ప్రముఖ చరిత్రకారుడు ప్రొ॥ సతీష్‌చంద్ర, తాను వ్రాసిన 'మధ్యయుగాల భారతదేశం' అనే గ్రంథంలో, "హిందూ దేవాలయాలకూ, మరాఠాలకూ, ఔరంగజేబు జాగీర్లు వ్రాసి ఇచ్చిన సందర్భాలు అనేకం ఉన్నాయి." అని వ్రాశారు. (309 పేజి).

ఐతే అప్పుడప్పుడూ, ఔరంగజేబులోని సనాతనవాది లేచి పడగవిప్పుతునే ఉన్నాడు. అతడు తన పాలనలోని 20వ ఏట హిందువులపై జిజ్యా పన్నును

విధించాడు. అయితే జిజ్యా పరిధి నుండి మహిళలు, పిల్లలు, వికలాంగులు, ఎలాంటి ఆదాయ వనరులు లేని వారిని మినహాయించాడు. అయితే, తన పాలనలోని చివరి రోజుల్లో ఔరంగజేబు జిజ్యానే అధికారికంగా రద్దు చేశాడు.

పిల్లలూ! ఇవీ ఔరంగజేబు వ్యక్తిత్వం, మత నమ్మకాలకు సంబంధించిన విశేషాలు. వచ్చే క్లాసులో మొగలుల పాలనా కాలంనాటి ఆర్థిక, వ్యాపార, మత నమ్మకాల పరిస్థితులు, సంగీత, సాహిత్య రంగాల విశేషాలు తెలుసుకుందాం" అంటూ మాస్టారు లేచారు.

పిల్లలు మాస్టారిని అనుసరించారు.



# 26వ భాగం. మొగలులకాలం నాటి పరిస్థితులు

"పిల్లలూ! ఈరోజు ముందుగా మొగలుల కాలంనాటి ఆర్థిక పరిస్థితులు తెలుసుకుందాం.

మొగలుల కాలంనాటి పరిస్థితులను, ఆనాడు భారతదేశాన్ని సందర్శించిన ఐరోపా వ్యాపారులు, యాత్రీకులు వివరంగా వ్రాశారు. ఆ కాలంలో పాలకవర్గాల ధనసంపత్తి విపరీతంగా పెరిగినా, కార్మికులు, కర్షకులు మాత్రం పేదరికంలోనే గడిపారని, వారు వ్రాశారు. సాధారణ ప్రజలకు శీతాకాలంలో చలినుండి తప్పించుకోవడానికి సరిపడ వస్త్రాలు కూడా ఉండేవి కావని డిలయే అనే వ్యాపారి వ్రాశాడు. ప్రజలు పాదరక్షలు లేకుండానే తిరిగేవారని నికటిన్ అనే యాత్రికుడు వ్రాశాడు. ప్రస్తుతం గ్రామాలలో ఉన్న విధంగానే, ఆనాడు కూడా గ్రామీణుల గృహాలు ఉండేవి. వారిలో చాలామంది పూరిగుడిశెల్లో నివాసముండేవారు. మంచాలు, వెదురుచాపలు మినహా, వారి ఇళ్ళలో ఇతర కలప సామాగ్రి ఉండేదికాదు. గ్రామాలలో చాలామంది ఇళ్ళలో కుమ్మరి తయారుచేసే మట్టికుండలు, వంటసామాగ్రి తప్ప, రాగి, ఇత్తడి కంచాలు, గరిటెలు కూడా ఉండేవి కాదు. అవి చాలా ఖరీదైనవి కనుక పేదలు వాటిని కొనుగోలు చేసేవారు కాదు. అంటరానివారు లేదా కమీన్(దళిత) కులానికి చెందిన వారందరూ భూమిలేని రైతులు, లేదా వ్యవసాయ కార్మికులుగానే ఉండేవారు. అప్పట్లో కరువు సర్వసాధారణంగా ఉండేది. అలాంటి కరువులు సంభవించినప్పుడు భూమిలేని నిరుపేద రైతులు, చేతివృత్తులవారే ఎక్కువగా నష్టపోయేవారు. వారికి సరైన తిండి కూడా దొరికేదికాదు. ఆ విధంగా గ్రామీణ సమాజం చాలా అసమానతలతో నిండిఉండేది. కొద్ది కొద్ది భూములున్న రైతులు గ్రామాలలో సాధారణంగా కొన్ని అగ్రకులాలకు చెందినవారే ఉండేవారు. వీరు దళిత, పేద వర్గాలను దోచుకొనేవారు. మరోవైపు ఆ రైతులను జమీందార్లు దోచుకొనేవారు." అన్నారు మాస్టారు.

"ఆకాలంలో పశ్చిమ దేశాలోల శాస్త్ర సాంకేతిక అభివృద్ధి బాగా జరిగిందిగదా? మరి మన దేశంలో ఎలా జరిగింది మాస్టారూ? అడిగింది మహాలక్ష్మి.

"అది కొంచెం బాధాకరమేనమ్మా! శాస్త్ర సాంకేతికాల అభివృద్ధిని నాటి మొగల్ పాలకులు నిర్లక్ష్యం చేశారు. పశ్చిమ దేశాల్లో శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం వృద్ధిచెందుతున్న విషయాన్ని ఆనాటి పాలకవర్గాలు విస్మరించాయి. కాకపోతే అక్బరు కాలంలో తుపాకుల వంటి ఆధునిక ఆయుధాల నిర్మాణం కొంత మెరుగుపర్చబడింది." అన్నారు మాస్టారు.

"వ్యవసాయాభివృద్ధి కోసం మొగలుల కాలంలో ఏమైనా చేశారా మాస్టారూ?" అడిగింది గీత.

"చేశారమ్మా! వ్యవసాయ విస్తరణ కోసం మొగల్ ప్రభుత్వాలు రైతులకు రుణాలు మంజూరు చేశాయి. వారి పాలనలో భూమి శిస్తు చెల్లించినంత కాలం రైతును అతడు సాగుచేస్తున్న భూమి నుండి వెలివేసే అధికారం ఎవరికీ ఉండేది కాదు ఇవీ వ్యవసాయాభివృద్ధి కోసం మొగలులు తీసుకున్న చర్యలు" అన్నారు మాస్టారు.

"వ్యాపారుల విశేషాలు, వ్యాపారాభివృద్ధి కోసం మొగలులు తీసుకున్న చర్యలను గూర్చి వివరించండి మాస్టారూ!" అడిగాడు మణి.

"మణీ! మొగలుల కాలంలో ధనిక వ్యాపారులను సేఠ్, బొహ్రా లేదా మోడీ అని పిలిచేవారు. ప్రతి కులానికి చెందిన వ్యాపారుల సముదాయానికి ఒక నాయకుడు ఉండేవాడు. అతడు తమ వర్గ కోరికలు, సమస్యలపై స్థానిక అధికారులతో సంభాషించి, పరిష్కారం కనుగొనడానికి ప్రయత్నించేవాడు. తమ కోర్కెల సాధనకు అహ్మదాబాద్ తదితర వ్యాపార కేంద్రాలలో వ్యాపారులు సమ్మె నిర్వహించిన సందర్భాలు కూడా ఉన్నాయి. వ్యాపారాభివృద్ధి కోసం

మొగలులు తీసుకున్న చర్యలలో ప్రధానమైనది ప్రధాన రహదారుల నిర్మాణం. ఆ రహదారుల్లో ప్రతి పది కిలోమీటర్లకూ ఒక సరాయి(సత్రం) ని నిర్మించారు. అవి ఐరోపాలో ఉన్న రహదారులకు ఏవిధంగానూ తీసిపోకుండా ఉండేవి. అవి ప్రజలకు కూడా ఎంతో సౌకర్యంగా ఉండేవి. మొగల్ పాలకులు వ్యాపారాభివృద్ధికి తీసుకున్న చర్యల కారణంగా, ఆ కాలంలో మనదేశం ఇతర దేశాలకు వస్తువులను ఎగుమతి చేసేవారు. ముఖ్యంగా బియ్యం, చక్కెర లాంటి ఆహారోత్పత్తులను పొరుగుదేశాలకు ఎగుమతి చేసేవారు." అన్నారు మాస్టారు.

"మొగలుల కాలంలో జరిగిన ప్రఖ్యాత నిర్మాణాలు వివరించండి మాస్టారూ!" కోరాడు శరత్.

"శరత్ ! మొగలుల కాలంలో జరిగిన నిర్మాణాలలో షాజహాన్ నిర్మించిన తాజ్‌మహల్ విశ్వ విఖ్యాత కట్టడం. అలాగే అక్బర్ నిర్మించిన ఆగ్రాలోని ఎర్రకోట, షాజహాన్ నిర్మించిన ఢిల్లీలోని ఎర్రకోట కూడా ఆ కాలంనాటి ప్రఖ్యాత కట్టడాలు. అమృత్‌సర్‌లోని సిక్కుల యొక్క ప్రఖ్యాత స్వర్ణ దేవాలయం కూడా మొగల్ సంప్రదాయాలున్న వాస్తు కళాశైలిలో నిర్మితమైంది" అన్నారు మాస్టారు.

"మొగలుల కాలంనాటి భాషాభివృద్ధిని గూర్చి చెప్పండి మాస్టారూ!" అడిగింది స్రవంతి.

"మొగలుల కాలంలో అనేక భాషల అభివృద్ధి జరిగిందమ్మా! అబుల్ ఫజుల్ అనే గొప్ప చరిత్రకారుడు వచన రచనలో కొత్త శైలిని ప్రవేశపెట్టాడు. చాలా కాలంపాటు, తర్వాతి తరాల వారు ఆయన శైలిని అనుకరించారు. అబుల్ ఫజుల్ సోదరుడు ఫైజీ పర్యవేక్షణలో మహాభారతం పార్శీ భాషలోకి అనువదించబడింది. ఆ కాలం నాటి మహాకవి తులసీదాస్, రామాయణాన్ని 'రామచరితమానస్' పేరుతో హిందీలో రచించాడు. ఈయన, ప్రజలను జన్మచేత కాకుండా, వ్యక్తిగత సామర్థ్యం కారణంగానే కులాలుగా వర్గీకరించాలనీ, అలాంటి

సంస్కరణవాద కుల వ్యవస్థ రావాలనీ కోరుకున్నాడు. ఈ కాలంలో ప్రాంతీయ భాషలు బాగా అభివృద్ధి అయ్యాయి. ఏక్‌నాథ్ అనే మరాఠీ కవి ప్రాంతీయ భాషల ప్రాశస్త్యాన్ని వివరిస్తూ, ఇలా వ్యాఖ్యానించాడు. "దేవుడు సంస్కృతాన్ని సృష్టిస్తే, ప్రాకృతం దొంగలు, దోపిడీదారులు సృష్టించినదా? ఈ మూర్ఖపు ఆలోచనలను ప్రక్కన పెట్టండి. భాషల పట్ల దేవుడు వివక్ష చూపడు. అతడి దృష్టిలో ప్రాకృతం, సంస్కృతం రెండూ సమానమే" ఇలా సాగాయి ఆనాటి ప్రాంతీయ భాషా కవుల ఆలోచనలు. ప్రాంతీయ భాషలను గూర్చి ఏకనాథ్ ఇలా వ్యాఖ్యానించడానికి కారణం ఏమిటంటే, ఆనాటి సంస్కృత కవులు తులసీదాస్ 'రామచరితమానస్' ను ప్రాంతీయ భాష హిందీలో వ్రాయడాన్ని ఆక్షేపిస్తూ, పవిత్రమైన రామకథను దేవభాష సంస్కృతంలో కాకుండా అన్య భాషలో వ్రాస్తాడా?" అని తీవ్రంగా నిరసించారు. దానికి సమాధానమే ఈ వ్యాఖ్య." అన్నారు మాస్టారు.

"మొగలుల కాలంలో సంగీత పోషణకు ఏం చేశారు మాస్టారూ?" అడిగింది నవ్య.

"అక్బరు ఆస్థానంలో తాన్‌సేన్ అనే మహా గాయకుడు ఉండేవాడమ్మా. జహంగీర్, షాజహాన్‌లు కూడా సంగీతాన్ని ఆదరించారు. ఔరంగజేబు అసలు సంగీతాన్నే నిలువు లోతులో పాతిపెడతానని అన్నట్లు ఒక కథ ప్రచారంలో ఉంది కాని అది చారిత్రక వాస్తవం కాదు. చరిత్రకారుల ఇటీవలి అధ్యయనాల్లో తేలిందేమిటంటే, ఔరంగజేబు తన పాలనలోని 11వ ఏట, తన ఆస్థానంలో గాత్ర సంగీతాన్ని నిషేదించినా, సంగీత విద్వాంసులకు భారీ సొమ్మును ముట్టజెప్పి, వారిని సాగనంపాడు. అయితే వాయిద్య సంగీతాన్ని, రాచరిక సంగీత బృందాన్నీ (నౌబత్) ప్రోత్సహించాడు. అంతేకాదు. ఔరంగజేబు వీణా వాయిద్యంలో దిట్ట అనీ, తన అంతఃపురంలోని రాణులు సంగీతాన్ని ప్రోత్సహిస్తుంటే, వారిని ఏనాడూ అడ్డగించలేదనీ ఇటీవలి అధ్యయనాలు

నిరూపిస్తున్నాయి." అన్నారు మాస్టారు.

"ఆ కాలంనాటి మత నమ్మకాలను గూర్చి వివరిస్తారా మాస్టారూ?" అడిగాడు మధుకర్.

"తప్పకుండా మధుకర్! మొగలుల కాలంలో భక్తి ఉద్యమం బాగా ఊపందుకొంది. మహారాష్ట్రలోని పంధార్‌పూర్‌లో తుకారామ్ భక్తి ఉద్యమాన్ని బలోపేతం చేశాడు. తాను శూద్రునికి జన్మించానని ప్రకటించిన తుకారామ్ తన స్వహస్తాలతోనే దేవుని పూజను నిర్వహించేవాడు. 15వ శతాబ్దంలోనే పంజాబ్‌లో ప్రారంభమైన సిక్కు ఉద్యమం గురునానక్ ప్రవచనాల ఆధారంగా అభివృద్ధి చెందింది. జహంగీర్ సమకాలీకుడైన అర్జున్‌దాస్ అనే 5వ సిక్కు గురువు 'గ్రంధసాహెబ్' అనే సిక్కుల పవిత్ర గ్రంధాన్ని పూర్తిచేసి, సిక్కు ఉద్యమాన్ని బలపరిచాడు.

అయితే, ఆ కాలంలో సనాతన భావాలను గూడా ప్రచారం చేసేవాళ్ళకు కొదువ లేదు. బెంగాల్‌కు చెందిన రఘునందన్ అనే బ్రాహ్మణుడు బ్రాహ్మణులకు ప్రత్యేక హక్కులు కొనసాగించాలని నొక్కి చెప్పాడు. అలాగే మహారాష్ట్రకు చెందిన సమర్ధరాందాస్ అనే గురువు "బ్రాహ్మణులకు ప్రత్యేక హక్కులు, హోదా ఉండాల"ని గట్టిగా వాదించాడు.

పిల్లలూ! ఇవీ ఆనాటి మత పరిస్థితులు. చివరగా ఒక ముఖ్యమైన అంశాన్ని చెప్పి మొగలుల కాలంనాటి పరిస్థితులను ముగిస్తాను. అదేమిటంటే, భారత్‌ను ఆక్రమించుకోవడానికి, ఆంగ్లేయులు, ఫ్రెంచివారు ఉత్సాహం చూపారు. అయితే మొగల్ పాలనలో దేశం సమైక్యంగా, శక్తివంతంగా ఉన్నంతవరకు, వారి ప్రయత్నాలు సఫలం కాలేదు. ప్రాంతీయ సుబేదార్లు కూడా ఆ కాలంలో సమర్ధవంతంగా పరిపాలిస్తుండేవారు. అంతర్గత, బాహ్య కారణాలు వీరందరినీ బలహీనపరచినప్పుడు మాత్రమే ఆంగ్లేయులు, ఫ్రెంచివారు విజయాలు సాధించి, క్రమంగా దేశాన్ని ఆక్రమించుకోగల్గారు.

పిల్లలూ! మధ్య యుగాల భారతదేశ చరిత్రను ఇక ముగించుకుందాం. 1707లో ఔరంగజేబు మరణించాడు. ఆ తర్వాత వచ్చిన మొగల్ పాదుషాలందరూ అసమర్థులూ, బలహీనులే. అందువలననే మహమ్మద్‌షా పాలనా కాలంలో 1739లో నాదిర్‌షా అనే దండయాత్రీకుడు మొగల్ చక్రవర్తిని నిర్బంధించి, ఢిల్లీని దోచుకోగల్గాడు. అపారమైన ధనరాశులతో పాటు బంగారు నెమలి సింహాసనాన్ని, కోహినూర్ వజ్రాన్నీ దేశం నుండి తరలించుకుపోయాడు. చివరకు 1857 లో ఢిల్లీ పాదుషా రెండవ బహదూర్ షా నాయకత్వంలో ఝాన్సీ లక్ష్మీబాయి, నానాసాహెబ్, తాంతియాతోపే, బేగం హజరత్ మహల్ లాంటి వీరులు చేసిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో భారతీయులు ఓడిపోవడంతో, ఆంగ్లేయులు రెండవ బహదూర్‌షాను ప్రవాసానికి పంపారు. దానితో మధ్యయుగాల భారతదేశ చరిత్ర ముగిసి, ఆధునిక భారతదేశ చరిత్ర మొదలయింది.

పిల్లలూ! మరో ముఖ్యమైన విషయాన్ని తెలియజేసి, ఈ చరిత్రను ముగిస్తాను.

మధ్యయుగాలలో మత సామరస్యం వెల్లివిరిసింది. హిందూ రాజులకు ముస్లిం సేనానులు, అంగరక్షకులు, దూతలూ,ఉండేవారనీ, అలాగే ముస్లిం రాజులకు హిందూ సేనానులూ, మంత్రులు, దూతలూ ఉండేవారనీ, హిందూ రాజులు హిందువులతోనూ, ముస్లిం రాజులు ముస్లింలతోనూ తీవ్ర యుద్ధాలు చేసుకున్నారనీ అనేక రుజువులతో క్రిందటి క్లాసులో తెలుసుకున్నాం. యుద్ధాలలో ముస్లిం రాజులకు హిందూ రాజులూ, హిందూ రాజులకు ముస్లిం రాజులూ సహకరించారు. హిందూ రాజులు మసీదులు కట్టించారు. ఉదాహరణకు రాయ్‌గడ్‌లో శివాజీ ఒక మసీదును కట్టించాడు. ముస్లిం రాజులు హిందూ దేవాలయాలకు జాగీర్లు, ఈనాములూ ఇచ్చారనే విషయం తెలుసుకున్నాం. ఇక దోపిడీలంటారా? ముస్లిం రాజులో కాదు, హిందూ రాజులు కూడా సంపన్న

హిందూ వ్యాపారులను పదేపదే దోపిడీలు చేశారని అనేక సందర్భాలలో విన్నాం. అంటే రాజులలోగానీ, ప్రజలలో గానీ, పరమత ద్వేషం లోదనీ, వారిలో మతసామరస్యం వెల్లివిరిసిందనే విషయం రూఢీగా తెలిసింది. కానీ, భారతదేశ చరిత్రను సమగ్రంగా, వివరంగా ఆంగ్లంలో మొదటగా వ్రాసిన సర్ హెన్రీ ఇలియట్ 8 సంపుటాల "హిస్టరీ ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో చరిత్రను భయంకరంగా వక్రీకరించాడు. ఇలియట్ తర్వాత భారతదేశ చరిత్రను వ్రాసిన ఆంగ్లేయ చరిత్రకారులూ, మతతత్వ చరిత్రకారులూ ఇలియట్ చేసిన వక్రీకరణనే మక్కికి మక్కి కొనసాగించారు. ఇంతకీ ఇలియట్ ఏమని వ్రాశాడు? "మధ్యయుగాలలో మద్యం మత్తులో మునిగిన ముస్లిం నిరంకుశ రాజుల చేతుల్లో హిందువులు ఊచకోతకు గురయ్యారనీ, వారు భయపెట్టి మతాంతర వివాహాలకు ఒప్పించారనీ, హిందువుల పూజలు, ఉత్సవాలు, ఊరేగింపులూ నిషేధించబడ్డాయనీ వ్రాసి రెండు మతాల మధ్య సంఘర్షణాత్మక వైఖరిని సృష్టించాడు. తన రచనకు ఆధారంగా, ఇలియట్,తన ముందటి కాలంనాటి బ్రిటిష్ అధికారుల నివేదికలనూ, వారందించిన సమాచారాన్నీ తీసుకున్నాడు. విచిత్రమైన విషయం ఏమిటంటే, దాదాపు 900 సంవత్సరాల ముస్లిం పాలనలో ముస్లింలవల్ల తాము కష్టాలు అనుభవించామనిగానీ, తమ జీవితాలపై ముస్లిం పాలన చెడు ప్రభావాన్ని కలిగించిందనిగానీ, తెల్పుతూ మనకు ఒక్క వివరణనుగానీ, ఆధారాన్నిగానీ హిందూ కవులూ, రచయితలూ ఎందుకు మిగల్చలేదని ఇలియట్టే స్వయంగా ఆశ్చర్యం వ్యక్తంచేశాడు. 900 సంవత్సరాల పాటు ఏ హిందువూ బాధపడలేదని ఈ విషయం రుజువుచేస్తోంది. మరి హిందువులు వెలిబుచ్చని బాధను, ఆంగ్లేయ అధికారులూ, ఆంగ్లేయ చరిత్రకారులూ ఎందుకు వెలిబుచ్చినట్లు? వారు విషపూరిత సమాచారంతో చరిత్రను ఎందుకు నింపారు? దీనికి సమాధానం బ్రిటన్ ప్రభుత్వంలో భారతదేశ వ్యవహారాల కార్యదర్శి జార్జి హామిల్టన్, 1895-99 మధ్య భారత గవర్నర్ జనరల్ గా పనిచేసిన లార్డ్‌కర్జన్‌కు ఇచ్చిన ఆదేశంలో దొరుకుతుంది. హామిల్టన్

ఆదేశంలో ఏమున్నదంటే, "ఒక వర్గానికీ, మరో వర్గానికీ మధ్యనున్న విభేదాలు మరింత బలోపేతమయ్యే విధంగా చరిత్రనూ, విద్యా విధానాన్నీ, పాఠ్యపుస్తకాలనూ, పాఠ్యాంశాలనూ రూపొందించాలి." ఇదీ విషపూరితమైన హామిల్టన్ ఆదేశం! ఆ విష బీజం మొదటగా బ్రిటిష్ అధికారులు రూపొందించిన సమాచారంతో మొదలై "భారతదేశ చరిత్ర"లో చేర్చబడి, చివరకు పాఠ్యాంశాలలో ప్రవేశించింది. ఇదీ మతోన్మాద పూరితమైన భారతదేశ చరిత్ర రచన వెనుకనున్న అసలు విషయం.

కాబట్టి పిల్లలూ! ఆధునిక చరిత్రకారుల ఎంతో శ్రమకోర్చి మరెంతో పరిశోధనచేసి, తెలుసుకున్న మత సామరస్య పూరిత చరిత్రను మనమందరం అర్థంచేసుకొని, ప్రజలందరూ ఐక్యమత్యంతో నడిచే సుందరమైన బాటలో మీరు పయనించి, ప్రజలను నడిపిస్తారని ఆశిస్తున్నాను" అన్నారు మాస్టారు.

"తప్పకుండా మాస్టారూ!" అన్నారు పిల్లలందరూ.

మాస్టారు సంతృప్తితో, చిరునవ్వుతో క్లాసునుండి బయటకు నడిచారు.

పిల్లలందరూ మాస్టారిని అనుసరించారు.



పుస్తక ప్రచురణకు
సహకరించిన మిత్రులకు,
బంధువులకు, శ్రేయోభిలాషులకు,
అభినందనలతో...

